

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM


## మనస్సునెలా జయించాలి

ఆధ్యాత్మికరంగంలో అధైర్యానికి, పిరికితనానికి తావు లేదు. ప్రకృతిని, అవిద్యను జయించడం సామాన్యమైన పని కాదు. ఆ పనికి ఇనుపకండరాలు, ఉక్కునరాలు, గంభీరబుద్ధులు అవసరం. ఉపనిషత్తులన్నీ ఈ సత్యాన్నే తెలియజేస్తున్నాయి.

ఓ పిల్లవాడిని కోతి తరముతోంది.వాడు పారిపోతుంటే త్రోవలో ఓ పెద్దమనిషి"నాయనా! పారిపోవద్దు. వెన్ను చూపితే అది నిన్ను ఇంకా తరుముతుంది. కనుక వెనక్కి తిరిగి కోతిని ధైర్యంతో ఎదుర్కో" అని చెప్పేసరికి ఆ పిల్లవాడు అలాగే చేశాడు. కోతి భయపడి పారిపోయింది.

ప్రకృతితోటి మనం చేసే సంగ్రామం ఇలాగే వుంటుంది. ధైర్యం, నిర్భయత్వం, నిర్విచారత్వం- ఇవే పరమార్థరంగంలోని మూలమంత్రాలు.

ఇవి వున్నవారికే అక్కడ దారి దొరుకుతుంది. తక్కినవారికి దొరకదు. కనుక ధైర్యాన్ని అవలంబించి మెల్లమెల్లగా మనస్సును స్వాధీనపరచుకోవాలి. తొందరపడకూడదు. కంగారుపడేవాడు తన కర్తవ్యాన్ని మరిచిపోగలడు.

కనుకనే గీతాచార్యుడు సాధకుని ఉద్దేశించి 'శనైః శనైః' (మెల్లమెల్లగా) అని ఉపదేశించాడు.

అయితే కొందరు తీవ్ర వైరాగ్యంతో ప్రేరేపించబడినవారై అంతా వదిలిపెట్టి ఒకేసారి అమాంతంగా మోక్షానికి గంతు వేయవలెనని తలచి,

చివరికి తన మనస్సును జయించలేక, దేహాన్ని మాత్రం ఉపవాసాలతో క్షోభపెట్టి ఉభయభ్రష్టతను పొందుతున్నారు.

అది చూసే శ్రీకృష్ణపరమాత్మ 'సాధకుడా! ఒక్కొక్క నియమాన్ని ఆచరణలో పెట్టుకుంటూ, తొందరపడక, మనస్సును ప్రశాంతంగా లొంగదీసుకో' అని హితవు చెప్పాడు.

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వామి



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 2.2.2018 | సంచిక 31

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Punctuality is the soul of business

### సీరియల్స్



### కథలు





ముఖచిత్రం : కనువిందు

Courtesy : Daimond World

### స్పెషల్ ఫీచర్స్



### శీర్షికలు




E-mail: advtswati@gmail.com swativja@eth.net

Editor: VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM

Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad

Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



సాక్షి

19.1.2018

'సామ్రాట్ సముద్రగుప్త' సీరియల్ ప్రారంభంలోనే ఆకట్టుకుంది. స్పెషల్ ఫీచర్ 'ఫుట్ మసాజ్' చాలా బాగుంది. 'అంతా రాజకీయమే' శీర్షిక ద్వారా వారం వారం రాజకీయాల గురించి తెలుసుకుంటున్నాం.

'సాహో వాసంతీ' కామెడీ కథ చాలా బాగుంది. అలాగే 'చిలిపి' బాగుంది.

'నేనెవరో తెలుసా!' శీర్షిక ద్వారా వారం వారం కొత్త చరిత్రలు తెలుసుకుంటున్నాం. అలాగే 'ఫర్ U' శీర్షిక ఆరోగ్యానికి ప్రధానం.

'B హ్యాపీ' శీర్షిక ఫన్నీగా ఉంది.

చిన్నా ఖమ్మం

మన తెలుగువారి సంప్రదాయాలను పండుగనాడు చేసే దానాలను 'సంక్రాంతి సంప్రదాయం' వ్యాసంలో ఎంతో చక్కగా వివరించారు.

పితృలోకాల్లో ఉండే మనపెద్దలను తలుచుకునే రోజు పెద్ద పండుగ

## వచ్చేవారం స్పెషల్

### జీవితానికో పాఠం

అనే విషయాన్ని 'రైతుల పండుగ' ఫీచర్ ద్వారా తెలుసుకున్నాం.

సీరియల్ 'సామ్రాట్ సముద్రగుప్త' ప్రారంభంలోనే ఆకట్టుకుంది.

'సాహో వాసంతీ...' కామెడీ కథ అలాగే నవ్వించింది.

జి.వి.మురళీమోహన్ ముప్పుమిల్లి

'సంక్రాంతి సంప్రదాయం' స్పెషల్ ఫీచర్ చాలా బాగుంది.

'సామ్రాట్ సముద్రగుప్త' కొత్త సీరియల్ ప్రారంభమే ఉత్సుకత రేపింది.

'అంతా రాజకీయమే', 'ఫర్ U', 'B హ్యాపీ' శీర్షికలు బాగున్నాయి.

జె.ధర్మతేజ గొడారిగుంట



## © మహారాజ పోషకులు మన్నించాలి

దాదాపు ఐదు దశాబ్దాలకుపైగా స్వాతిని ఆదరిస్తున్న పాఠకదేవుళ్ళకు నమస్కారం.

సంవత్సర చందాదారులైన మహారాజ పోషకులకు ఏ కారణంవల్లనైతేనేమి స్వాతి సకాలంలో చేరటంలేదని ఫిర్యాదులు వస్తున్నాయి.

చందాదారులకు కల్గుతున్న ఇబ్బంది దృష్ట్యా తప్పనిసరి పరిస్థితుల్లో స్వాతికి ఇకమీదట చందాలు అంగీకరించలేక పోతున్నందుకు మన్నించాలి.

-ఎడిటర్

# ఇది మంచి సమయం



**25.1.2018 నుండి 31.1.2018 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, శిశిర ఋతువు, మాఘమాసం, శుక్లపక్షం.**

**25.1.2018 గురువారం**
తిథి: అష్టమి మ. 3.14 వరకు
నక్షత్రం: అశ్విని ఉ. 8.21 వరకు
వర్జ్యం: సా. 5.30-7.10 వరకు
దుర్ముహూర్తం : ప. 10.17-11.01 వరకు. మ. 2.43-3.27 వరకు
రాహుకాలం: మ.1.30-2.53 వరకు
మంచి సమయం: ఉ. 7.50 నుండి 8.20 వరకు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.53కి

**26.1.2018 శుక్రవారం**
తిథి: నవమి మ. 1.32 వరకు
నక్షత్రం: భరణి ఉ. 7.30 వరకు. కృత్తిక తె. 6.03 వరకు
వర్జ్యం: సా. 6.45-8.16 వరకు
దుర్ముహూర్తం: ప.8.48 నుండి 9.32 వరకు. మ. 12.30-1.14 వరకు
రాహుకాలం: ప.10.46-12.08 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.53కి

**27.1.2018 శనివారం**
తిథి: దశమి ప. 11.15 వరకు
నక్షత్రం: రోహిణి తె. 4.05 వరకు
వర్జ్యం: రా. 8.44-10.12 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.35-8.04 వరకు
రాహుకాలం: ప. 9.23-10.46 వరకు
మంచి సమయం: ప. 9.30 నుండి 10.55 వరకు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.54కి

**28.1.2018 ఆదివారం**
తిథి: ఏకాదశి ప. 8.38 వరకు. ద్వాదశి తె. 5.18 వరకు
నక్షత్రం: మృగశిర రా. 1.42 వరకు
వర్జ్యం: ప. 9.07-10.33 వరకు
దుర్ముహూర్తం: సా.4.14-4.58 వరకు
రాహుకాలం: సా. 4.19-5.42 వరకు
మంచి సమయం: ఉ. 7.50-8.35 వరకు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.55కి

**29.1.2018 సోమవారం**
తిథి: త్రయోదశి రా. 1.53 వరకు
నక్షత్రం: ఆర్ద్ర రా. 11.04 వరకు
వర్జ్యం: ప. 9.11-10.37 వరకు
దుర్ముహూర్తం : మ. 12.28 నుండి 1.12 వరకు. మ. 2.41-3.25 వరకు
రాహుకాలం: ఉ. 7.59-9.21 వరకు
మంచి సమయం: ఉ. 7.35 నుండి 9.00 వరకు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.55కి

**30.1.2018 మంగళవారం**
తిథి: చతుర్దశి రా. 10.23 వరకు
నక్షత్రం: పునర్వసు రా. 8.18 వరకు
వర్జ్యం: ప. 9.41 నుండి 11.06 వరకు. రా. 3.24 నుండి 4.49 వరకు
దుర్ముహూర్తం: ప. 8.48 నుండి 9.32 వరకు. రా. 10.49-11.33 వరకు
రాహుకాలం: మ.2.52-4.15 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.37కి
సూర్యాస్తమయం: 5.56కి

**31.1.2018 బుధవారం**
తిథి : పూర్ణిమ సా. 6.57 వరకు
నక్షత్రం: పుష్యమి సా. 5.36 వరకు
వర్జ్యం : తె. 5.04-6.30 వరకు
దుర్ముహూర్తం: ప. 11.45-12.29 వరకు
రాహుకాలం: మ. 12.07-1.30 వరకు
మంచి సమయం: ఉ. 7.30 నుండి 9.00 వరకు
సూర్యోదయం: 6.36కి
సూర్యాస్తమయం: 5.56కి

*మీరు అడ్డంకులను ఎదుర్కోగలరు.

# పెరుగుతూ ఉన్న బాల్యపు ఊబకాయం



డా॥ బి. నర్సయ్య
M.S., F.A.I.S., F.I.C.S., FMAS
Laparoscopic & Obesity Surgeon
Dept. of Minimal Access Surgery
Bariatric Metabolic Institute

స్టార్ హాస్పిటల్స్, రోడ్ నెం.10, బంజారాహిల్స్, హైదరాబాద్.

అధిక శక్తి, తక్కువ పోషక ఆహారాలు కలిగిన ఆహారపదార్థాల సేవనంతో పిల్లల ఆహార అలవాట్లలో ఒక తీవ్రమైన మార్పు ఇంకా శారీరక వ్యాయామం లేకపోవడం అనేది పిల్లలలో పెరుగుతున్న ఊబకాయ స్థాయిలకు అద్భుతంగా దోహదపడింది. ఇది వరకు, స్కూల్లో ఒక సెక్షన్లో ఒక ఊబకాయం బిడ్డ ఉంటే, ఇప్పుడు తరగతిలో కనీసం ఒక ఊబకాయం బిడ్డ ఉంటున్నారు. ఈత, నృత్యం లేదా నిత్యప్రాతిపదికన ఫుట్బాల్ లేదా క్రికెట్ వంటి ఆరుబయటి ఆటల రూపంలో గాని శారీరిక వ్యాయా-మానికి గల అవసరాన్ని ఈ మార్పులు వెలుగులోకి తెచ్చాయి, ఇవి బిడ్డ ఆరోగ్యాన్ని మెరుగుపరచడంలో ఎంతో దూరం సహాయం చేస్తాయి.

బాల్యపు ఊబకాయం అనేది ఇంత ఆందోళన చెందవలసిన విషయం కావడానికి కారణం ఏమిటంటే, 15 నుండి 20 శాతంమంది పిల్లల్లు అధిక బరువు కలిగి ఉన్నారని మరియు 30 శాతంమంది వారికి యుక్త-వయస్సు వచ్చే నాటికి ఈ శ్రేణిలోకి వచ్చే ప్రమాదం కలిగి ఉన్నారని భారతదేశంలో నిర్వహించిన అధ్యయనాలు చూపాయి కాబట్టి.

ఎక్కువ మంది తల్లిదండ్రులు వారి పిల్లలు చిన్న తరగతుల్లో ఉన్నప్పుడు వారిని ఈతలో నమోదు చేసేందుకు చాలా ఉషారుగా ఉంటారు. కానీ ఒకసారి వారు VIIIవ తరగతిలోకి అడుగుపెడితే, చదువుల ఒత్తిడి కారణంగా శారీరక శ్రమ స్థాయి విపరీ-తంగా తగ్గిపోతుంది. వారు పోటీ పరీక్షల్లో తప్పక పాల్గొనాలి కాబట్టి లేదా సాధారణ పాఠ్యాంశాలు అర్థంచేసుకుని నెగ్గాలి కాబట్టి కూడా బిడ్డ బలవంతంగా చదవవలసి వస్తుంది. ఆ కారణంచేత, కౌమారదశలో శారీరిక వ్యాయామాన్ని గంభీరంగా తీసుకునే పిల్లలు మనకి చాలా తక్కువ మంది ఉంటారు. తర్వాత, వాళ్ళని ఒక సమస్య దెబ్బతీసే వరకు ఈ ఎగవేయడం అనేది కొనసాగుతోంది.

చదివేది ఏ తరగతి అనేదానితో సంబంధం లేకుండా, చదువు మరియు ఆట మధ్య సరైన సంతులనం నిర్వహించడం పిల్లలకు చాలా ముఖ్యం. ఒక గంటసేపు వాళ్ళ బిడ్డని ఆరుబయట ఆటుకోవడానికి అనుమతించడంలో ఉండే శాస్త్రీయ ప్రయోజనాలను తల్లిదండ్రులు తెలుసుకుని ఉండాలి..

ఒక గంటసేపు సైక్లింగ్, స్కిప్పింగ్, క్రికెట్, ఫుట్బాల్, బ్యాడ్మింటన్ లేదా ఈతగాని పిల్లలని రిఫ్రెష్ చేస్తుంది మరియు అధిక బరువు, బద్ధకం, వీడియో గేమ్లు ఆడటం లేదా మితిమీరిన టెలివిజన్ సమస్యలకి దూరంగా ఉంచుతుంది. చాలా మంది పిల్లలు ఎదురు చూసేది ఇంకా వారిని వంచించడానికి వీలులేనిది ఆ ఒక్క గంట సమయం.

అది బిడ్డ ఆరోగ్యానికి ముఖ్యం కాబట్టి తల్లిదండ్రులు అవసరమైన జీవనశైలి మార్పులు తప్పక చేయాలి. తల్లిదండ్రులు ఇద్దరూ ఉద్యోగం చేయవలసి ఉంటుంది అనే విషయం అర్థం చేసుకోవడమైంది కానీ తర్వాత మొత్తుకోవడం కంటే వ్యక్తిగత స్థాయిలో ఒక విధానాన్ని ఏర్పరచుకోవడం మంచిది. పట్టణాల్లోని తల్లిదండ్రులకు సామూహిక మార్గద-ర్శకత్వం అవసరం లేదా ఆరుబయటి కార్యకలాపాలు వారి పాఠ్య ప్రణాళికలో ఒక భాగంగా ఉన్న పాఠశాలల్లో వారి పిల్లల్ని చేర్పవలసి ఉంటుంది. బిడ్డ ఫిట్ గా మరియు ఆరోగ్యంగా ఉండటంలో ఇది ఎంతగానో తోడ్పడుతుంది.



# ఒక చిన్నమాట

ప్రతిరోజూ తెల్లవారుతుంది. రకరకాల పనులతో తలమునకలూ, ఒత్తిడులు, సమస్యలు ఎదుర్కొంటూ రాత్రికి విశ్రాంతి తీసుకుంటాం. మళ్ళీ తెల్లవారుతుంది.

ఒకేరకమైన జీవితమైనా,గడియారం ప్రకారం నడుస్తున్నట్టయినా యాంత్రిక జీవితాన్ని మనం కోరుకోము. అన్ని రోజులూ ఒకలాగే ఉన్నట్టనిపించినా సూక్ష్మంగా ప్రతిదినమూ మన కొక్క నూతనత్వాన్నిస్తుంది. అదే మనలో ఉత్సాహం నింపుతుంది. జీవితాన్ని ఎదుర్కొనే శక్తినిస్తుంది.

కొత్త ఆశలు చిగురిస్తాయి. కొత్త ప్రయత్నాలు మొదలవుతాయి. తత్త్వవేత్తలు, స్ఫూర్తిదాతలు, ఆధ్యాత్మిక గురువులు, వివిధ రంగాలలో అనుభవజ్ఞులు మన జీవితం మరింత మెరుగుపరుచుకోటానికి, మన జీవితాన్ని సాధ్యమైనంతవరకు నియంత్రణలో పెట్టుకుని ఆనందంగా జీవించటానికి కొన్ని సూచనలిస్తారు.

సూత్రాలు చెపుతారు. మనం ఎన్నోసార్లు విని ఉంటాం. చదివి ఉంటాం. ఎన్నో మూలాల నుండి నేర్చుకుని ఉంటాం. అయినా ఆచరణలో ఎక్కడో వెనుకబడుతాము. అందుకే ఏదో ఒక నిరాశకు, దుఃఖానికి గురవుతూ భారమైన బతుకు గురించి చింతిస్తుంటాము.

అయినా ఈ సందేశాలు ఎన్ని వింటే, ఎన్ని సార్లు వింటే అంత మంచిది.

చేతనావస్థలోనో,అచేతనావస్థలోనో అవి మన మీద ప్రభావం చూపి జీవితాన్ని సంతృప్తికరంగా జీవించటానికి దోహదంచేస్తాయి.

జర్మనీలో పుట్టి కెనడాలో ఉంటున్న ఎకార్ట్ టోల్ తన ఆధ్యాత్మిక సూచనలకు ఎంతో పేరు గాంచారు. ఆధ్యాత్మిక గ్రంథకర్తగా ఎంతో ఖ్యాతి నార్జించారాయన.

బాగా ప్రచారం పొంది అమ్ముడుపోయిన (బెస్ట్ సెల్లర్సు) పుస్తకాలలో 'ది పవర్ ఆఫ్ నౌ' (1997), ఎ న్యూ ఎర్త్ (2005)లను పేర్కొంటారు. 'ప్రస్తుతం యొక్క శక్తి', 'నూతన పృథ్వి' అనే పేర్లు గొప్ప సందేశాన్నిస్తున్నాయి.

జీవితానికి సంబంధించిన కొన్ని విషయాలపై ఎకార్ట్ టోల్ అభిప్రాయాలు తెలుసుకుందాం. ఈయన ఆధ్యాత్మికత విషయమై భిన్నమైన గ్రంథాలు చదివినా తాను ప్రత్యేకంగా ఏ మతంగురించీ బోధించరు. ఎవరికైనా బోధించవలసిన విషయమేదీ తనవద్దలేదనే చెపుతారు.

మనల్ని సత్యానికి దగ్గరగా తీసుకుపోవటమే తన ఉద్దేశమట. ఆ సత్యంకూడా ఇదివరకే మన హృదయాల లోతుల్లో ఉన్నదేనట.

ప్రస్తుతం యొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించమని, ఆధారపడే తత్త్వాన్ని విడనాడమని, 'అహం'ను విడిచిపెట్టమని అప్పుడే ఆనందం మన స్వంతమవుతుందని ఎ కార్ట్ టోల్ చెపుతారు.




డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in


నూతన సంవత్సరంలో నూతన విషయాలు తెలుసుకుని స్ఫూర్తిదాయకంగా జీవితాన్ని కొనసాగించాలనుకునేవారికి ఎకార్ట్ టోల్ మాటలు ఎంతో సహాయకారిగా కూడా ఉంటాయి. 'ప్రస్తుతం' అత్యంత అమూల్యమైన సమయం. గతం జ్ఞాపకాల దొంతర.

భవిష్యత్తు ఒక ఆశ. ఈ రెండూ భ్రమలే. రాబోయే క్షణం ఈ క్షణంకంటే ముఖ్యమైనదని భావించటమే గొప్ప పొరపాటు. ఈ క్షణంలో జీవిస్తే నాణ్యత, ప్రేమ, అభిమానం అనుభవించగలుగుతాము.




ప్రేమనేది మనకు బయట లభించదు. అది మనలోనే దాగి ఉంటుంది. జీవితమంతా ప్రేమకోసం బయట పాకులాడుతాము. తల్లిదండ్రులు, భార్య, బిడ్డ, స్నేహితుడు మరొకరు మనల్ని ప్రేమించాలని బాహ్య ప్రపంచంవైపు చూస్తాము. తిరస్కారానికి బాధపడతాము. వాస్తవానికి ప్రేమ మనలోనే ఉంది. అదొక మానసిక స్థితి.

మన చైతన్యం పరిణామం చెందటానికి అవసరమైన అనుభవాన్ని జీవితం మనకిస్తుంది. మనం ఫిర్యాదుచేసే పరిస్థితులు జీవితం మనకు బోధిస్తున్న పాఠాలు. మనకు అవసరమైన పాఠాలు అది నేర్పుతుంది గాని మనము కోరుకున్న పాఠాలు కాదు.

వ్యతిరేక భావాలు పెంపొందించుకుని వ్యతిరేకంగా ఆలోచించే కొద్దీ దుఃఖం తప్పదు. ఒత్తిడి విడువదు. దేనిగురించైనా మనకు ఫిర్యాదు ఉంది అంటే ఉన్న దానిని మనం అంగీకరించటంలేదన్నమాట.

ఇతరులలో ఉన్న దేనిని మనం తీవ్రంగా వ్యతిరేకిస్తామో అది మనలోకూడా ఉంటుందని ఎకార్ట్ టోల్ చెపుతారు. గతంపట్ల గౌరవం ఉండటం మంచిదే. అది అపురూపంకూడా కావచ్చు కాని దానిలో మునిగిపోవటమంటే కొత్తకు స్థానం కల్పించటంలేదన్నమాట.

గతాన్ని గుర్తించి, మన పొరపాట్లనుండి నేర్చుకుని,ప్రస్తుతంమీద దృష్టిని నిలిపి ముందుకు సాగాలి.

మన వ్యక్తిత్వం, మనము మన మెదడుకంటే మిన్న. విసుగు, కోపము, దుఃఖము, సంతోషం మన వాస్తవ స్థితి కాదు. అవిమనమెదడుకు సంబంధించినవి. నిజమైన ప్రేమ ఉన్న చోట 'నేను' అనే అహం ఉండదు. ఏమీచెయ్యకుండా ఉండటంకంటే ఏదోఒక పనిచెయ్యటమే మంచిది.

కొద్దో గొప్పో నేర్చుకునే అవకాశం ఉంటుంది. జీవితం చాలా గంభీరమైన విషయమని భావించి దానిపట్ల అంతే గంభీరంగా ప్రవర్తించవలసిన అవసరంలేదు. మనం నియంత్రించగలిగినవి ప్రశాంతత, ఆనందం మాత్రమే. కాని వీటిని వెతకటం ప్రారంభించామంటే వెతలే మిగులుతాయి.

మన ఆనందం బయట పరిస్థితులమీద ఆధారపడకూడదు. మన ఆలోచనలు మనం నియంత్రించుకోవచ్చు. దృక్పథం మార్చుకోవచ్చు.

ఆనందం పొందవచ్చు.

సర్వే జనాః సుఖినో భవంతు!

# 60% క్యాన్సర్స్ 65 ఏళ్ళు పైబడిన వారికి వస్తున్నాయి.

## NCI తాజా సర్వేలో వెల్లడి

జీవం ఉండే ప్రతి కణం క్యాన్సర్ బారిన పడే ప్రమాదం ఉంటుంది. అందుకే మొక్కలతో సహా ఈ సృష్టిలో జీవరాశి అంతా ఈ ప్రాణాంతక వ్యాధి బారినపడ్తూ ఉంటాయి. మన శరీరంలో కణాలు పరిపక్వ స్థితికి రాగానే ఒకటికి ఎన్నోకణాలుగా విభజన చెందుతూ ఎప్పటికప్పుడు కొత్త కణాలు ఏర్పడుతూ ఉంటాయి. వయస్సు పైబడే కొద్ది ప్రతి కణానికి కాలం చెల్లి సమయం దగ్గర పడ్తూ ఉంటుంది. చిన్న వయస్సులో శరీర కణాలు వేగంగా వృద్ధి చెందుతూ ఉంటాయి కాబట్టి ఎదుగుదల సాధ్యం అవుతుంది. పెద్దవారు అయ్యేకొద్ది కణాలు విభజన చెందటం వృద్ధి చెందటం నిదానము అయి శరీరం ఎదుగుదలఆగిపోతుంది. పాతగా అయిపోయిన కణాలను భర్తి చేయటానికి మాత్రమే కొత్త కణాలపుట్టుక వయస్సు పైబడిన వారిలో జరుగుతూ ఉంటుంది. అయితే సహజ సిద్ధంగా క్రమబద్ధంగా జరిగే ఈ ప్రక్రియలో ఎక్కడో తేడా వచ్చి, పాత బడిన కణాలు మృతి చెందకుండానే అనేక కొత్త కణాలు పుట్టుకొని రావటంవలన, వచ్చిన శరీర భాగాలలో కణితులు ఏర్పడుతూ ఉంటాయి. ఆ భాగానికి పరిమితం అయి ఉండే ప్రమాదకరం కాని కణితులు కొన్ని అయితే, ఇతర భాగాలకు, చుట్టు ప్రక్కల కణజాలానికి రక్తం ద్వారా లింఫ్‌నాళాలద్వారా వ్యాప్తి చెందే ప్రమాదకర కణితులు క్యాన్సర్ కణితులు. వయస్సు పైబడే కొద్ది పెరిగే క్యాన్సర్ కణితులుకు మన సామాజిక పరిసరాలకు సంబంధించి, అనేక కారణాలు, దురలవాట్లు, వాతావరణం, వృత్తి పరమైన కారణాలు, కాలుష్యం, జీవనశైలి, హార్మోన్ల వాడకం, కుటుంబ చరిత్ర, కొన్ని రకాలవైరస్‌లు, బ్యాక్టరియా, ఎరువులు, రేడియేషన్ ఇలా ఎన్నో కారకాలు దోహదపడ్తాయని చెప్పుకొవచ్చు.

నేషనల్ క్యాన్సర్ ఇన్‌స్టిట్యూట్ (NCI) సర్వే ప్రకారం కొత్తగా కనుగొనే క్యాన్సర్స్‌లో 60 శాతం వరకు 65 ఎళ్లు పై బడిన వారిలో కన్పించటమేకాక వీరిలో 70% వరకు మరణానికి గురవుతూ ఉంటారు. చిన్న వయస్సులో ఉండే వారితో పోల్చుకుంటే 65 ఎళ్లు పైబడిన వారు క్యాన్సర్‌కు గురయ్యే ప్రమాదం 10 రెట్లకు పైగా ఉంటోంది. వయస్సు పైబడిన వారిలో అన్నిరకాలక్యాన్సర్స్ వచ్చే ప్రమాదం ఎక్కువే. మరీముఖ్యంగా కోలన్, రెక్టల్, ప్రోస్టేట్, ప్యాంక్రియాస్, ఊపిరి తిత్తులు, మూత్రాశయం, పెద్ద పేగులు, రొమ్ము క్యాన్సర్‌లు వయస్సు పైబడే కొద్ది వచ్చే ప్రమాదం ఎక్కువవుతూ ఉంటుంది. అంతే గాక వీరిలో ఈ కణితులు ట్రీట్‌మెంట్స్‌కు లొంగకుండా ఉండే అవకాశం కూడా ఉండవచ్చు. అధికరక్తపోటు, మధుమేహం, కీళ్ల అరుగుదల, థైరాయిడ్ సమస్యలు, గుండె రక్తనాళాలలో పూడికలు, వంటి సమస్యలు వయస్సుతో పాటు పెరిగి వేధిస్తూ ఉంటాయి కాబట్టి వీరికి క్యాన్సర్ ట్రీట్‌మెంట్స్ కూడా చాలా జాగ్రత్తగా అలోచించి పర్సనలైజ్‌డ్‌గా ఇవ్వవలసి ఉంటుంది. వారి శరీర ఆరోగ్య పరిస్థితులనే కాక వారి మానసిక, సామాజిక, కుటుంబ, ఆర్థిక పరిస్థితులను గురించి కూడా ఆలోచించి క్యాన్సర్ బారిన పడిన వారికి ధైర్యం చెప్తూ ట్రీట్‌మెంట్స్ ఇవ్వాల్సి ఉంటుంది. అందుకే వీరికి ట్రీట్‌మెంట్స్‌లో భాగంగా కౌన్సిలింగ్ ప్రాముఖ్యత కూడా ఎక్కువగా ఉంటోంది.

వయస్సు పైబడే కొద్ది క్యాన్సర్‌కు గురికాక తప్పదా? అన్న దిశలో శాస్త్రవేత్తలు అనేక రకాలుగా పరిశోధనలు చేశారు. వయస్సుకు క్యాన్సర్‌కు సంబంధం ఎక్కువ అవటానికి అనేక కారకాలు దోహదం చేస్తూ ఉన్నాయని పరిశోధనలు నిరూపించాయి. వాటిలో ఈ క్రింది వాటిని కొన్ని కారణాలుగా పేర్కొన్నారు.

1. చిన్నప్పుడు దీర్ఘకాలికంగా ఉన్న స్మోకింగ్, అల్కహాల్, అనేక మందితో శారీరక సంబంధాలు వంటి దురలవాట్లు.
2. వయస్సు పైబడే కొద్ది రోగనిరోధక శక్తి తగ్గటం
3. కొన్ని రకాలహార్మోన్స్ ఎక్కువగా తీసుకోవటం
4. కణాలలో మార్పులు నెమ్మదిగా జరిగి వయస్సు పైబడ్డాక బయట పడటం
5. వృత్తిపరంగా కొన్నిరకాలరసాయనాలకు ఎక్కువగా గురవటం
6. వేరే వ్యాధులు వాటికి తీసుకునే ట్రీట్‌మెంట్స్

చిన్నవయస్సులో, మధ్య వయస్సులో ఉండే అలవాట్లు వలన కణజాలాలలో నెమ్మదిగా జరిగే మార్పులు వయస్సు పైబడ్డాక బయటపడ్తూ ఉంటాయి. వెర్నర్ సిండ్రామ్ (Werner Syndrome), ఆల్జిమర్స్ (Alzheimer's), ఎయిడ్స్ మొదలగు వ్యాధులు ఉన్నవారికీ క్యాన్సర్ వచ్చేరిస్క్ పెరుగుతుంది. శరీరంలో హార్మోన్ లెవల్స్ ఎక్కువగా ఉన్న పెద్దవారిలో కొన్ని రకాలక్యాన్సర్స్ ఎక్కువ. ఉదాహరణకు ఈస్ట్రోజన్ లెవల్స్ దీర్ఘకాలికంగా ఎక్కువగా ఉన్న స్త్రీలలో రొమ్ము, ఎండోమెట్రియల్, అండాశయలక్యాన్సర్స్ అధికం. 60 ఎళ్లు పైబడ్డాక కూడా స్త్రీలలో నెలసర్లు అగలేదంటే కొంచెం అనుమానించాలిసిందే. 9 ఏళ్లకే నెలసర్లు, లేటుగా మ్యారేజ్, ప్రెగ్నెన్సి ప్లాన్‌చేసుకొవటం కూడా రొమ్ము క్యాన్సర్ వచ్చే రిస్కును పెంచే అవకాశం ఉంది.

పురుషులలో టెస్టోస్టిరాన్ హార్మోన్స్ లెవల్స్ ప్రోస్టేట్ క్యాన్సర్‌కు దారితీసే అవకాశం ఉంటుంది



Dr. Ch. Mohana Vamsy
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421

అందుకే ఇటువంటి హార్మోన్లకు సంబంధించిన క్యాన్సర్స్‌కు ట్రీట్‌మెంట్స్‌లో సర్జరి, రేడియేషన్, కీమోలతో పాటు హార్మోన్ థెరఫి ప్రాముఖ్యత కూడా ఉంటుంది.

యుక్త వయస్సులో, తెలిసి తెలియని వయస్సులో సరాదాలకు, స్నేహితులకు అగ్రపీఠం వేస్తూ చేసుకున్న అలవాట్లు వలన వాటికి దూరం అయినా నిబ్బరంగా ఉండటానికి అవకాశం లేదు. స్మోకింగ్, ఆల్కహాల్ అనేక మందితో శారీరక సంబంధాలు, లంగ్, లివర్, సర్వైకల్ క్యాన్సర్స్‌నే కాక ఇంకా ఏ భాగానికైన క్యాన్సర్స్‌ను కలిగించే అవకాశం ఉంటుంది. ఈ కణితులకు ఖచ్చితమైన కారణాలు తెలియవు అనేక ఇతర కారణాలు జన్యుపరమైనవి కారకాలు ఉండవచ్చు. అయితే దురలవాట్లకు, కెమికల్స్‌కు గురయ్యే వారిలో సాధారణ ప్రజానికం కంటె క్యాన్సర్స్ వచ్చే రిస్కే ఎక్కువ. అలవాట్లకు అతీతంగా వయస్సు పైబడిన వారందరూ స్క్రీనింగ్ టెస్ట్‌లు చేయించుకుంటూ ఉంటే మంచిది. స్త్రీలు గర్భాశయ ముఖద్వార క్యాన్సర్‌ను ముందే పసిగట్టటానికి 35ఎళ్లు పైబడిన దగ్గర నుండి పాప్‌స్మియర్స్, రొమ్ము క్యాన్సర్‌ను తెలుసుకోవటానికి 40 ఏళ్లు పైబడిన వారు మామోగ్రామ్స్, సెల్ఫ్ ఎక్జామినేషన్ అలాగే పురుషులో 50 ఏళ్లు పైబడ్డాక ప్రోస్టేట్ క్యాన్సర్‌ను తెలిపే PSA టెస్ట్, హెపటైటిస్ -B పాజిటివ్‌గా ఉన్న వారు లివర్, స్మోకింగ్ ఆల్కహాల్ అలవాట్లు ఉన్నవారు లంగ్స్, లివర్ పరీక్షలు చేయించుకుంటూ ఉంటే మార్పులను ముందే పసిగట్టవచ్చు.

చిన్న వయస్సు నుండే మంచి ఆహార, వ్యవహార జీవనశైలితో పాటు శరీరంలో మార్పులను ముందే పసిగట్టే స్క్రీనింగ్ టెస్ట్‌లు, తొలిదశలోనే చికిత్సలతో క్యాన్సర్స్‌కు చెక్ పెట్టవచ్చు అని అందరూ అవగాహన పెంపొందించుకోవటం తప్పనిసరి.

(సశేషం)



Courtesy : FEMINA

'అడగందే అమ్మ అయినా పెట్టదు' అన్నది సామెత. అమ్మ హృదయం ఎంతో విశాలమయినది. పిల్లల అవసరాలన్నీ తనంత తానుగా ముందునుండే గమనిస్తుంది. అడగకుండానే తీరుస్తుంది. అటువంటి అమ్మనే అడగనిదే పెట్టదన్నారు. అంటే ఇక మిగిలిన బంధాల్లో అడగకుండా జరగటం ఎంత కష్టమో ఆలోచించండి.

నన్ను పూర్తిగా అర్థంచేసుకునే భర్తకావాలని కోరుకోవటంలో తప్పులేదు. అలాగని ఆ అర్థంచేసుకోవటం అనేదానిని మరీ చివరిదాకా లాగి, ఏ ఒక్కటి అడగకపోతే నష్టపోయేది భార్యలే.

సంసారంలో ఒకరికొకరు అందించుకోవాలి,ఒకరి కష్టసుఖాలు మరొకరు పంచుకోవాలన్నది నిజమే. అయితే అన్ని సందర్భాలలో అడగకుండా తీర్చటం భర్తలకే కాదు, భార్యలకు కూడా కుదరదు. నోరు తెరచి అడగటానికి మొహమాటపడతారు. కనీసం సంకేతపరంగా తెలియచెప్పి తమకు కావాల్సింది అందుకోవాల్సివుంటుంది.

మిగిలిన అంశాలలో ఏదో ఒకరకంగా బయటపడి, సూచించి తమకు కావాల్సినది పొందే మహిళలు కూడా లైంగిక అంశాల దగ్గరకు వచ్చేసరికి బిగుసుకుపోతుంటారు. అందుకు మూలంగా మానసిక విశ్లేషకులు రెండు కారణాలను చెపుతుటారు.

అందులో ఒకటి పెంపకంలో వచ్చేది, మరొకటి సామాజికంగా విధింపబడినది.

సెక్సీ అంశాల గురించి బయటకు మాట్లాడటం తప్పు అన్నట్టుగా పిల్లల్ని పెంచుతారు.వయసువచ్చిన పిల్లని ఆ ఇకయికలు పకపకలు ఏమిటి అంటూ అమ్మాయిలను నవ్వనీయరు పెద్దలు. మన పిల్లలతో మాటలేంటి అంటూ అటువైపు వెళ్ళనియ్యరు. ఇక లైంగిక అంశాలగురించి అడగనివ్వరు, అడిగినా సరైన సమాధానం చెప్పరు.

వయసుతో వచ్చే శారీరక మార్పులగురించి వివరంగా చెప్పరు. వాటిని ఎలా స్వీకరించాలో, ఎటువంటి సర్దుబాట్లు చేసుకోవాలో చెప్పరు. ఫలితంగా ఆ వయసులో హఠాత్తుగా కనిపించిన తొలి రక్తస్రావానికి కంగారుపడి ఏడిచే అమ్మాయిలే ఎక్కువ.

ఆ తర్వాతికాలంలో శారీరకంగా ఎదుగుతారు. వయసుతో కోరికలు వస్తాయి.

కాని ఆ కోరికల గురించి తాము ఏం చేయాలో, ఏం చెయ్యకూడదో తెలియదు. నిజానికి అమ్మాయిలకు పెద్దలు చెప్పేదొక్కటే. నువ్వు అతనికనుకూలంగా మసలుకో. అది అలా చెప్పిచెప్పటంతో అమ్మాయిల మనసుల్లో ఎంతగా నాటుకుపోతుందంటే లైంగికంగా ఎటువంటి చొరవకూ వారు ఇష్టపడరు.

## చొరవ చూపక

సెక్స్ అనేది ఆయనకు ఇష్టంవచ్చిన రీతిలో ఆయన చేసుకుపోతుంటే తాను అలా ఒళ్ళు అప్పగించి ఆయన అందించినదానితో సర్దిచెప్పుకోవటమే జీవితంగా తయారవుతుంది.

మగవాడు సెక్స్‌ని ప్రారంభించాలేగాని అమ్మాయి చొరవ తీసుకోకూడదనేది సామాజిక నిబంధన. ఈ నిబంధనను ఎప్పుడు ఎవరు అమర్చారోకాని దానిని ఇప్పటికీ ఆడవారు తు.చ. తప్పక అనుసరిస్తున్నారు. నోరుతెరచి తమ కోరిక గురించి మాట్లాడరు.

సెక్స్‌లో తమకు లభించని తృప్తిగురించి పెదవి విప్పరు.అలాఅంతా అదిమిపెట్టుకుంటారు.

సంసారం గుట్టుగా సాగాలన్న బలమైన సామాజిక నిబంధన వారిని అలా చేస్తున్నది.

అయితే ఎవరూ లేనప్పుడు, తమలోని సెక్సీ అంశాల గురించి మాట్లాడేందుకు వారికి అభ్యంతరం లేదు. తమ సెక్సీ కబుర్లు తమవారికి తెలిసే అవకాశం లేదన్న నమ్మకం కలిగిస్తే వారు ఎటువంటి రహస్య సెక్సీ అంశాలైనా మాట్లాడేందుకు సిద్ధం

ఆ విషయం గత సంవత్సరంలో 'కిండారా' అనే సంస్థ చేసిన సర్వేలో తెలిసింది. ఇంటర్వ్యూలో పాల్గొన్నవారిలో ప్రతి నలుగురిలో ముగ్గురు తమకు వారంలో మూడు రోజులు సెక్స్ కావాలని చెప్పగా 13 శాతంమంది వారంలో ఆరురోజులు సెక్స్‌కి సిద్ధమన్నారు. కాని వారందరి మాటా తాము కోరుకున్న సెక్స్ తమకు అందటంలేదనే.

అంతగా కోరిక ఉన్నప్పటికీ తమంత తాముగా సెక్స్‌లో చొరవ చూపలేకపోతున్నామని అంగీకరించారు. అందుకు కారణం తమని భర్తలు తప్పుగా అర్థంచేసుకుంటారన్న భయం వారిది.

గతంలో లైంగిక అనుభవం ఉందని వేధించే స్థితికి భర్త చేరతాడేమోనన్న దిగులు వారిది. అందుకే వారు సెక్స్ విషయంలో మాట్లాడకుండా కూర్చో

వాల్సివస్తున్నదట. దీనివలన లైంగిక ఆనందం, తృప్తి తగినంత స్థాయిలో పొందలేకపోతున్నారు.

ఇంతకాలం ఇటువంటి ఆలోచనలతో తమ కోర్కెలను అదిమిపెట్టుకున్న అమ్మాయిలు అర్థంచేసుకోని విషయం ఒకటుంది. అబ్బాయిలు కాలంతో చాలా మారారు.అమ్మాయిలను అనుమానించటం తగ్గింది. అమ్మాయిలు తాము చెప్పినట్టుఅణిగిమణిగి వుండాలనుకోవటంలేదు.

## కావాలని డిమాండ్

అబ్బాయిలలో చాలామందికి అమ్మాయిలు సెక్స్‌లో చొరవ తీసుకోవటం ఇష్టం. కాని ఆ విషయం అబ్బాయిలు నోరువిప్పిచెప్పరు. అమ్మాయిలు అర్థం



చేసుకోరు. విషయం ఇప్పటికైనా అమ్మాయిలు తెలుసుకోవాలి. తమ సెక్స్ కోర్కెలు, ఆలోచనలు బయట పెట్టటం అవసరం. అలా ఎవరు నోరువిప్పి మాట్లాడగలుగుతారో వారు తమ లైంగిక జీవిత అనుభవాలను మార్చుకోగలుగుతారు.

మనసులో ఉన్న అనవసరపు సందేహాలను వదిలించుకుంటే జీవితంలో ఎదురవుతున్న అన్నిరకాల సెక్సీ సమస్యలు తీరిపోతాయి.

ఎవరైతే తన కోరిక గురించి వ్యక్తీకరిస్తారో వారి కోర్కెలు పూర్తిగా తీర్చబడతాయి. రోజువారీ జీవితంలో అన్నీఒకేలా సాగిపోతున్నట్టు అనిపించినా ఏదోఒక సమయంలో, ఏదోఒక అంశం సెక్స్ కోర్కెను తెస్తుంది. ఆ సమయంలోనే ఆయనతో సమయం గడపాలని, అనుభవం పొందాలని అనిపిస్తుంది.

ఆ విషయం సరిగా తెలియబరచగలిగితే ఇక ఆనందం మీ వెంటే. కోరిక తెలియచేయటమంటే పచ్చిగా పిలవాల్సిన అవసరంలేదు. అతనికి అర్థమయ్యేలా తెలియచెప్పే నేర్పు ఆమెకు అవసరం. అది మెసేజ్‌లద్వారా తెలియచేస్తారా! లేక అతనికి ఇష్టమైన రీతిలో అలంకరించుకుని రెచ్చగొడతారాఅనేది వారి వారి ఇష్టాలమీద ఆధారపడివుంటుంది.

పడకటింటి అలంకరణ ద్వారా కూడా సందేశం ఇవ్వగలరు. ఇవన్నీ కాదు నేరుగా చెవిలో ప్రేమ గుసగుస్లలు వినిపించవచ్చును.

అలా ఎవరైతే తమ కోర్కెలను బైటకు చెప్పగలరో వారిలో ఆత్మస్థైర్యం పెరుగుతుంది. జీవితంలో ఎంతో ఎత్తుకు ఇతరత్రా ఎదుగుతారు.

లైంగిక ఆనందం ఒక టానిక్‌లాగా ఆ దంపతుల ఎదుగుదలకు దోహదపడుతుంది.

తమపరిసరాలలో ఏ చిన్న శబ్దమైనా, ఎవరైనావచ్చిన అలికిడి అయినా అమ్మాయిలు సెక్స్‌మీద నుండి దృష్టి మరల్చు కుంటారు సులభంగా. కాని వారే తమ కోర్కెలను బయటకు చెప్పటం వల్ల అటువంటి ఆటంకాలు లేకుండా పడకటింటి వాతావరణాన్ని నిర్మించగలదు ఆమె.

## అన్నీ తగినవే

మగవారు అర్థంచేసుకోలేనిది ఆమె శరీరం గురించి. శరీరంలోని ఒక్క భాగంమీదే మగవారిదృష్టి అధికం. దానిద్వారానే తమకు తృప్తి అనుకుంటారు. కాని అదితప్పని, ఆమెశరీరంలో స్పందించేవి,స్పర్శను కోరుకునే భాగాలు ఇతరత్రా ఉన్నాయనే విషయం ఆయనకు తెలియచెప్పాలి.

అలా ఆ భాగాల్ని తనచేతిలోకి తీసుకునేలా ప్రోత్సహించండి.ఆ రుచులుమరిగినమగడు పూర్తిగా తాను సుఖిస్తూ, ఆమెకు సుఖం పంచగల్గుతాడు.

సెక్స్‌ని పురుషులు చూసే కోణం, స్త్రీలు చూసే కోణం వేరు. పురుషులు దానిని శారీరకబంధంగా, శారీరక ఆనందానికి సంబంధించినదిగా చూస్తారు. స్త్రీలు సెక్స్‌ని మానసిక సంబంధమైనదిగా తీసుకుంటారు. మనసును జయించగల్గితే ఆడవారు మిగిలిన కట్టుబాట్లనన్నింటినీ ఛేదించి వెంట నడుస్తారు.

ఆ మానసిక అనుబంధానికి ఉన్న విలువ తెలియచెప్పాలి. మానసిక అనుబంధం నుండి శరీరంసంపూర్ణ తృప్తిని పొందుతుంది.

మానసికంగా సిద్ధమైనప్పుడు ప్రతి చిలిపి స్పర్శ నుండి అధిక ఆనందం వస్తుంది. లైంగికంగా కూడా తృప్తి అధికమవుతుంది.

## దృష్టికోణం వేరు

మానసికం నుండి శారీరకంవైపుకు వెళ్ళినసెక్స్‌లో శరీరం అలా తేలిపోతుంది. ఆ సమయంలో విడుదలయ్యే హార్మోన్‌లు మనసులో ఉన్న బాధలను తొలగిస్తుంది. కండరాలను రిలాక్స్ చేస్తాయి.

హాయిగా ఇద్దరూ కౌగిలిలో మత్తుగా ఒదిపోయేలా చేస్తుంది. అటువంటి సెక్స్ మళ్ళీ మళ్ళీ కావాలనిపిస్తుంది. అటువంటి ఆనందంకోసం ఆమె ఫోర్‌ప్లేని ప్రారంభించటంలో తప్పులేదు. ఆ ఫోర్‌ప్లే చొరవ నుండి కొత్త ఉత్సాహం వస్తుంది. సరికొత్త భంగిమల ప్రయోగాలకు సహకారంవస్తుంది.

సెక్స్ ఉద్దేశం గరిష్ఠ ఆనందం అందుకోవటం.ఆ ఆనందం అందించటంలో స్త్రీ, పురుషులిద్దరి పాత్ర ఉంటుంది. అందుకే సమ ఉజ్జీలుగా సెక్స్ పోరాటం చెయ్యమంటుంది శాస్త్రం.

'ఏమనుకుంటారో' అనే సందేహం జంటలో ఏ ఒక్కరిలో ఉన్నా సెక్స్ ముందుకు వెళ్ళదు. సెక్సీ మాటలు ఎవరు ముందు మొదలుపెట్టాలి.

తాను సెక్సీ కబుర్లు చెపితే తనని రాడీవెధవగా అనుకుంటుందేమోనన్న సందేహం అతనిలో ఉండి ముందుకు వెళ్ళడు. తాను తొలిఅడుగు వేస్తే అతను మరోలా అనుకుని తననుండి దూరంగా వెళతాడేమోనన్న భయం ఆమెది.

తిరస్కరణ భయం ఆడవారిలో అధికం. తాను రిజర్వ్‌డ్‌గా ఉండకుంటే అతను లోకువ కడతాడని. ఒకసారి చిలిపి అనుభవం పంచితే ఇక తనను వదిలేస్తాడన్న భయం ఆమెలో ఉంటుంది.

అబ్బాయిల మనసుల్లో ఆమెను తృప్తిపరచగలనా అనే సందేహం. ఆ విషయంమీద అధికంగా దృష్టిపెట్టిచెయ్యాల్సిన పని సక్రమంగా చేయకఆమెకు నిరుత్సాహం, అసంతృప్తి కలిగిస్తాడు.

తనమీద తాను సందేహంపెంచుకుంటాడు.సెక్సీ జీవితాన్ని సమస్యాత్మకంగా మార్చే ఆసందేహాలను పటాపంచలు చేయగలిగినది ఆమె చూపే చొరవ.

సెక్స్ విషయంలో మనసువిప్పి చెప్పేమాటలు. తన కోరికలు, తన సెక్సీ ఆశలు వగైరాలు ఆమె నోరువిప్పి చెపితే దంపతుల మధ్య సెక్సీ సమస్యలు అంతగా తగ్గిపోయి, సెక్సీ ఆనందం అమితంగా అందుకోగలుగుతారు.

టి.హర్షవర్ధన్

# 'సుప్రీమ్' న్యాయ సంక్షోభం

- తొలిసారిగా మీడియా ముందుకు న్యాయమూర్తులు
- సుప్రీమ్‌కోర్టు పనితీరు బాగాలేదు
- చీఫ్ జస్టిస్ వ్యవహారాన్ని ప్రశ్నించారు
- ప్రశ్నలు సరే... జడ్జీల పద్ధతి సరైనదేనా!

ప్రజాస్వామ్య సౌధానికి మూలస్తంభాలైన చట్ట సభలు, ప్రభుత్వం, న్యాయవ్యవస్థ, పత్రికలలో నేటివరకు బయటపడని బండారం న్యాయ వ్యవస్థది మాత్రమే. అందుకే ప్రజలకు న్యాయవ్యవస్థ మీద ఇంకా విశ్వాసం మిగిలివుంది.

మీకు ఆ కొద్దిపాటి విశ్వాసం అనవసరం 'మేము కూడా ఆ మిగిలిన మూడు స్తంభాల్లో భాగమే' అంటూ న్యాయవ్యవస్థలో భాగస్వాములైన న్యాయమూర్తులు స్వయంగా బయటపెట్టారు.

మిగిలిన ప్రజాస్వామ్య సౌధమూల స్తంభాలు మూడూ అటూ ఇటుగా ఊగుతున్నా ప్రజాస్వామ్య సౌధాన్ని స్థిరంగా నేటివరకు నిలబెడుతున్న వ్యవస్థ న్యాయవ్యవస్థ. అందులో సందేహంలేదు.

అన్యాయం జరిగితే ఆదుకునే దిక్కుగా న్యాయ వ్యవస్థ నిలిచింది. న్యాయస్థానానికి వెళ్ళటానికి ఖరీదైన లాయర్ల ఫీజులు, అక్కడ జరిగే కొన్ని మతలబులువంటి అడ్డంకులు ఉన్నప్పటికీ న్యాయవ్యవస్థను ఆశ్రయించి తమగోడు చెప్పుకునే అవకాశం కల్పించాయి న్యాయస్థానాలు.

ఉన్నత స్థానాల్లో ఉన్నవారు శిక్షలనుండి తప్పించుకుంటున్న వైనం బాధ కలిగిస్తున్నప్పటికీ ఆ తప్పు మాది కాదు, నేర విషయాన్ని పరిశోధించి సాక్ష్యాలు సమర్పించటంలో విఫలమైన పోలీసు, సిబిఐలదేనని న్యాయస్థానం నేటివరకు చెపుతూవచ్చింది.

ఆ యా అంశాలమీద సందేహాలున్నప్పటికీ నోరెత్తటానికి వీలులేని భయం. న్యాయమూర్తులను ప్రశ్నిస్తే కోర్టు ధిక్కార నేరం మోపుతారేమోనన్న జంకు.

మనసులో సందేహాలు ఉన్నప్పటికీ బహిరంగంగా చెప్పలేని పరిస్థితి కోర్టులు కల్పించాయి. కోర్టుల తీరుతో సమాజం ఉక్కిరిబిక్కిరి అవుతున్నది.

అటువంటి నేపథ్యంలో కోర్టుల తీరుతో మేంకూడా ఉక్కిరిబిక్కిరవుతున్నామంటూ సుప్రీమ్‌కోర్టు సీనియర్ న్యాయమూర్తులే మీడియా ముందుకు వచ్చారు.

భారతీయ న్యాయవ్యవస్థలో ఇదొక సంచలనం. ఒక రకంగా సంక్షోభంకూడా. సుప్రీమ్‌కోర్టులో ప్రధాన న్యాయమూర్తి తర్వాత సీనియర్స్‌గా ఉన్న జాస్తి చలమేశ్వర్, రంజన్ గొగోయ్, మదన్ లోకూర్, కురియన్ జోసెఫ్‌లు పత్రికా సమావేశం నిర్వహించారు.

న్యాయమూర్తులు ఇలా మీడియాతో మాట్లాడటమే అనూహ్య పరిణామమయితే, ఆ సందర్భంలో వారు ప్రస్తావించిన అంశాలు, తాము అలా మీడియా ముందుకు వచ్చేలా చేసిన అవాంఛనీయ ఘటనలు దేశ న్యాయవ్యవస్థనే కుదిపేసింది.

ఇటువంటి పరిణామం చోటుచేసుకుంటుందని ప్రభుత్వంతోసహా ఎవరూ ఊహించలేదు. సుప్రీమ్ కోర్ట్‌లో తిరుగుబాటు న్యాయమూర్తులకు నాయకత్వం వహించిన జస్టిస్ చలమేశ్వర్ చెప్పినదానిప్రకారం గత కొంతకాలంగా సుప్రీమ్‌కోర్ట్ పాలన సవ్యంగా లేదు.

అక్కడ అవాంఛనీయ పరిణామాలు చోటుచేసుకుంటున్నాయి. వాటిని చక్కదిద్దాల్సిన బాధ్యతను గుర్తుచేస్తూ ప్రధాన న్యాయమూర్తికి నచ్చచెప్పే యత్నం చేసినా సరైన స్పందన రాలేదు. దానితో న్యాయవ్యవస్థ మనుగడ, ప్రతిష్ఠను కాపాడాల్సిన అవసరం ఉందని, న్యాయవ్యవస్థ మనుగడ ప్రశ్నార్థకమైతే ప్రజాస్వామ్యం ప్రశ్నార్థకం అవుతుందని భావించారు. భారతదేశ ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రాని ఒప్పించలేకపోయినతర్వాత దేశానికి తమ గోడు చెప్పుకోవటం మినహా మరో ప్రత్యామ్నాయం కనిపించలేదు.

ఇప్పుడు నోరు విప్పకపోతే మరో 20 ఏళ్ళ తర్వాత సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తులు నలుగురు ఆత్మవంచన చేసుకుని, ప్రశ్నించక, సర్దుబాటు ధోరణితో తమ పదవుల్లో కొనసాగారని అనిపించుకోవటం ఇష్టంలేక ఇలా మీడియా ముందుకు వచ్చామన్నారు.

జస్టిస్ చలమేశ్వర్ బృందం తమ తిరుగుబాటు వెనకున్న అంశాలను ప్రత్యేకంగా పత్రికా సమావేశంలో చెప్పకపోయినా వారు రాసిన ఉత్తరం ప్రకారం కేసులను విచారణకు పంపకంచేసే విషయంలో వారికి అభ్యంతరాలున్నట్టు అర్థమవుతుంది.

సుప్రీమ్‌కోర్టు ముందుకు వేలసంఖ్యలో కేసులు వస్తుంటాయి. వాటిలో ఏ కేస్‌ను ఏ న్యాయమూర్తి విచారణకు పంపాలి, బెంచ్‌లను ఏర్పాటు చేయాలా, చేస్తే ఆ బెంచ్‌లో ఏ న్యాయమూర్తులు ఉండాలనే నిర్ణయాలను ప్రధాన న్యాయమూర్తి తీసుకుంటారు. అది రాష్ట్ర హైకోర్టుల్లోనూ ఉన్న పద్ధతే.

అది ప్రధాన న్యాయమూర్తులకు రాజ్యాంగంద్వారా వచ్చిన విచక్షణాధికారం. దానిని నేటి భారత ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రాకూడా వినియోగించుకుంటున్నారు. ఆ విచక్షణాధికారం ద్వారా ప్రధాన న్యాయమూర్తి హేతుబద్ధత లేకుండా తాను ఎంచుకున్న బెంచ్‌లకు అప్పగిస్తున్నారన్నది తిరుగుబాటు న్యాయమూర్తుల ఆరోపణ.

కీలక కేసులను జూనియర్ జడ్జీలకు కేటాయిస్తున్నారు అన్నది వారి వాదన. వారి ఉత్తరంలో ప్రత్యేకంగా ప్రస్తావించకపోయినా ఏదో ఉద్దేశ్యంతో తమను పక్కనపెట్టి మరెవరికో కొన్ని కేసులు ప్రత్యేకంగా విచారణకు కేటాయిస్తున్నారన్న ఆరోపణ ఉంది. సుప్రీమ్‌కోర్ట్‌లో వ్యవహారాలు బాగోలేని విషయం బయటపెట్టిన తీరు, దానికిముందు, వెనక జరిగిన సంఘటనలు, ఈ నలుగురు తిరుగుబాటు న్యాయమూర్తుల ఆలోచనలు సబబైనవా అనిపించేలా ఉంది.

అన్యాయం జరిగిందని కోర్టుకు వెళ్ళినవారిని కోర్టు ఒక ప్రశ్న వేస్తుంది. పరిష్కార మార్గాలుగా ఉన్న వ్యవస్థల తలుపులు తట్టావా లేదా ముందుగా అని అడుగుతారు జడ్జీలు. అదే విషయం ఈ నలుగురు న్యాయమూర్తులకు వర్తించాలి సహజంగా.

సుప్రీమ్‌కోర్టులో జరుగుతున్న అవకతవకల గురించి కేంద్ర న్యాయశాఖకు గాని, న్యాయమూర్తులను నియమించిన రాష్ట్రపతి దృష్టికి కాని తీసుకువెళ్ళిన దాఖలాలు లేవు. నేరుగా తమ అంతర్గత పోరాటాన్ని మీడియా ముందుంచారు.

న్యాయమూర్తులు మీడియా ముందుకు రావటం సబబా! వారి న్యాయవ్యవస్థ నిబంధనల ప్రకారం న్యాయమూర్తులు మీడియాతో కోర్టుల గురించి, కేసుల గురించి మాట్లాడకూడదు. మరి ఈ నలుగురు సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తులు క్రమశిక్షణను ఉల్లంఘించినట్టే కదా!

గతంలో మద్రాసు హైకోర్టులో అవాంఛనీయ ఘటనల గురించి గళం విప్పిన జస్టిస్ కర్ణన్‌ను సుప్రీమ్‌కోర్టు తప్పు పట్టింది. ఆ విషయం న్యాయమూర్తులకు తెలియదనుకోలేం. అయినా తమదేమీ తప్పుకాదని, జాతి హితంకోరే



> కేంద్ర బడ్జెట్‌పై ఆధారపడకుండా సొంత నిధులతో రైల్వేలు పనిచేసేలా చూడటమే నా లక్ష్యం.
>
> -పీయూష్ గోయల్, రైల్వేమంత్రి

తాము ఇలా మీడియా సమావేశం పెట్టామని జస్టిస్ జాస్తి చలమేశ్వర్ బృందం సమర్థించుకోవచ్చు. కాని ఆ పత్రికా సమావేశం, జరగబోతున్నదన్న విషయం ముందుగానే కొందరికి తెలుసని ఆ పత్రికా సమావేశాన్ని తెరమీద చూస్తే అర్థమవుతుంది.

అటువంటి పత్రికా సమావేశానికి సుప్రీమ్‌కోర్టు లేడీ లాయర్ ఒకరు, ఒక కీలక పత్రికా సంపాదకుడు వచ్చి కూర్చోవటం అనుమానాలను పెంచుతున్నది.

దీనితోపాటుగా సి.పి.ఐ. సీనియర్ నేత రహస్యంగా జస్టిస్ చలమేశ్వర్ ఇంటిలోకి ప్రవేశించి, ఆయనతో కరచాలనం చెయ్యటం టెలివిజన్ కెమెరాలకు చిక్కినతర్వాత ఇక ఈ జడ్జీల తిరుగుబాటు విషయంలో బయటకు చెప్పినవికాక మరేవో అంశాలు ఉన్నాయన్నది ధృవీకరించబడింది.

న్యాయవ్యవస్థలో ప్రకంపనలు సృష్టించిన ప్రెస్ కాన్ఫరెన్స్‌కు కేంద్రబిందువు ప్రధాన న్యాయమూర్తి దీపిక్ మిశ్రా. ఒడిషాకి చెందిన దీపక్ మిశ్రా మేనమామ రంగనాథ మిశ్రా కూడా గతంలో భారత దేశానికి ప్రధాన న్యాయమూర్తిగా చేశాడు.

కేసుల విచారణలో ఆయన చేసిన కొన్ని పనులు చిత్రమయినవి. ముంబయి వరుస పేలుళ్ళ కేసులో నిందితుడు యాకుబ్ మెమన్ ఉరిశిక్ష అమలుకు వ్యతిరేకంగా దాఖలైన పిటీషన్‌ని అర్థరాత్రి విచారించి, బెదిరింపులు లెక్కచేయక మరణశిక్షను ధృవీకరించిన బెంచ్‌కి నేతృత్వం వహించింది ఆయనే.

తాజాగా 1984లో ఇందిరాగాంధీ హత్య నేపథ్యంలో సిక్కుల ఊచకోత కేసులను తిరిగి తెరవాలని, మరల విచారించాలని ఆయన ఉత్తర్వులిచ్చాడు. ఇది కొందరు రాజకీయ నాయకులకు ఇబ్బంది కలిగించేది. అలాగని ఆయన్ని అధికారంలో వున్నవారి కొమ్ముకాసే జడ్జిగా అనేందుకు వీలులేదు.

ఉత్తరాఖండ్‌లోని కాంగ్రెస్ ప్రభుత్వాన్ని రద్దుచేసి మోడీ ప్రభుత్వం విధించిన రాష్ట్రపతి పాలనమీద తీవ్రంగా వ్యాఖ్యలుచేసి మోడీ ప్రభుత్వం రాష్ట్రపతి పాలనను ఉపసంహరించుకునేలా చేసింది జస్టిస్ దీపక్ మిశ్రానే. కాబట్టి ఆయనకు రాజకీయాలు ఆపాదించటం కుదరటంలేదు.

న్యాయస్థానంలో పాలనాపరంగా చీఫ్ జస్టిస్ తీసుకుంటున్న నిర్ణయాలు జస్టిస్ చలమేశ్వర్ బృందానికి నచ్చటంలేదు. తమ సీనియారిటీని గౌరవించి, తమతో సంప్రదింపులు జరపాల్సినవిధంగా జరపటం లేదన్నది జస్టిస్ చలమేశ్వర్ ఫిర్యాదు.

ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోవటం, కేసుల కేటాయింపులో పారదర్శకత లేకపోవటాన్ని తిరుగుబాటు న్యాయమూర్తులు ప్రస్తావిస్తున్నారు.

అయితే గతంలో సుప్రీమ్‌కోర్టు పనితీరును గమనించిన వారికి నాటి ప్రధాన న్యాయమూర్తుల కన్నా నాటి ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రా భిన్నంగా ప్రవర్తించటం లేదని అర్థమైంది. తమకు దఖలుపరచబడిన అధికారాన్ని వాడుతున్నానని చీఫ్ జస్టిస్ మిశ్రా అంటున్నారు. తన సహచర 'కొలీజియం' న్యాయమూర్తులతో అవసరంమేరకు చర్చలు జరుపుతున్నానన్నది ఛీఫ్ జస్టిస్ మిశ్రా మాట.

చీఫ్ జస్టిస్ అనేవారు సమానులలో ప్రథముడు మాత్రమేనన్నది జస్టిస్ జాస్తి చలమేశ్వర్ మాట. అది నిజంకూడా. ఐతే సుప్రీమ్‌కోర్టు బెంచ్‌లో కూర్చున్న న్యాయమూర్తులందరూ సమానులే కదా! అప్పుడు సీనియర్, జూనియర్ అనే ప్రశ్న ఏముంది!

అది వారి సర్వీస్ సంవత్సరాలకు సంబంధించిన విషయమే కాని న్యాయపరిజ్ఞానానికి సంబంధించినది కాదు కదా! కాబట్టి అన్ని కేసులు సీనియర్స్ విచారించాలన్న నిబంధన ఎక్కడా లేదు.

కాబట్టి కేసుల కేటాయింపులకు, సీనియారిటీకి సంబంధం లేదు. సంప్రదింపుల విషయంలో నిఅభ్యంతరాలపై చీఫ్ జస్టిస్, మిగిలిన నలుగురు జడ్జీలు చెప్పేది భిన్నంగా ఉంది. అది ఒక్కటే పరిష్కారం కావాల్సిన అంశం.



> వ్యూహాత్మక మౌనం అనే పాత విదేశాంగ విధానానికి మోడీ ప్రభుత్వం స్వస్తిచెప్పింది.
>
> -రాం మాధవ్, బి.జె.పి. నేత

న్యాయమూర్తుల పత్రికా సమావేశముపై న్యాయకోవిదులు రెండుగా చీలిపోయారు.

ఒక వర్గం ఆ నలుగురిని సమర్థిస్తుండగా, మరి కొందరు తప్పుపడుతున్నారు. అంతర్గతంగా పరిష్కరించుకోవాల్సిన అంశాన్ని వీధిలోకి ఎక్కించటం విజ్ఞత కాదన్నది కొందరి సూచన. తప్పనిసరి పరిస్థితులు ఎదురైనప్పుడు జడ్జీలు తిరగబడటం సహజమేనని వారిని సమర్థించేవారు వున్నారు.

సుప్రీమ్‌కోర్టులో తలెత్తిన ఈ సమస్యను ఆ వ్యవస్థ అంతర్గత వ్యవహారమని దానిని ఆ వ్యవస్థే పరిష్కరించుకోవాలని కేంద్రప్రభుత్వం భావిస్తున్నది. న్యాయవ్యవస్థలో తలెత్తిన ఈ సంక్షోభం ఏదో ఒక దశలో, ఏదో ఒక విధంగా తమ మెడకు చుట్టుకోక తప్పదని కేంద్రప్రభుత్వానికి తెలుసు.

ఇటువంటి పరిస్థితి గతంలో ఎన్నడూ తలెత్తనందున ఎలా వ్యవహరిస్తే ఏమవుతుందోనన్న భయం నరేంద్రమోడీ ప్రభుత్వానికి వుంది.

పొరపాటుగా వ్యవహరిస్తే తమకు రాజకీయంగా దెబ్బ తగులుతుందేమోనని అధికారపక్షం, వారు తప్పుచేస్తే తమకు అనుకూలంగా మలచుకోవాలని ప్రతిపక్షాలు కాచుకునివున్నాయి.

ఆలస్యంగానైనా న్యాయవ్యవస్థ తాము మీడియా ముందుకు వెళ్ళి తప్పు చేశామని అర్థం చేసుకున్నది. అంతర్గత సర్దుబాటుకు చర్చలు మొదలయ్యాయి. ప్రధానన్యాయమూర్తి నలుగురు జడ్జీలను ఆహ్వానించటం, కొంతమేర చర్చ జరపటం ఆహ్వానించదగిన పరిణామమే. అయితే సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తుల మధ్య వున్న అంతర్గత విభేదాలు చర్చలకు అడ్డంకిగా వున్నాయి. ఈ వ్యక్తిగత విభేదాలు సమస్యను మరి కొంతకాలం కొనసాగిస్తాయి.

న్యాయమూర్తుల తిరుగుబాటు నేతగా బయటకు వచ్చిన జస్టిస్ చలమేశ్వర్ గత మూడేళ్ళుగా సుప్రీమ్ కోర్ట్‌లో సంచలనాలకు కేంద్రబిందువుగా వున్నాడు. 'కొలీజియం' తీరును ప్రశ్నించారు. 'కొలీజియం' సమావేశాలకు హాజరుకాలేనని చెప్పారు.

'కొలీజియం'లో తీసుకున్న నిర్ణయాలతో తనకు సంబంధంలేదని సమావేశ మినిట్స్‌ని తిరస్కరించారు. కీలక కేసు అయిన జ్యుడీషియల్ కమిషన్ ఏర్పాటు తీర్పులో నలుగురు దాని ఏర్పాటును కొట్టివేయగా జస్టిస్ చలమేశ్వర్ ఒక్కరే సమర్థించారు.

'కొలీజియం' సమావేశాలలో పారదర్శకత అవసరమన్నది జస్టిస్ చలమేశ్వర్ వాదన. ఇక ఒడిషా హైకోర్టు న్యాయమూర్తిపై దర్యాప్తుకి ఆదేశించాలని దాఖలైన పిటీషన్లలో అత్యంత సీనియర్ న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనం విచారణ చేపట్టాలని జస్టిస్ చలమేశ్వర్ ఉత్తర్వులివ్వటం వివాదమయింది.

ధర్మాసనంలో ఎవరు ఉండాలో చెప్పేఅధికారం చీఫ్‌జస్టిస్‌దేనని దీపక్ మిశ్రా జస్టిస్ చలమేశ్వర్ ఉత్తర్వులను చెల్లకుండా చేశారు. అది గత నవంబరులో జరిగింది. నాటినుండి వారిమధ్య కోల్డ్‌వార్ సుప్రీమ్‌కోర్టు బెంచ్‌ల సాక్షిగా జరుగుతున్నది.

అది జనవరి రెండవ వారంలో పూర్తిగా వెలుగు చూసి జస్టిస్ చలమేశ్వర్‌కి మద్దతుగా మరో ముగ్గురు జడ్జీలు వచ్చారు. జస్టిస్ చలమేశ్వర్ మరో అయిదు నెలల్లో రిటైర్ అవుతారు. ఆ తర్వాత నాలుగు నెలలకు చీఫ్ జస్టిస్ దీపక్ మిశ్రా రిటైర్ అవుతారు. కాని న్యాయవ్యవస్థ శాశ్వతం.

ఇప్పుడు చీఫ్ జస్టిస్ పనితీరును ప్రశ్నించిన బృందంలోని జస్టిస్ రంజన్ గొగోయ్ ప్రధాన న్యాయమూర్తి అవుతాడు. అప్పుడు మరో న్యాయమూర్తుల బృందం తిరుగుబాటు చేస్తే! జస్టిస్ రంజన్ గొగోయ్ ఏమనగలుగుతారు?

వ్యవస్థ ముఖ్యమన్న ఆలోచన న్యాయమూర్తులకైనా మరొకరికయినా అవసరం. వ్యవస్థ లోపలి పరిష్కారపద్ధతులను పాటించి సమస్యల చిక్కుముడులు విప్పాలి. వ్యవస్థమీద సందేశాలు తలెత్తే పద్ధతిలో వ్యవహరించటం సమర్థనీయం కాదు.

వివాదానికి కారణమైన చీఫ్ జస్టిస్‌కన్నా, లేవనెత్తిన మిగిలిన న్యాయమూర్తులకన్నా న్యాయవ్యవస్థ విలువైనది.దానిమీదున్న విశ్వాసాన్ని సడలనివ్వకూడదు.

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

# కాస్త దించుతావా పిల్లా

"యూ నో వాట్ ఐ మీన్?" ఇంగ్లీషులో అడిగింది మధ్యమావతి. నాకు కోపం వచ్చిందంటే రాదు మరీ... నేనేమో దుంపల బళ్ళో చదువుకున్నోడిని. (అంటే గవర్నమెంటు స్కూల్లో అని అర్థం) ఆవిడేమో అదేదో అంగ్రేజీ కాన్వెంటులో చదివిన మహారాణి.

పొద్దున్నే చద్దన్నం తిని, ఖాళీ సంచిలో పుస్తకాలు సర్దు కుని చెప్పుల్లేకుండా నడుస్తూ స్కూలుకెళ్ళిన మొన గాడ్ని నేనైతే, వాళ్ళ నాన్నగారు నడిపే కార్లో కాన్వెంటు ముందు ఠీవిగా బూటుకాళ్ళతో దిగి 'టాటా' చెప్పే మొనగత్తె ఆమె.

ఇద్దరికీ సాపత్యం ఎక్కడ? కడలిపువ్వు కొల్లేటి చేపతో కలిసినట్టు, సదరు మధ్యమావతికి నేను కలవడం జరిగింది. అదీ కొండ పల్లి ఖిల్లా దగ్గర.

> **కళ్ళు విప్పినా, కళ్ళు మూసినా అతని పెదవులే దర్శనమిస్తున్నాయి. అసలా బుగ్గలూ? మిర్చీచెట్నీ ఘాటుతో ఎర్రబడ్డ ఆ ముక్కు... ఓహ్... మరిచిపోవడం అసాధ్యంగా వుంది. ఇంతకీ ఆమె ఉద్దేశం ఏమిటో...**

చిన్నతనంలో కొన్నాళ్ళు అక్కడ ఉండటం వల్ల కొండపల్లి చరిత్ర క్షుణ్ణంగా తెలుసు. అదీగాక బొమ్మలు చెక్కే 'నకాష్'ల పిల్లలందరూ నా దోస్తులే. ముఖ్యంగా అక్కడున్న వీరభద్రస్వామి ఆలయం అంటే నాకు చాలా ఇష్టం. అక్కడున్న మండపంలో ఎన్నిగంటలు ఒంటరిగా గడిపానో!

బోలెడుమంది అమ్మాయిలు. అందరూ 'కాన్ - ఫూస్' అంటూ ఇంగ్లీషులోనే గడగడా మాట్లాడు తున్నారు. అందరూ బ్రాండెడ్ జీన్సూ రేబాన్ కళ్ళ జోళ్ళతో కళకళలాడుతున్నారు.

ఆ మాత్రం ఇంగ్లీషు నాకూ రాకపోలేదు. నేనూ బియ్యేగాడ్నే. అందులోనూ లిటరేచరు. కానీ వీళ్ళు మాట్లాడే కొత్తెం యాక్సెంటు నాకు రాదు.

"వై షుడ్ ఐ నో?" మా పురుషోత్తం మాష్టారు నేర్పిన ఇంగ్లీషులో అన్నాను.

"బికాజ్..." అంటూ మొదలెట్టి పదినిమిషాలు గడగడలాడించింది మధ్యమావతి.

"అన్నాయ్... మనం కొంచెం తప్పుకుంటే మంచి దేమో. నా చెవిలో గుసగుసలాడాడు సా.రా.(సా.రా. అంటే సారంగధరరావు)వీడేకాకుండానన్ను'అన్నాయ్' అని పిలిచే మరో 'రమ్మూ' గాడు కూడా మాతోనే ఉన్నాడు. వాడి పేరు రమణమూర్తి.

మేమందరం దుంపలబడి క్లాసుమేట్సుమి. మహా మహా సోనియాగాంధీలూ, లాలూప్రసాద్‌లే తప్పు కోగా లేంది, నేనెంత తప్పుకోక తప్పలేదు.

కరెక్టుగా అరగంట తర్వాత కర్నాటి నారాయణ 'పునుకుల' బండిదగ్గరుండగా మూడు కార్లతోవాళ్ళూ వచ్చారు. మిగతా వాళ్ళందరూ స్టైలుగా కోకోకోలాలూ, పిజ్జాలూ, సూపర్ పేక్స్‌లోంచి తీసి లాగిస్తుండగా-

ఆ యొక్క మధ్యమావతి మాత్రం ఒక్క గెంతులో కారు దిగి, వేడి వేడి పునుకుల మీద పచ్చిమిర్చి అల్లం చింతపండు కొంచెం బెల్లంవేసి ఘాటుగా నీటుగా రుబ్బిన పచ్చడి వేయించుకుని, ఆ పైన ఉల్లితరుగూ, కొత్తిమీర తరుగూ పరిపించుకుని ఆవురావురుమంటూ తినడం మాత్రం నాకు నేత్రా నందకరమయింది.

"ఒకే కొడుకుంటే పిల్లల్ని కన్నట్టూ కాదూ, ఒకే ప్లేటు తింటే పునుకులు తిన్నట్టూ కాదు" అని ఓ సామెతని కూడా ఆమె మూడో ప్లేట్ కోసం చెయ్యి చాపినప్పుడు తయారించా.

ఆ ప్లేటుని కూడా లాగించాక చేతిని చక్కగా కడుక్కుని 'మృదువైన' జీన్స్‌పేంటు వెనకభాగానికి తుడిచి కారెక్కింది. కంటిముందున్న స్వర్గం కారెక్కి వెళ్ళిపోగానే గుండె బండలా బండబారిపోయింది. ఆ యొక్క పిల్లని వాళ్ళనాన్న నాకెందుకిస్తాడూ? ఆశకి అంతూ పంతూ ఉండాలికదా.

నేనేమో ఓ ప్రయివేటు కాలేజీలో లెక్చరర్ని. (గొప్ప కోసం అలా చెప్పుకుంటానుగానీ, మా కాలేజీవాళ్ళిచ్చే జీతాన్ని చూసి ఎలిమెంటరీ స్కూలు టీచరు కూడా 'ధూ' అని ఉమ్మేస్తాడు) మాదీ, మధ్యమావతిదీ ఒకే ఊరు. ఎటొచ్చీ ఆరోతరగతి నుంచీ మేము వేరువేరు





భువనచంద్ర



ఊళ్ళల్లో వేరువేరు స్కూళ్ళల్లో చదవాల్సివచ్చింది.

చూడగానే నేను గుర్తుపట్టేశాను. కానీ గుర్తుపట్టి నట్టు చెప్పలేదు. ఉద్యోగాలూ, పెళ్ళిళ్ళూ, పెళ్ళాలూ గురించి మేము మాట్లాడుకుంటుంటే ఆవిడ విని మా సొల్లు భరించలేక పెళ్ళి- పెళ్ళాం-వివాహబంధాల గురించి అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చింది.

'యూనో వాట్ ఐ మీన్' అని ఆ ఉపన్యాసంలో ఓ పదిహేనుసార్లన్నా అన్నది.

అది ఆమె ఊతపదం. నిజం చెప్పొద్దూ... చిన్నప్పుడే నాకు ఆ పిల్ల అంటే అదో ఇది.

“ఏరా సత్తూ... ఎవర్ని పెళ్ళి చేసుకుంటావురా?” అని సరదాగా ఎవరు నన్ను అడిగినా “అదుగో... 'మది'ని” అనేవాణ్ణి... మధ్యమావతి అని పలకడం రాక. అప్పుడయితే తెలీదుగానీ ఇప్పుడు తలుచుకుంటుంటే మా నాయనమ్మమీద కోపం సునామీలా తన్నుకొస్తోంది.

'శరత్' అనే అందమైన నా పేరుని ఆ పళ్ళు లేని ముసలమ్మ సత్తూ,సత్తుగా, సత్తాయ్అని నానా రకాలుగా మార్చింది.'ఆవిడ్ననటమేం, మా అమ్మా నాన్నా ఆఖరికి ఈ పిల్లకూడా అప్పుడు 'సత్తూ' అనే పిలిచేది. ఈ పిల్లఫ్రెండు 'చిత్తూ'అంటే చైతన్య అన్నమాట.

ఆ చైతన్య స్వయంగా నాకు చెల్లెలు. వీళ్ళిద్దరూ క్లాస్‌మేట్సు. మొన్నమొన్నటిదాకా అంటే నా చెల్లెలికి పెళ్ళయి అత్తారింటికి పోయేదాకా వాళ్ళిద్దరి మధ్యా మొదట ఉత్తరాలూ ఆ తరువాత ఫోన్లూ ఎస్.ఎమ్.ఎస్‌లు అన్నీ నిరాఘాటంగా జరుగుతూనే ఉన్నాయి.

“ఒరే సత్తన్నాయ్...ఇదిగోరా మద్ది ఫోటో అని దాని సెల్‌లో చూపించబట్టి నేను ఆ పిల్లని ఎప్పటికప్పుడు ఫ్రెష్‌గా మనసులో దాచుకుంటూనేఉన్నాను. ఆ పిల్ల కారెక్కి వెళ్ళిపోయాక నా పరిస్థితి సంపూర్తిగా కాలి పోయిన సైకిల్ ట్యూబులా తయారైంది.

“ఆ అమ్మాయి వెళ్ళిపోయిందిగా అన్నాయ్... ఎక్కడని వెతుకుతాం? గుండె దిటవుపరుచుకో అన్నాయ్” అంటూ సారాగాడు నన్ను ఓదార్చే ప్రయత్నం చేశాడుగానీ, ఆ పిల్ల నాకు మా చెల్లెలి ద్వారా ఇండైరెక్ట్ టచ్‌లోనే ఉన్న సంగతి చెప్పలేదు నేను.

భక్తుడు దేవుడిగురించి ఆలోచిస్తే, దేవుడుభక్తుడి గురించి ఆలోచిస్తాట్ట. అలాగే ప్రేయసిప్రియుడి గురించి ఆలోచిస్తేప్రియుడు ప్రేయసిగురించి ఆలోచిస్తాడు. ప్రేయసి సంగతి పరమేశ్వరుడికి ఎరుకగానీ, నేను మాత్రం ఖచ్చితంగా మద్దూ అనబడే మధ్యమావతి గురించే ఆలోచిస్తున్నాను.

అబ్బా... యవ్వనంలో ఎంత నిషా!

చకచకా నడిచేప్పుడూ, కారెక్కి కూర్చునేప్పుడూ కసకసలాడిన కదలికలూ, మిసమిసలాడిన సొగసులూ మతిపోగొడు తుంటే తెల్లార్లూ నిద్దర్లేక పిచ్చాడిలా తిరుగుతున్నాను.

“ఇదేమి లాహిరీ... ఇదేమి గారడీ... ఎడారిలోన పూలు పూచె ఎంత సందడీ” అన్న కవిగారి పలుకుల్లాగా నా హృదయమనే మగ ఎడారిలో, కుసుమ కోమలమైన వసంతం విచ్చేసి ఉర్రూతలూగిస్తోంది.

# అన్నీ మార్చేసిన అదా



ఏవోకటిలే అవకాశాలొచ్చాయి చాలనుకుంటూ చిన్నా చితకా పాత్రలైనా సరే సర్దుకుపోయి పని చేసిన అదాశర్మ కెరీర్ ఎక్కడవేసిన గొంగళి అన్న చందాన ఉండిపోయింది.

బాలీవుడ్‌లో అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నా తీరూదారీ దక్కనే లేదు. ఇక లాభం లేదనుకుంటూ గెటప్‌ను ఆసాంతం మార్చేసింది. డ్రెస్సింగ్, హెయిర్‌స్టయిల్స్ అన్నీ మార్చేసి, కొత్త యాంగిల్‌లో విందు చేసే యత్నాల్లో పడింది. "కొత్త ఏడాదిలో సరికొత్తగా కనపడడమే కాదు, నా దూకుడు చూపిస్తా" అంటోంది. ఏంటో మరి చూద్దాం!



ఊహల సయ్యాటలాడిస్తోంది. "ఏరా అన్నయ్యా...ఏం చేస్తున్నావురా?" ఆరింటికే అరుణోదయంలా కుశలమడిగింది నా చెల్లెలు చిత్తూ.. ఉరఫ్ చైతన్య.

"చైతన్యా... ఏం చెప్పనే! బాగున్నానని చెప్పనా? బాగోలేదని చెప్పనా? అసలేం చెప్పనూ... ఎలా చెప్పనూ!" అన్నాను. 'టెలీపతీ అని దీన్నే అంటారనుకుంటా. తెల్లార్లూ మద్దూకి అప్పుడప్పుడు రెస్ట్ ఇచ్చి నేను ఆలోచించింది చైతన్య గురించే.

అర్జంటుగా దాన్నడిగి మధ్యమావతి అడ్రస్ సంపాయించాలనే ఆలోచించాను. కానీ చైతన్యా వాళ్ళాయన మూర్ఖత్వానికీ, క్రమశిక్షణకీ నడిమధ్యన పుట్టాడు.

అన్నీటైమ్ ప్రకారం అంటాడు. పద్ధతి పద్ధతి అంటూ అందరి ప్రాణమూ తీస్తూ వుంటాడు. ఏడున్నర దాటాక లైట్స్ ఆఫ్. అయిదింటికల్లా లేవాలి. ఐదున్నరనించి ఆరింటిదాకా ఆయన జాగింగ్ అంటూ పరుగులు పెడతాడు. ఆ టైమ్‌లోనే మా చెల్లెలికి కాస్త ఫ్రీడమ్ లభించేది.

"ఏం కావాలిరా? నీ గొంతు చూస్తే అడిగిన వెంటనే వరాలు ఇచ్చేసేలా ఉందే!" లౌక్యంగా అంది నా కిల్లాడీ చెల్లెలు.

దానిదగ్గర్నించి ఏ ఇన్ఫర్మేషన్ రాబట్టాలన్నా ఖర్చవుతుంది.

చిన్నప్పటినుంచీ దాని వ్యవహారం అంతే.

"నిన్న మన మద్దూని చూశానే!" అన్నాను.

"ఆగాగు... ఈ 'మన' అనేమాట ఎప్పుడు పుట్టుకొచ్చింది? దానికీ నీకూ అస్సలు పడదుగా. అది కేవలం నా ఫ్రెండు" డిక్లేర్ చేసింది. బహుశా నా వీక్‌నెస్ అల్రెడీ అది పట్టేసి ఉండాలి.

"అదిగాదే... నిన్న కొండపల్లిలో" చెప్పబోయా... "తెల్సులేవో.. నిన్నేదో పెళ్ళిళ్ళూ పెళ్ళాలూ అంటూ నువ్వూ నీ ఫ్రెండ్సూ అమ్మాయిలందరూ వినేట్టు కారుకూతలు తెగ కూశారుటగా!

సత్తుగాడు ఏమీ మారలేదే చిత్తూ అంటూ అదే నాకు ఫోన్ చేసింది. పైగా నీ బోడి ఇంగ్లీష్‌తో సమాధానాలూ! అన్నీ తు.చ. తప్పకుండా వినిపించింది. ఐనా ఎదుటివాళ్ళు బజ్జీలుతింటుంటే ఏబ్రాసిలాగా నోరు తెరిచి చూడ్డం ఏమిట్రా అన్నయ్యా. నాకు తలకొట్టేసినట్టు అనిపించిందనుకో!" ఛాన్సు దొరికింది గనక తలవాచేలా చివాట్లు పెట్టింది నా తింగరిచెల్లెలు.

"అబ్బా.. అదంతా వదిలేయవే. చిన్నప్పుడు తెగ దెబ్బలాడుకున్న మాట నిజమే అనుకో.. కానీ..." కావాలనే ఆపుచేశా. వేలు చూపిస్తే చెయ్యంతా మింగే తెలివితేటలు దానికున్నాయని నాకు తెలుసు.

"అంటే ఇప్పుడేమంటావూ?"

కావాలనే చికాగ్గా అన్నట్టు నాకనిపించింది.

"నేనేమంటానూ? అసలేమన్నా నిన్ను అడిగానా? రాయబారంలాంటిది చెయ్యమన్నానా? లేదూ, ఆ మద్దూ నాకు తెగ నచ్చేసిందీ, దాన్నీ నన్నూ పాలల్లో నీళ్ళులాగా కలపమని విన్నేమన్నా ప్రార్థించానా? అసలు జీవితంలో పెళ్ళి అనేదే చేసుకోకూడదని నిర్ణయించుకున్న పరమ పవిత్ర బ్రహ్మచారిని, నేనేమంటాను" రివర్స్ ప్లాన్ అప్లయ్ చేశా.

"అలాగా! వెరీగుడ్. నువ్వు బ్రహ్మచారిగా ఉంటేనే మాకు లాభం. అని మా ఆయన రోజుకి పదిసార్లయినా చెబ్తూనేఉన్నాడు. అమ్మానాన్నామిగిల్చిన ఆస్తికిప్పుడు ఏకైక వారసురాల్ని నేనే అవుతాను గదా!" ఆనందం ఒలకబోస్తూ అన్నది శ్రీమతి చైతన్య శంకరగిరి.

"ఎంత దుష్టులే మీరిద్దరూ... హూ... మీ ఆశలు కూలగొట్టడానికైనా నే పెళ్ళి చేసుకుని తీరతాను. గుడ్ బై ఫరెవర్" అన్నానేగానీ ఫోన్ పెట్టెయ్యలేదు.

"ఆహా! ఇంతకీ ఎవర్ని చేసుకుంటావు? చెప్పు సహోదరా, నీ ఆశ అడియాసే... కుమారి మధ్యమావతి అతిత్వరలోనే శ్రీమతి మధ్యమావతి కాబోతున్నది" విషయం చెప్పింది చిత్తూ.

"మైగాడ్... నిజంగానా?" నీరసంగా అన్నాను.

"యా...! వేరే పిల్లనెవరినైనా చూడమంటావా? కట్నం సంగతి వదిలెయ్. దండిగా ఆడబడుచుకట్నాలు ఇచ్చేదాన్ని సెట్ చేస్తా!" టీజింగ్‌గా అంది.

"ఎలుకకి చెలగాటం... పిల్లికి ప్రాణసంకటం" బాధగా అన్నాను. ఒక్కసారిగా కట్టుకున్న కలల సౌధాలన్నీ కళ్ళముందే కుప్పకూలిపోయాయి. ఇంకేం అనగలనూ!

"సామెతని రివర్స్ చేశావు బ్రదర్... కంగారులో! సరే పెట్టెయ్. రాసిలేనప్పుడు ఏం చేస్తాం.

మా ఆయన వచ్చే టైమైంది. పెళ్ళంటే నూరేళ్ళ పంట అనుకున్నాను. పెళ్ళయ్యాక తెలిసింది. పెళ్ళంటే ఆడదానికి నూరేళ్ళ వంట అనీ, గుండెల్లో మంట అనీ!" ఫోన్ పెట్టేసింది మా చెల్లాయి.

కళ్ళు విప్పినా, కళ్ళు మూసినా మద్దూ పెదవులే దర్శనమిస్తున్నాయి. అసలా బుగ్గలూ? మిర్చ్ చెట్నీ ఘాటుతో ఎర్రబడ్డ ఆ ముక్కు... సుతారంగా వేళ్ళు తుడుచుకున్నప్పుడు జీన్సుపేంటు వెనక సుతిమెత్తగా కదిలిన ఆ కదలికలూ!

ఓహ్...గుండె గుబగుబానిట్టూర్చింది. అంతులేని అందాల్ని మోస్తున్న మధ్యమావతి అనబడే నా మద్దూని మరిచిపోవడం మాత్రమే నాకు మిగిలిందా? ఛీ...! ఏనాడూ లేనిది అసలెందుకు నేనిలా బేలగా ఆలోచిస్తున్నానూ? ఎంత సర్దుకుందామనుకున్నా మనసుమాట వినడం మానేసింది.

వారం రోజులు భారంగా గడిచాయి.

"ఒరేయ్ అన్నాయ్... మధ్యమావతి సంబంధం మళ్ళీ కేన్సిలైందిరా. ఇది రెండోసారి" గడగడా అన్నది చిత్తూ.

"అదేమిటే?" షాక్ తిని అన్నాను.

"ఏమో... నాకేం తెలుసూ! ఈ సంబంధాన్ని వాళ్ళ మేనమామ తెచ్చాట్ట. మద్దూ వాళ్ళమ్మా నాన్నా గోల పెట్టి ఈ సంబంధాన్ని మద్దూచేత ఒప్పించారుట.

మొన్న ఆ కుర్రాడు దీన్ని ఏదో కాఫీ హోటల్‌కి తీసుకెళితే అక్కడే ఇది 'నువ్వు నాకు నచ్చలేదు. బుద్ధుంటే వేరే సంబంధం చూసుకో' అని కసిరికొట్టిందిట.

వాళ్ళే క్యాన్సిల్ చేసుకున్నారన్న సువార్తని ఇప్పుడే మద్దూ నాకు ఫోన్ చేసి చెప్పింది" బడబడా అన్నది చిత్తూ ఉరఫ్ చైతన్య.

"ఓహ్... సో నైస్" నా గుండెల్లో ఆనందం కొత్తింట్లో పాలు పొంగినట్లు పొంగింది.

'యస్... మూసుకుపోయిన దార్లు



**ఉగ్రవాదంపై ప్రస్తుతం వేర్వేరు దేశాలు సాగిస్తున్న పోరాటమే నాలుగో ప్రపంచ యుద్ధం.**
-ఎమ్.జె.అక్బర్, కేంద్రమంత్రి

తెరుచుకున్నాయి' నాలో నేను అనుకుని, "ఇంతకీ వాళ్ళు ఎక్కడుంటున్నారూ" అడిగా.

"బెజవాడలోనే... బెంజిసర్కిల్ దగ్గరే ఎక్కడో" చెప్పింది చిత్రా.మళ్ళీ గుండె సోనిపత్ హాట్‌స్ప్రింగ్‌లా పొంగింది. నేనుండేదీ ఆ చుట్టుపక్కలే.

"అమ్మా కనకదుర్గమ్మా. ఒక్కసారి మద్దూని ముద్దుగా నాకు చూపించమ్మా..." అని కనకదుర్గమ్మకి మొక్కు కూడా మొక్కేశా! (అసలదివరకు ఎవరైనా మొక్కు అంటే చాలు, మొక్కా చిలకముక్కా' అని ఎద్దేవా చేసేవాణ్ని). రామవరప్పాడు రింగ్ రోడ్డుదగ్గర ఓ ఫ్రెండ్‌ని కలుద్దామని నేనుంటున్న సున్నపు బట్టీ ప్రాంతం నుంచి నడుస్తూవున్నా.

మనసునిండా బోలెడు రొమాంటిక్ సాంగ్స్. రింగు రోడ్డు వారగా చల్లపునుకులు వీరలెవల్లో వేసే వెంకటస్వామినాయుడికి నేను పెద్ద ఫ్యాన్ని.

అంతేకాదుఅతను అత్యంత కళాత్మకంగా పచ్చి మిర్చి బజ్జీలు వేసి,ఆ తర్వాత ఆ బజ్జీల పొట్లాలకి ఆపరేషన్‌చేసి, ఉల్లితరుగు ఛాట్ మసాలా, ధనియాల పొడి, జీలకర్రపొడి, మాంచిపొగరుమీదున్న ఎర్రకార ప్పొడి, మల్లెపువ్వులాంటి ఉప్పు మిక్స్‌చేసి దాన్ని అతి లాఘవంగా మిర్చిబజ్జీ పొట్టల్లో నిక్షిప్తం చేసి,

ఫైనల్ టచ్‌గా ఓ నిమ్మబద్దని సరసంగా వాటి మీద పిండి అందిస్తే నా సామిరంగా, స్వర్గం ఎక్క డుందని ఏ బజ్జీ ఈటర్‌ని అడిగినా, రింగురోడ్డు మీదే ఉందని చెబుతారు.

బజ్జీమీద కలిగిన ప్రేమతో ఆవైపు చూస్తే అప్పుడే వెంకటస్వామి చేతుల్లోంచి బజ్జీప్లేటు అందుకుంటున్న మద్దూ నాకు ముద్దుగా కనిపించింది.

నేను పరిగెత్తానని ఆమెముందు వాలేవరకూ నాకే తెలీదు. బజ్జీ ఆమె కొరుకుతున్న మధుర క్షణంలో 'మద్దూ... మైడియర్ మధ్యమావతీ...' అని కోయిల కూసినట్టు పిలిచాను.

"అంత అతివినయం అక్కర్లా. మామూలుగా అడిగినా ఓ బజ్జీ ఇవ్వగలను!" అంటూ ఓ బజ్జీ నా చేతికిచ్చింది. సోదరసోదరీమణులారా, ఒట్టేసి చెబుతున్నా, ఆమె సుందరమయిన హస్తంతో ఇచ్చిన బజ్జీ తేనెలూరింది. నా నోట్లో అమృతమై ప్రవహించింది. "ఇంకోటి కావాలా. ఓ...కే...పాపం కొండపల్లిలోనే ఆబగా చూశావు ఇదిగో.. కావలసినన్ని తిను. బిల్లు నాదే!" ఉస్ ఉస్‌మని వేడి బజ్జీని ఊది అన్నది మధ్యమావతి. ఆమె అన్నమాట నాకేమీ పట్టలా. శ్రీ420 సినిమాల్లో వర్షంలో తడుస్తూ రాజ్‌కపూర్ అండ్ నర్గీస్ పాడుకున్న 'ప్యార్‌హువా ఇకొరార్‌హువాహై' పాటలో నేనెప్పుడో పరకాయ ప్రవేశం చేశా, ఎటొచ్చీ వర్షంలేదు అంతే.

"ఇంతకీ గంతకితగ్గ బొంత ఎవరూ నీకు దొరక లేదా?" సగం కొరికిన బజ్జీని సుందరంగా నములుతూ అన్నది మద్దూ.

"అసలు ప్రయత్నిస్తేగా దొరకడానికి..." కదులు తిన్న పెదవొంపుల్ని చూస్తూ అన్నాను.

"అవునూ... పెళ్ళి క్యాన్సిల్ చేశావుట?" మామూలుగా అడిగినట్టు అడిగా.

"హోటల్‌కి తీసికెళ్ళి నీకు వంటొచ్చా? అనడిగాడు ఆ దేభ్యం మొహంగాడు" కోపంగా బజ్జీని మరో కొరుకు కొరికి అన్నది మద్దూ.

"ఛీ... ఎంత భ్రష్టుడు... ఇంత సౌందర్యరాశిని వంటొచ్చా అనడిగాడా?" నేను కోపంగా మరో బజ్జీ కొరికాను. ఆ మాటకి ప్లీజ్ అయింది.

"ఎక్కడుంటున్నావూ" అడిగింది.

**స్నేహాన్ని పువ్వుతో పోల్చకు... వాడిపోతుంది. మంచుతో పోల్చకు... కరిగిపోతుంది. ఆకుతో పోల్చకు... రాలిపోతుంది. నీ నవ్వుతో పోల్చు.... అది శాశ్వతంగా ఎండిపోతుంది.**

"దగ్గర్లోనే హాయిగా నడిస్తే పదినిమిషాల నడక" ఉత్సాహంగా అన్నాను.

"మాంచి అల్లం టీ పెట్టడం వచ్చా" అడిగింది.

"యా... టీలో నేను స్పెషలిస్టుని. ఓ ఏడాది ఢిల్లీలో కూడా ఉన్నానుగదా!" మహదానందంగా ఆవిడ ఖాళీప్లేటుని తీసి కిందవున్న బకెట్‌లో పడేశా.

"సరే... ఛలో" నాతోటి నడుస్తూ అంది.

"ఎలా వచ్చావూ?" అడిగా.

"కార్లోనే వచ్చా. కాసేపు నడుద్దామనీ!" అన్నది.

"మద్దూ... ఓ మాట చెప్పనా" సందేహిస్తూ అన్నాను.

"ఊ...!" "మరే... మరే... మనిద్దరం చిన్నప్పట్నుంచీ అదే" మరి ఎలా చెప్పాలో తెలీలేదు.

"ఆమధ్య నా గురించి తెగ ఎంక్వయిరీ చేశావుట... చిత్రా చెప్పిందిలే" అన్నది.

"అది... మరీ... అది... అడగడానికే... ఏమంటే" తడబడ్డాను. ఎంతైనా ప్రేమని తెలపడం మహా కష్టం బాబూ... ఇల్లొచ్చింది. గ్యాస్ స్టవ్ వెలిగించి పాలూ, నీళ్ళూ టీపొడి కొద్దిగా చిదిమిన అల్లంముక్క ఒక అర ఏలక్కాయ నా బుల్లి కెటిల్‌లో పడేశాను.

"పంచదారవెయ్యవా?" చిన్నగా నవ్వి అన్నది.

"అదిగో ఆ బుల్లి అటకమీద ఉంది. కిందపెడితే చీమలు పడతాయని పైన పెట్టాను" అన్నాను.

"బాబోయ్...అంతఎత్తున పెడితే ఎలా?దించడం నావల్ల అవుతుందా?" అన్నది.

"స్టూల్ వెయ్యనా?" అడిగాను.

"సరే" అన్నది. అనేసి పకపకా నవ్వి "పంచదార డబ్బా దించమని అడిగితే దించుతా...!" అన్నది.

"పంచదార డబ్బా... కాస్త దించుతావా పిల్లా" అన్నా ఉత్సాహంగా.

"దించుతానుగానీ, నన్నెత్తుకోర మల్లా" అన్నది.

గభాల్న ఎత్తుకున్నా. డబ్బా దించుతూ సిగ్గు పడింది. వెచ్చాని ఓ యవ్వన సముద్రపు కెరటం నా తనువుని తాకింది. ఆమె నా చేతుల్లో... పంచదార డబ్బా ఆమె చేతుల్లో.

"ఒరే సత్తుగా...ఎంత దెబ్బలాడుకున్నా, ఇన్నాళ్ళూ నీ చెల్లెలితో ఫ్రెండ్‌షిప్ మెయిన్‌టెన్ చేసింది నీ కోసమేరా. ఎప్పుడూ అనేవాడివిగా నన్నే పెళ్ళి చేసుకుంటాననీ! అందుకన్నమాట. మొన్న చిత్రా చెప్పిందిలే.. అసలు ఏ పెళ్ళికొడుకునీ నేను చూడలేదురా... సరదాగా నిన్ను "యూ నో వాట్ ఐ మీన్!" అన్నది.

జవాబు చెప్పలేను. చెప్పేలోగానే నా పెదాల్ని తన పెదాల్తో మూసేసింది మరి!



## నటన అడ్డు కాలేదు

సినిమా ప్రపంచంలోనే చిన్నతనంనుంచీ ఉన్నప్పటికీ సినిమా తన జీవితాన్ని ఏవిధంగానూ ప్రభావితం చేయులేదంటున్నది గ్లామర్ భామ శృతీహాసన్. "నేను సాధారణ అమ్మాయిలాగే ఉండేదాన్ని తప్ప కమల్‌హాసన్ కూతురిగా ఎప్పుడూ నివసించలేదు.

స్నేహితులు, సరదాలు మామూలే. సినిమా అన్నది ఓ కళ. ఆ కళంటే నాకిష్టం కాబట్టి నటిస్తున్నాను. కాని, నటన నా వ్యక్తిగత జీవితానికి ఎప్పుడూ అడ్డు రాలేదు. పరాజయాలను పట్టించుకోలేదు. ఎందుకంటే ఫ్లాఫ్‌కు నేను ఒక్కదాన్నే కారణం కాదు కదా. అందుకే అనేక కారణాలు ఉంటాయి" అంటోంది శృతీహాసన్. ఎప్పుడూ ఇలాగే వెరైటీ కబుర్లాడుతుంటుందిగా.



ఎవరైనా ఎక్కడైనా ఆడైనా మగైనా
ఎవరినో ఒక్కరినే ప్రేమిస్తారు. అయితే
ఓ గొప్ప అందగత్తె అంతకుమించిన గాయని
అయిన ఓ సుగాత్రి మాత్రం ఒక్కరిని కాదు
ఇద్దరిని ప్రేమించింది.
ఇదేం విడ్డూరమని అడిగితే 'నేనింతే నాకిద్దరూ
ఇష్టమే' అనేసరికి అంతా ముక్కున వేలుంచుకున్నా ఆమేం లక్ష్యపెట్టలేదు
ఆ ప్రేమికులిద్దరూ నిర్విణ్ణులయ్యారు. ఆ తర్వాత ఏం జరిగిందీ

## డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

లవ్లీ సీరియల్

# హృదయం ఎక్కడున్నదీ...

చదవండి తెలుస్తుంది

వచ్చేవారమే ప్రారంభం




Courtesy : DIAMOND WORLD  RANIWALA JEWELLERS

## ప్రొటీన్ల లోపం

**శారీరక ఆరోగ్యానికి అవసరమైన ప్రొటీన్లు అత్యంత కీలకమైనవి.**

శరీరంలో ప్రొటీన్ల లోపం ఏర్పడినట్లయితే అనేక ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయి.

జీర్ణక్రియ మందగించి, జీర్ణవ్యవస్థ పాడవుతుంది. రోగనిరోధక వ్యవస్థ సన్నగిల్లుతుంది. ఎముకలు బలహీనపడతాయి. కీళ్ళు, కండరాల నొప్పులు వస్తాయి.

చర్మం పొరల్లోకి నీరు చేరడంవల్ల చేతులు, పాదాలు, మడమలకు వాపు వస్తుంది. జుట్టు రాలిపోతుంది. పెరుగు, గుడ్లు, బాదం, పిస్తాపప్పులు, చికెన్ వంటివి ఆహారంలో తీసుకుంటూ ఉండాలి.

శాకాహారులైతే ప్రతిరోజూ పప్పుగింజలు, పెరుగు తప్పనిసరిగా తింటుండాలి. ◆

In helping the world we really help ourselves

## మంచి మిరియాలు

మిరియాలవల్ల అనేక ప్రయోజనాలు దక్కుతాయి. ఆహారంలో కొద్దిపాటి మిరియాలను జతచేసేవారిలో ఉదర సంబంధిత సమస్యలు తక్కువగా వుంటాయి. వీటికి కడుపులోని జీర్ణరసాలను స్రవింపజేసే గుణం వుంటుంది.

జీర్ణక్రియకు ఉపయోగపడే ఎంజైమ్‌లు, రసాయనాలు సులువుగా స్రవించడానికి సహకరిస్తాయి. జలుబు, దగ్గుల నివారణలో సమర్థవంతంగా పని చేస్తాయి. మిరియాల్లోని యాంటీ బ్యాక్టీరియల్ గుణాలు ఇందుకు సహాయపడతాయి.

శ్వాస తీసుకోవడం కష్టంగా, ఛాతిపట్టేసినట్లు ఉన్నప్పుడు మిరియాలు తీసుకుంటే ఉపశమనం కలుగుతుంది. మిరియాలలో వుండేటువంటి పైపరిన్ అనే పదార్థం మెదడు కణాలను ఉత్తేజపరుస్తుంది. కనుక, మెదడు చురుగ్గా వుంటుంది. ◆

## ఆ కిరణాలు కావాలి

ఎప్పుడూ ఎ.సి. గదుల్లో, కంప్యూటర్ల ముందు పనిచేసేవారు సూర్యరశ్మికి దూరమైపోతున్నారు. దీనివల్ల వ్యాధి నిరోధకశక్తి తగ్గిపోయి తరచూ ఏదో ఒక అనారోగ్యానికి గురయ్యే అవకాశాలుంటాయి. ఎప్పుడూ ఎ.సి. గదుల్లో ఉండడంవల్ల గదుల్లో బ్యాక్టీరియా, వైరస్‌లు పెరుగుతాయి.

ఎ.సీ.లు ఆన్‌చేయడానికి కనీసం ఒక గంట ముందైనా కిటికీలన్నీ తెరిచి వుండాలి. దీనివల్ల గదిలోని ఫంగస్ వెలికి వెళ్ళిపోతుంది. ప్రతిరోజూ తప్పనిసరిగా సూర్యకిరణాలు సోకే విధంగా ఏవో ఒక వ్యాయామాలు చేస్తే మంచిది. కొద్దిసేపు ఎండలో అటూ ఇటూ తిరిగినా చాలు.



# భలే గొప్ప వత్సరం

గడిచిన ఏడాది తనకు మహాగొప్పగా ఉందని ఆనందపడుతున్నది రకుల్‌ప్రీత్‌సింగ్. 2009తో తొలిసినిమా చేసిన రకుల్ సినీప్రయాణం సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లా దూసుకుపోతున్నది.

ఏ పాత్రలకైనా సై అంటూ భిన్నత్వాన్నిచూపడం ఆమె ప్రత్యేకత. క్షణం తీరికలేని షూటింగ్‌లతో పాటు, తనకెంతో ఇష్టమైన ఫిట్‌నెస్ వ్యాపారాన్ని కొనసాగిస్తున్నది రకుల్‌ప్రీత్‌సింగ్.

## ఎంతో బావుంది

"నాకు 2017 చాలా చాలా బావుంది. 'రారండోయ్ వేడుక చూద్దాం', 'జయజానకి నాయక', 'స్పైడర్', 'ఖాకి'లతో ప్రేక్షకుల ముందుకు వచ్చాను. ప్రస్తుతం తెలుగు, తమిళ సినిమాలు చేతినిండా వున్నాయి. భాష విషయంలో నాకే హద్దులూ లేవు. సినిమాలనేవి కళ. భావోద్రేకాలకు అర్థంపడతాయి. భావోద్రేకాలకు భాష లేదు. ఓ ఆర్టిస్టుగా భాషపరంగా హద్దులు ఉన్నాయనుకోను" అని చెప్పింది రకుల్‌ప్రీత్.

చిత్ర పరిశ్రమలన్నీ ఒకే మాదిరి ఉంటాయన్నది ఆమెఅభిప్రాయం.భాషమినహా మరేఇతర వ్యత్యాసమూ ఉండదు. ప్రతి పరిశ్రమలో చెడ్డ వ్యక్తులు, మంచి వ్యక్తులు ఉంటుంటారు. అలాగే మంచి సినిమాలు, చెడ్డ సినిమాలు ఉంటాయి.

క్రియేటివ్, నాన్-క్రియేటివ్ వ్యక్తులుఉంటారు. అదృష్టవశాత్తూ నా కెరీర్ అంతా సరైన వ్యక్తుల నడుమే నడిచింది" అని సందర్భం వచ్చినప్పుడల్లా చెప్పుకుంటుంటుంది రకుల్‌ప్రీత్‌సింగ్.

## క్రమశిక్షణలో టాప్

ఆర్మీకిడ్ కాబట్టి క్రమశిక్షణలో టాప్.ఆటలు ఆడుతూ పెరిగింది. జాతీయస్థాయిలో గోల్ఫ్ ఆడింది. బాగా ప్రాక్టీస్ చేసేది. అలా స్పోర్ట్స్ నుంచి మోడలింగ్‌కువచ్చేసింది. క్రీడాప్రాంగణంలో వ్యాయామాలు జిమ్‌కు మారాయి. మొదట్లో నచ్చకపోయినా, ఇష్టాన్ని ఏర్పరచుకుని ఫ్యాషన్‌గా మార్చుకుని ఏకంగా 'ఎఫ్ 45' వ్యాపారంలోకి దిగి వ్యాపారాన్ని, కెరీర్‌ను, వ్యక్తిగతాన్ని సమతౌల్య పర్చుకోవడంలో తనకి తానే సాటి అన్నట్లు నిలిచింది.

Photography : KUNAL DASWANI Courtesy : JFW



# మెదడుకు తగిన ఆహారం

ప్రతిరోజూ వయసు పెరుగుతుంది ఆ వయసు శరీరంలోని అన్ని భాగాలకు ఒకేలా పెరుగుతుంది. అయితేశరీరంలోచురుకుదనం తగ్గినా, మెదడును చురుకుగా కాపాడుకునే అవకాశం ఉంది.

మెదడు చురుకుగా ఉంటే జీవితం భిన్నంగా ఉంటుంది. ఆలోచనలు మెరుగ్గా ఉంటాయి. అంతేకాక నలుగురిని కలిసి, వారితో తమ భావాలు పంచుకోగలుగుతారు. వారి హాబీలను హాయిగా కొనసాగించుకునే అవకాశం మెదడు ఇస్తుంది.

సంగీతం, చిత్రకళ వంటివి ఏవైనా తమకు ఇష్టం వచ్చిన రీతిలో సాగిస్తూ ఇతరులను ఆశ్చర్యపరచగలుగుతారు.

అలాచురుకుగాఉండే పెద్దల చుట్టూ పిల్లలు మూగుతారు. దానివలనవయసుభారం మరచి పోయి హాయిగా ఆడుకోగలరు. అన్ని కార్యక్రమాలలో పాలుపంచుకోగలుగుతారు. ఇందుకోసం మెదడుకు తగిన ఆహార పదార్థాలను ముందువయసు నుండే తీసుకోవటంమొదలుపెట్టాలి.

## కొబ్బరినూనె

వంటలకు కొబ్బరినూనెను వాడటం మొదలుపెట్టండి. ఇది మలయాళీలు వాడే వంటనూనె. ట్రైగ్లిసరిడ్స్‌ని ప్రకృతి సహజంగా అందించే అత్యుత్తమ పదార్థం కొబ్బరినూనె.

ఇవి మీడియమ్ చైన్ ట్రైగ్లిసరిడ్‌లు (ఎమ్.సి.టి).ఈ ఎమ్.సి.టిలకున్న ప్రత్యేకత చాలా సులభంగా కేటోన్‌లుగా మారగలగటం.

ఆ కేటోన్‌లు అనేది మెదడుకణాలకు ముఖ్యమైన ఇంధనం. చక్కెరలు, ఇన్సులిన్‌లకు సంబంధం లేకుండా కేటోన్‌లు అందించబడటం విశేషం. కాబట్టి కొబ్బరినూనె అనేది మెదడుకు సులభంగా, క్షేమంగా మెదడుకు అందించగలిగిన పోషకపదార్థం.



## తైలం గల చేపలు

చేపలు మానవ ఆరోగ్యానికి మేలు చేస్తాయి. మాక్రల్, ట్యూనా, సాల్మన్ వంటి చేపలు శరీరానికి అవసరమైన ఒమేగా-3 ఫ్యాటీ ఆమ్లాలను అందిస్తుంది. ఇవి తైలం శరీరంలో కలిగిన చేపలనుండి సహజంగా అందుతాయి. ఈ ఆమ్లాలను శరీరం తనంతతానుగా తయారుచేసుకోగలదు.

మెదడు ఆరోగ్యాన్ని మెరుగుపరిచే శక్తివంతమైన పోషకపదార్థం చేపలు. మెదడు కణాల మధ్య సమాచారం సరఫరా అతివేగంగా, ఆరోగ్యంగా జరుపుకునేందుకు ఈ ఫ్యాటీ ఆమ్లాలు ఎంతగానో సహకరిస్తాయి.



Courtesy : SAVVY

## బ్లూ బెర్రీలు

ఒక వయసు తర్వాత జ్ఞాపకశక్తి క్రమంగా మందగిస్తుంది. అటువంటి మందగింపు జరగకుండా చూడగలిగినవి బ్లూ బెర్రీస్ అని పరిశోధకులు తేల్చారు. ఇటీవలి అంశాలు జ్ఞప్తికి రాకుండా ఇబ్బందిపడేటువంటి పరిస్థితికి విరుగుడుగా బ్లూ బెర్రీలను ఆహారంలో భాగం చేసుకోవాలి.

## అవకాడోస్

మెదడు ఆరోగ్యాన్ని పెంపొందించటంలో బ్లూబెర్రీల వంటివే అవకాడోస్. ఇది కొవ్వులను కలిగిన పండు. అయితే ఆ కొవ్వులు మోనోశాట్యురేటెడ్ కొవ్వులు.

దీనివలన రక్తప్రవాహం మెరుగ్గా ఉంటుంది. అవకాడోస్ రక్తపోటును తగ్గిస్తుంది.

జ్ఞాపకశక్తి మందగింపు హైపర్‌టెన్షన్ ఉన్నవారిలో త్వరగా ఏర్పడుతుంది.

## నట్స్

ఎండుపండ్లు విటమిన్ ఇని అందిస్తాయి. ఈ విటమిన్ మెదడు చురుకుదనం తగ్గనివ్వదు. ముఖ్యంగా వయసు మళ్ళినవారిలో జ్ఞాపకశక్తి తగ్గడాన్ని అడ్డుకుంటాయి.

## బ్రొకోలి

దీనిలో విటమిన్ కె అధికం. బ్రొకోలి ఆహారంలో తిన్నప్పుడు మెదడు శక్తి పెరుగుతుంది. చురుకుగా పని చెయ్యగలుగుతుంది.

## విటమిన్లు

రక్తంలో హోమోసిస్టీన్ పెరిగితే పక్షవాత ప్రమాదం పెరుగుతుంది. అల్జీమర్స్ రావటం, మెదడు ఉపయోగించిచేసేటువంటి పనులకు ఇబ్బంది కలగటం జరుగుతుంది.

అందువల్ల ఆ హోమోసిస్టీన్‌ని తగ్గించే శక్తికలిగినవిగా గుర్తించబడిన విటమిన్ బి6, విటమిన్ బి 12, ఫోలిక్ యాసిడ్‌లను ఆహారంలో తప్పక తీసుకోవాలి. ఇక తగిన రీతిలో ఆహారం తీసుకుని మెదడు చురుకుదనం పెంచుకోండి.



# సత్యాన్వేషణ

## శ్రీమహావిష్ణు స్తుతి

సశంఖచక్రం సకిరీట కుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్
సహార వక్షస్థల శోభికౌస్తుభమ్
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్.

శంఖచక్రములతో కూడినవాడు, కిరీట కుండలములు కలిగినవాడు, పసుపుపచ్చని వస్త్రముకలవాడు, పద్మములవంటి కన్నులు కలవాడు, హారముతో కూడిన వక్షస్థలమున శోభించు కౌస్తుభము కలవాడు, నాలుగు భుజములు కలవాడైన విష్ణువుకు శిరసు వంచి నమస్కరిస్తున్నాను. ❒

## భీష్మైకాదశి

**(తేదీ : 27.1.2018)**

భీష్ముని పేరిట శ్రీమహావిష్ణువు ఒక ఏకాదశీ తిథిని నిర్ణయిస్తే అది భీష్మ ఏకాదశి-సంధిచేస్తే-భీష్మైకాదశి అయింది. భీష్మ పితామహుడు సాక్షాత్తు శ్రీహరి స్వరూపమైన శ్రీకృష్ణుణ్ణి తన చర్మచక్షువులతో చూస్తూ అలా తన ప్రాణాన్ని విడిచి, తనకు తాను ఆ పరమాత్మలో లీనమైపోయాడు.

నిజానికి ఇలా శ్రీహరిలో భీష్ముడు ఐక్యం చెందిన రోజు 'అష్టమి'. దాన్నే 'భీష్మాష్టమి' అని పిలుస్తూంటాం. నిజానికి భీష్ముడు అష్టమినాడు శ్రీహరిలో లీనమైనప్పటికీ, భీష్ముడు సాక్షాత్తు కృష్ణుణ్ణి ఏనాడూ కూడా ఓ వ్యక్తిగా భావించక,భగవంతునిగానే దర్శించిన కారణంగా శ్రీహరి ఆ భీష్ముని భక్తితత్పరతని గమనించి తనకిష్టమైన ఏకాదశీ తిథిని ఆయన పేరిట అనుగ్రహించాడు.

దాంతో 'భీష్మైకాదశి'గా వ్యవహరించారు పెద్దలు. లోకంలో అందరూ ఈ రోజుని భీష్మునికి తర్పణాలు (నువ్వులు, నీళ్ళు) విడుస్తారు తల్లిదండ్రులున్న వారైనా సరే.దోషం లేని రోజు నేడు మాత్రమే. ❒

## మాఘమాస ఆదివారంనాడు

**(తేదీ : 28.1.2018)**

ఈసారి మాఘమాసంలో జనవరి 28 నాడు ఏకాదశీ, ద్వాదశీ తిథులు రెండూ కలిసిఉన్న కారణంగా 'తిలదానం' చక్కని ఫలితాలన్నిస్తుంది.

ఈ రోజున నువ్వుల్ని నీటిలో వేసుకుని స్నానం చెయ్యాలి. నువ్వులనూనెతో దీపాన్ని పెట్టాలి.

నల్లనువ్వులతో హోమం చేయడం మరింత మంచిది. కొద్దిగా నువ్వుల్ని నోటిలో వేసుకోవాలి. ఆ మీదట నువ్వుల్ని బ్రాహ్మణునికి-

'దివాకర! జగన్నాథ! ప్రభాకర! నమో ఽస్తుతే!।
సూర్యో మే ప్రీయతాం దేవో విష్ణుమూర్తి ర్నిరంజనః॥'

అనే శ్లోకాన్ని ముమ్మారు చదువుతూ దానం ఇయ్యాలి. మ. 11.45 నుండి 12-15 నిమిషాల మధ్య ఈ దానాన్ని చేయడం మరింత మంచిది.

సూర్యుని పుట్టిన మాసం-సూర్యశక్తి ఉన్నవారం-సూర్యునికిష్టమైన అభిజిల్లగ్నంలో సూర్యపుత్రుడైన శనికిష్టమైన తిలల్ని దానంచేశామన్నమాట! ❒

> { అనంతమైన ఓర్పు, అనంతమైన పవిత్రత, అనంతమైన పట్టుదల ఇవే సత్కర్మ సఫలమవటంలోని రహస్యాలు. }

## సముద్రస్నానం

**(తేదీ : 31.1.2018)**

మనం సాధారణంగా ఇళ్ళలో స్నానాల్ని ముగిస్తాం. అది ఏదో ఒక నదికి సంబంధించిన జలం అయ్యుంటుంది. ఇక ఏదో తీర్థయాత్రకిగాని వెళ్తే మరో నదిలో స్నానాన్నిచేసిన ఫలితాన్ని పొందగలం. అదే మరి సముద్రంలో స్నానంచేస్తేనో మొత్తం నదులన్నీ సముద్రంలోనే కలుస్తాయి కాబట్టి సమస్త నదుల్లో స్నానంచేసిన ఫలితం వస్తుంది.

నదులన్నీ ఒకలాగానే మనకి కన్పించినా ఒక్కో నదికి ఒక్కో తీరు రుచి గుణం ఉంటుంది. ఐనా ఇవన్నీ సముద్రంలో కలిసినప్పుడు ఉప్పదనమే ఉంటుంది అన్నిటికీ.ఇన్ని తీరుల రుచుల జలం ఉప్పదనమున్న జలంతో మన శరీరాన్ని స్నానం చేయించే కారణంగా శరీరపు చర్మవ్యాధులు తొలగడమే కాక, శరీరానికీ, బుద్ధికీ ఓ వింత శోభ వస్తుంది. ❒

## సంపూర్ణ చంద్రగ్రహణం

**(తేదీ : 31.1.2018)**

'ఏమీ కలిసిరావడంలే'దని బాధపడుతూ ఉంటారు కొందరు. కలిసొచ్చేలా చేయగల అవకాశం ఈ చంద్రగ్రహణంనాడు జపంచేస్తే వస్తుంది.

31 జనవరి సాయంత్రం 5 గంటలకే స్నానాన్ని ముగించి తిలకధారణాన్నిచేసి మీకిష్టమైన దైవానికి సంబంధించిన స్తోత్రాన్నో, మంత్రానో జపిస్తూ 5 గంటలనుండి 8.45 వరకూ గడపాలి.

అమ్మో! అంత సమయమా? అన్పిస్తే మధ్యమధ్య ఏమీ తినకుండా విశ్రాంతిని తీసుకుంటూ జపాన్ని ముగించగలగాలి. ఆశ్లేషా నక్షత్రంవారు గ్రహణాన్ని చూడనేకూడదు. పునర్వసు, పుష్యమీ నక్షత్రాల్లో పుట్టినవారికి జపం తప్పనిసరి.

గ్రహణం రాత్రి 8.41కి ముగుస్తుంది కాబట్టి మళ్ళీ స్నానాన్నిచేసి ఇంటిని శుభ్రపరుచుకుని పూజా మందిరంలో దీపారాధనని చేయాలి.

శక్తి ఉంటే 5.18 నుండి 8.41 మధ్యలో దానమీయడం మరింత మంచిది. ❒

## సూర్యారాధన మాసం

భాద్రపదమాసంలో గణపతీ, ఆశ్వయుజంలో అమ్మవారూ, కార్తికంలో శంకరుడూ, మార్గశిర్షంలో శ్రీహరీ, పుష్యమాసంలో మాఘమాసంలో కూడా సూర్యభగవానుడు తమని ఆరాధించినంతనే ప్రసన్నులై, గణపతి విఘ్నాలని తొలగిస్తాడు.

అమ్మవారు సంతాన భాగ్యాన్నిస్తుంది. శంకరుడు దంపతుల ఐకమత్యాన్ని కల్గిస్తాడు.

శ్రీహరి భోగభాగ్యాలనిస్తాడు.

సూర్యభగవానుడు ఆరోగ్యాన్నిస్తాడు.



చేటీలు వచ్చి ఒక పట్టుపరుపును తీసి నేలపై పరిచారు.

ఉత్తరాభిముఖంగా ఆ వృద్ధుడి తలను ఉంచి శరీరాన్ని పడుకోబెట్టారు. తలవైపు గంధపునూనెతో నింపిన బంగారు ప్రమిదలో వత్తి వెలిగించి దీపాన్ని పెట్టారు.

అతడి శరీరం అంతా పన్నీరుజల్లి సుగంధాలు పూశారు. రంగురంగుల సుగంధ పుష్పాలతో శరీరమంతా కప్పి వేశారు.-ఈ తతంగమంతా అయ్యేటప్పటికి సామ్రాట్ చంద్రగుప్తుడు-

మహారాణి కుమారదేవి, యువరాజు కచగుప్తుడు, మహామంత్రి కశ్యబ్రహ్మ, రాజపురోహితుడు మైత్రేయుడు, ముఖ్య రాజపరివారం అక్కడకు చేరుకున్నారు. సముద్రగుప్తుడికి నోరు విప్పవలసిన అగత్యం ఏర్పడింది.

"ఎవరో మహాతపస్వి. నన్ను చూద్దామని వచ్చి నా చేతుల్లో మరణించాడు ప్రభూ!" తండ్రితో అన్నాడు సముద్రగుప్తుడు. అంతకుమించిన వివరాలు ఇవ్వలేదు.నిజానికి అంతకుమించిచెప్పటానికి రాకుమారుడికి ఆ క్షణంలో ఇష్టం లేకపోయింది.

ఆ మాటలకు అందరిలో మౌనం. కొంతసేపయ్యాక కశ్యపబ్రహ్మ కల్పించుకొని "మరి ఇపుడు కర్తవ్యం" అడిగాడు.అప్పటికే సూర్యుడు పూర్తిగా పశ్చిమాద్రిలోకి జారిపోయాడు.

సన్నని చీకటి తెరలు ఆరంభం

## జరిగిన కథ 2

తన కుమారులైన కచగుప్తుడు, సముద్రగుప్తులలో ఎవరు తన రాజ్యాన్ని ధర్మబద్ధంగా పరిరక్షించ గలరోనని భద్రకాళి ఆలయంలో దీర్ఘాలోచనలో పడతాడు సామ్రాట్ చంద్రగుప్తుడు. తీరని రాజ్యవిస్తరణ ఆకాంక్ష కల్గినవాడు కచగుప్తుడు.

సుందరుడు, సుకుమారుడు యుద్ధమంటే ఏవగింపు కల్గినవాడు సముద్రగుప్తుడు. వీరిలో రాజ్యాన్ని అధిష్ఠించగల్గిన వారసుడెవరు?

కాపాలికుడు 'సమయం ఇంకా రాలేద'ని చెప్పటంలోని ఆంతర్యం ఏమిటో ఎంతకీ అర్థంకాదు.

కాపాలికుడివలన మనకు ఏమీ నష్టంలేదని మహారాణికి చెబుతాడు చంద్రగుప్తుడు. భద్రకాళి పాదాల ముందు తను ఉంచిన ఖడ్గం మాయమయ్యేసరికి ఆశ్చర్యపోతాడు చంద్రగుప్తుడు. అది తిరిగి ప్రత్యక్షం కావడంతో మహారాజా రాణి ఇద్దరూ మరోసారి ఆశ్చర్యానికి గురవుతారు.

మరో భద్రకాళి ఆలయంలోకి ప్రవేశించిన మహారాజుకు తిరిగి కాపాలికుడు కనబడి మాయమవుతాడు.

ఓ వృద్ధుడు సముద్రగుప్తుడివద్దకు వచ్చి రేపటిగురించిన నీ జీవితపుస్తకం ఇందులో దొరుకుతుందని చెప్పి కొన్ని తాళపత్రాలిచ్చి అతని చేతిలో చనిపోతాడు. ఇక చదవండి.

సి.శివరామమూర్తి

సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త




అయ్యాయి. సముద్రగుప్తుడు "ఆ శరీరాన్ని దహనం చేయాలి"

మైత్రేయుడు కల్పించుకొని "సూర్యాస్తమయమయింది. ఇపుడు దహనం చేయటం నిషిద్ధం" అన్నాడు.

సముద్రగుప్తుడు కల్పించుకొని "రేపు సూర్యోదయమైనతరువాత కర్తవ్యం నిర్వహించబడుతుంది" అన్నాడు.

"మరి కర్త ఎవరు యువరాజా...!" మైత్రేయుడు అడిగాడు.

సముద్రగుప్తుడు 'నేను' అనబోయి వెంటనే తమాయించుకొని ఆ పదాన్ని గొంతులోనే నొక్కివేశాడు!

"రేపు ఉదయం నిర్ణయిద్దాం... మైత్రేయా!" అన్నాడు.

కశ్యపబ్రహ్మ "మరి ఈ కట్టెను రాజప్రాసాదం నుండి తరలించేందుకు యువరాజా అనుమతి ఇవ్వమని ప్రార్థన" అన్నాడు.

యువరాజా తల అడ్డంగా తాటించాడు. అక్కడున్నవారందరికీ సముద్రగుప్తుడి మనోగతం అర్థంకాలేదు. మరి కొందరికి విస్మయం కల్గించింది.

"కశ్యపా! ఇతడు నా చేతిలో తుది శ్వాసను విడిచాడు. పైగా ఒక మహాపురుషుడు. రేపు సూర్యోదయంవరకు ఈ శరీరం ఇక్కడే ఉంటుంది" ఆ మాటలకు అందరూ మొహమొహాలు చూసుకున్నారు.

సముద్రగుప్తుడి నిర్ణయం తిరుగులేనిదని అక్కడ వున్నవారందరకూ తెలుసు. నచ్చచెప్పినా ఉపయోగముండదని ఉగ్గుపాలతో పెంచిన అతని తల్లిదండ్రులకు, పరివారానికి అనుభవైక విషయం. నిస్సహాయంగా నిట్టూర్పు విడిచి అందరూ నిష్క్రమించారు.

ఇప్పుడు ఆ ప్రాసాదంలో బయట కాపలా కాస్తున్న రాజభటులుతప్ప మిగిలినవారు ఇద్దరే సముద్రగుప్తుడు, మహాదేవి. మహాదేవి మహారాణి కుమారదేవికి పినతల్లి. పిల్లలు లేని మహాదేవి రెండున్నర దశాబ్దాలక్రితం తన భర్త మరణం తర్వాత కుమారదేవిని చేరింది. అపుడు కుమారదేవి గర్భవతి.

సముద్రగుప్తుడిని ఆమె గర్భంనుంచి సాకిన మరో తల్లి మహాదేవి. ఎనబది పదులు నిండిన మహాదేవికి సముద్రగుప్తుడంటే పుత్రవాత్సల్యం.

అలాగే యువరాజుకు కూడా మాతామహి (అమ్మమ్మ) మహాదేవి అంటే వల్లమాలిన అభిమానం... సముద్రగుప్తుడు దూరంగా ఆ ప్రాసాదంలో ఆసనం మీద కూర్చొని ఆలోచిస్తున్నాడు. ఒకసారి ఆ వృద్ధుడి శవంవైపు చూశాడు.

మళ్ళీ గుర్తుకువచ్చింది.

ఇంతకుముందే చూసిన ఆ పుట్టుమచ్చ. ఆ వృద్ధుడి కుడి వక్షస్థలంపై అర్ధచంద్రాకారంలో ఉన్న విచిత్రమైన పుట్టుమచ్చ అది.

ఇంతకుముందు పరివారం శరీరాన్ని పువ్వులతో కప్పుతున్నప్పుడు ఈమచ్చ చంద్రగుప్తుడికి కన్పడింది.

సరిగ్గా ఆ అర్ధచంద్రుడి పుట్టుమచ్చ పరిమాణంలోనే నుదుటిన ప్రతిరోజా తిలకాన్ని దిద్దుకుంటాడు యువరాజా. అది తమ రాజవంశ చిహ్నం.

ఉన్నట్టుండి ఒక్కసారిగా ఆ వృద్ధుడి మాటలు గుర్తుకువచ్చాయి-

"రా కుమారా! రాబోయే నా జన్మకు నీకు అవినాభావ సంబంధం వున్నది. అందుకనే ఇక్కడకు వచ్చాను..." ఈ విషయంగాక మరో విషయం రాకుమారుడిని బాగా ఆలోచింపచేస్తోంది. అది దొంగిలించబడిన తాళపత్రాలు!

వృద్ధుడు వాత్సల్యంతో కానుకగా ఇచ్చిన అమూల్య తాళపత్రాల్ని అప్పుడే ఎవరో అతిచాకచక్యంతో దొంగిలించబడిన తాళపత్రాలు!

వృద్ధుడు వాత్సల్యంతో కానుకగా ఇచ్చిన అమూల్య తాళపత్రాల్ని అప్పుడే ఎవరో అతి చాకచక్యంతో దొంగిలించారు. వృద్ధుడు నేలకు ఒరగగానే ఆ తాళపత్రాలను తీసి ఆ మూలగా ఉన్న గంధపు పెట్టెలో నిక్షిప్తపరిచాడు. కానీ అవి ఇప్పుడు మాయమయ్యాయ్!

"ఎవరు తస్కరించివుంటారు? ఏం ప్రయోజనం కోసం చేసివుంటారు...? వృద్ధుడు తనతో మాట్లాడుతున్నప్పుడు ఎవరైనా పొంచి తమ మాటల్ని విన్నారా? తనకు తెలియని తన శత్రువులు తన ప్రాసాదంలో ఉండి అనుక్షణం తనను గమనిస్తున్నారా?"

సముద్రగుప్తుడిలో ప్రశ్నలు!

సామ్రాట్ చంద్రగుప్తుడు తన శయ్యాగారంలో హంసతూలికా తల్పంమీద శయనించివున్నాడు.

అతడి మనసులో సుళ్ళు సుళ్ళుగా ఆలోచనలు. 'ఈ మధ్య విచిత్ర సంఘటనలు జరుగుతున్నాయ్. నిన్న మొన్న కాపాలికుడు. ఈ రోజున ఈ వృద్ధుడి మరణ ఉదంతం' అలా అలా ఆలోచిస్తూ అర్ధరాత్రి అయింది.

ఇక నిద్రపట్టక లేచి అసహనంగా కూర్చున్నాడు. బయట రాజభటులు కాపలాకాస్తూ అటూ ఇటూ తిరుగుతున్నట్లుగా అడుగుల సవ్వడి. తలుపులు మూసివున్నాయ్!

ఉన్నట్టుండి చంద్రగుప్తుడి తలవైపు చప్పుడు అయింది. ఒక్కసారిగా తల తిప్పి చూశాడు. అక్కడ ఆ మూలగా కాపాలికుడు నుంచొనివున్నాడు.

చంద్రగుప్తుడు ఆశ్చర్యంతో స్థాణువయ్యాడు... "ఎలా వచ్చాడు కాపాలికుడు? నలువైపులా తలుపులు మూసి ఉన్నా తన శయనమందిరంలోకి ఎటునుంచి వచ్చాడు కాపాలికుడు?

ఇంతకీ ఈ అపరాత్రి రాకలో కాపాలికుడి ఆంతర్యం ఏమిటో! తనకు హాని చేయడు కదా!" అనుకున్నాడు.

ఈ భావన రాగానే చంద్రగుప్తుడు ఒక్క ఉదుటున లేచి కత్తిని చేతిలోకి తీసుకున్నాడు. గమనించిన కాపాలికుడు తలవంచి "మహారాజులకు అభివాదం. నేను రాజవంశానికి మిత్రుడినే కాని శత్రువుని కాదు ప్రభూ! నీకు మేలు చేయాలని నా సంకల్పం" అన్నాడు.

చంద్రగుప్తుడు కాపాలికుడితో లోగడ తన అనుభవాన్ని పునశ్చరణ చేసుకున్నాడు. కాపాలికుడి మాటల మీద విశ్వాసం కుదిరింది. కత్తిని తిరిగి యథాస్థానములో ఉంచాడు చంద్రగుప్తుడు. కాపాలికుడు స్నేహపూరితంగా నవ్వాడు. చంద్రగుప్తుడు కాపాలికుడిని ఆహ్వానించాడు.

కాపాలికుడు నిర్భయంగా వచ్చి రాజుకు ఎదురుగా ఆసీనుడయ్యాడు. ఈసారి చంద్రగుప్తుడు కాపాలికుడ్ని మరింత నిశితంగా పరిశీలించాడు.

ఎముకల పోగు, పిచ్చివాడి చూపులు, తైలసంస్కారంలేకుండా చెదిరిపోయిన పిచ్చుకగూడులాంటి శిరోజాలు, మొలకొక గోచీ, ఒళ్ళంతా తెల్లని విభూతి.

చంద్రగుప్తుడు తన మనోభావాలు మొహంమీద ప్రస్ఫుటం కానివ్వకుండా గంభీరంగా కూర్చొన్నాడు. కాపాలికుడు "చంద్రగుప్తా! నీ సంకల్పానికి తోడవుదామని వచ్చాను" అన్నాడు.

చంగ్రుప్తుడు "ఈ విషయంతర్వాత మాట్లాడుదాం. ముందు నువ్వు ఇడకు ఎలా వచ్చావో చెప్పు కాపాలికా!"

కాపాలికుడు "రావలసినవిధంగా వచ్చాను చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడు కఠిన స్వరంతో "మరోసారి అడుగుతున్నాను. కాపాలికా...! నువ్వు కాళికా గుడిలో ఎలా అదృశ్యమయ్యావ్! మళ్ళీ ఇక్కడకెలా ప్రత్యక్షమయ్యావ్!" అని అడిగాడు.

కాపాలికుడు నవ్వి "సామ్రాట్ ఆజ్ఞాపిస్తున్నాడు అవునా?" అన్నాడు.

చంద్రగుప్తుడు తల ఊపాడు.

కాపాలికుడు "ఈ కాపాలికుడు భద్రకాళి ఆజ్ఞలు తప్ప ఎవరి ఆజ్ఞలూ స్వీకరించడు చంద్రగుప్తా!"

చంద్రగుప్తుడు "ఓహో, అయితే నువ్వు చేస్తున్న చర్యలు అన్నీ ఆమె ఆజ్ఞలేనా..." అదోలా నవ్వాడు.

కాపాలికుడు రాజు కళ్ళల్లో సూటిగా చూసి "ఈ జగత్తంతా నా తల్లి లీలే చంద్రగుప్తా!" అన్నాడు.

"నువ్వూ, నేను ఆమె చేతిలోని ఆటబొమ్మలం" అన్నాడు కాపాలికుడు. చంద్రగుప్తుడు ఆ మాటలకు నిశ్శబ్దమయిపోయాడు.

కాపాలికుడు "చంద్రగుప్తా! నీ సందేహానికి నా సమాధానం ఇదే...! నాకు అదృశ్యమయ్యే ఎటువంటి యోగశక్తీ లేదు. గుడిలో అదృశ్యమైంది, ఇక్కడ ప్రత్యక్షమైంది ఏ మాయవల్లా కాదు"

చంద్రగుప్తుడి కళ్ళు వెడల్పయ్యాయి. "మరి" అన్నాడు.

కాపాలికుడు "సమయం వచ్చినపుడు తప్పకుండా చెపుతాను చంద్రగుప్తా! ఇపుడుమాత్రం కాదు"

చంద్రగుప్తుడిలో తల ముక్కలు అయ్యేంత ఆశ్చర్యం... 'ఇంతకాలం కాపాలికుడికి అలౌకికమైన శక్తి ఉందని విశ్వసించాడు. అలా కాకపోతే ఎలా మాయమవుతున్నాడు?'

రాజు మనోభావాలు గమనించిన కాపాలికుడు- "చంద్రగుప్తా! ఈ విషయాన్ని పక్కకు పెట్టు. నీ మనోసంకల్పంగురించి మాట్లాడుకుందాం..." అని అన్నాడు.

చంద్రగుప్తుడు "నా మనసులోని భావాలు నీకెలా తెలుస్తాయి!"

కాపాలికుడు "అమ్మ... ఆ జగన్మాత చెప్పింది. ఆ భద్రకాళీ ప్రేరితుడనై నీ దగ్గరకు వచ్చాను. అంతేకాని నాకు ఎటువంటి ఇచ్ఛలూ లేవు"

"ఆ తల్లి ఏమని చెప్పింది?"

"కుమద్ని రాజు చేయాలంటే నీలో ఏదో భయసందేహాలు. పోనీ నువ్వు అమితంగా ప్రేమించే సముద్రగుప్తుడ్ని రాజు చేద్దామంటే అతడిలో శక్తిసామర్థ్యాలు లేవు. పైగా ధర్మశాస్త్ర ప్రకారం జ్యేష్టుడే రాజ్యానికి వారసుడవుతాడు. రాజుగానీ ధర్మాన్ని నువ్వు ఆచరించాలని నీ సంకల్పం కూడాను.

అయితే నీకేంచేయాలో పాలుపోవటంలేదు. ప్రజల మన్ననను పొందుతూ సముద్రగుప్తుడే రాజయితే బాగుండుననీ నీ ఆశ. కానీ ప్రజల్లో సముద్రగుప్తుడంటే అభిప్రాయం. ఇందుకు పూర్తి భిన్నంగా ఉంది.

సముద్రుడు శృంగార కేళీ విలాసాలకు పనికొస్తాడుకాని రాజ్యమేలటానికి కాదని ప్రజాభిప్రాయం. ఇటీవలనే గూఢచారుల ద్వారా ఈ సమాచారం నీకు మరింత ధృవీకరించబడింది. మరింత క్రుంగిపోయావ్. అవునా!"

'అద్భుతం!' చంద్రగుప్తుడు కాపాలికుడ్ని మనసులో శ్లాఘించకుండా ఉండలేకపోయాడు. అంతేకాదు ఉన్నట్టుండి చంద్రగుప్తుడికి కాపాలికుడు అంటే ఎనలేని గురి ఏర్పడింది. అంతేకాదు, భద్రకాళి నిజమైన అనుగ్రహమున్నవాడని విశ్వాసం కూడా ఏర్పడింది.

"కాపాలికా చెప్పు! ఆ రోజున గర్భగుడిలో నువ్వు చేయబోయిన హెచ్చరిక వెనుక ఉన్న అంతరార్థం"

"నువ్వు చేద్దామనుకున్న నిర్ణయానికి ముహూర్తం సమీపించలేదు"

"అంటే..."

"నువ్వు ఇంకా రాజ్య భారాన్ని మోయాల్సివుంది"

"... ... ..."

"నీ సంకల్పం నెరవేరటానికి ఇంకా భూమిక ఏర్పడలేదు. పూవు కాయగా మారటానికి మరికొంత సమయం పడుతుంది" అన్నాడు.



## అక్కడా.. ఇక్కడా..

టాలీవుడ్ సరైన బ్రేక్ రాలేదన్న అసంతృప్తితో బాలీవుడ్ చెక్కేసిన తాప్సీకి మంచి అవకాశాలు వచ్చి అదృష్టం వరించింది.కాని మదిలోని కోరికమాత్రం తీరనే లేదంటున్నది. గ్లామర్ హీరోయిన్‌గా ఓ కమర్షియల్ హిట్‌కొట్టాలన్నది తాప్సీ కోరికట.

బాలీవుడ్‌లో 'పింక్'లాంటి కథలే వస్తున్నాయంటున్నది. ఇక, అక్కడ ప్రయత్నాలుచేసి ఫలితం లేదనుకున్నదేమో టాలీవుడ్‌పైకి మరోమారు దృష్టి మరలించింది.

దక్షిణాదిలో సక్సెస్ సంగతిపక్కన పెడితే, తనను గ్లామర్‌హీరోయిన్‌గా చూశారని, అందుకే మరోమారిక్కడ ట్రైచేస్తున్నానని చెప్పుకుంటున్నది. అక్కడ కాకుంటే ఇక్కడ, లేదంటే అక్కడ ఏంటో ఈమె గోల!



ప్రవాస భారతీయులే దేశానికి బలం, గర్వకారణం.

-సురేష్ ప్రభు, కేంద్రమంత్రి

"నీ మాటలు ఎలా విశ్వసించమం టావ్, కాపాలికా!" అన్నాడు.

"ఓహో.... భద్రకాళీ మాటల్ని విశ్వ సించవ్ కాబోలు"

రాజు తడబడ్డాడు ఈసారి... "అలా కాదు కాపాలికా! నన్ను నీ మాటలను గాఢంగా విశ్వసించేట్టుగా చేయమనే కోరుతున్నాను"

"కాని నేను ఏదో అద్భుతాలు చేసి నీ విశ్వాసాన్ని పొందదలచుకోలేదు చంద్రగుప్తా! నిజానికి కొన్ని మహిమలు చేసే శక్తిసామర్థ్యాలు నాకున్నాయ్!"

"కాపాలికా! ఇపుడది అవసరమని నిన్ను కోరుతున్నాను"

కాపాలికుడు చంద్రగుప్తుడి కళ్ళ లోకి చూశాడు. సామ్రాట్ కళ్ళలో మార్ద వంతో కూడిన వేడుకోలు.

"అలాగే సామ్రాట్!" కాపాలికుడు లేచి నుంచున్నాడు.

"వచ్చే అమావాస్య మిట్టమధ్యాహ్నం సమయానికి నువ్వు భద్రకాళి ఆల యానికి చేరుకో..." అన్నాడు.

"ఏమవుతుంది?"

"చూస్తావుగా!"

"ఒంటరిగా రావాలా కాపాలికా!"

"అక్కరలేదు. నీ పరివారసహితంగా రావచ్చు" అన్నాడు కాపాలికుడు.

సామ్రాట్ ఈసారి వినయంగా తల వంచాడు.

"సామ్రాట్! నీకు సమస్త శుభాలు జరగాలని ఆ జగన్మాతను వేడుకుంటు న్నాను. నీ సంకల్పంద్వారా ఈ భారత వనికి స్వర్ణయుగం రావాలని నా ఆకాంక్ష. అలాగే ఆ జగన్మాత ఆకాంక్ష కూడా ఇదేను. మరి సెలవ్ చంద్ర గుప్తా!" అన్నాడు కాపాలికుడు.

"ఎలా వెడతావ్ కాపాలికా!"

"వచ్చిన దోవనే వెళ్తాను"

"అంటే.."

"చంద్రగుప్తా! ఉత్తరాభిముఖంగా నుంచొని నువ్వు కొద్ది క్షణాలు కళ్ళు మూసుకో!" అన్నాడు కాపాలికుడు.

చంద్రగుప్తుడు ప్రశ్నించకుండా కాపాలికుడ్ని శిరసా వహించాడు.

కొన్ని క్షణాలు అయ్యాక ఎటువంటి అలికిడి లేకపోతే చంద్రగుప్తుడు కళ్ళు తెరిచి నలువైపులా చూశాడు.

కాపాలికుడు లేడు!

చంద్రగుప్తుడిలో మరోసారి సంభ్ర మాశ్చర్యాలు. ఎంత వెతికినా కాపాలి కుడి జాడ అంతుపట్టలేదు.

అన్నింటికీ మించి సామ్రాట్‌ను ఆశ్చర్యపరిచిన కాపాలికుడి మాటలు- "నాకు ఎటువంటి అదృశ్య శక్తీ లేదు. ఎటువంటి మాయలూ చేయలేను"

మరి కాపాలికుడు ఎలా అదృశ్య మయ్యాడు??

సముద్రగుప్తుడు అలా ఒంటరిగా

**లాభంలేకుండా ఎవరూ ఏ పనీ చెయ్యరు... కాని మన దేశ రైతులుమాత్రం స్వహితం పక్కనపెట్టి సేద్యం చేస్తున్నారు.**

**-రాజ్‌నాథ్‌సింగ్, కేంద్రమంత్రి**



రాజప్రాసాదంలో ఎంతసేపు కూర్చు న్నాడో అతడికే తెలియదు.

అప్పటికి మాతామహి మహాదేవి రెండుమూడుసార్లు వచ్చి సముద్ర గుప్తుడ్ని వాత్సల్యంగా మందలించింది. "సముద్రా! ఇక వెళ్ళి శయనించు. ఇప్ప టికే చాలా పొద్దుపోయింది"

సముద్రగుప్తుడు ఆమె మాటని విననట్టుగా ఊరుకున్నాడు. మహాదేవి నిస్సహాయంగా నిట్టూర్చి తన మందిరానికి వెళ్ళిపోయింది.

దూరంగా ఆ ఆసనంమీద కూర్చొని గవాక్షంనుండి బైటకు దృక్కులుసారిం చాడు. ఆకాశంలో నిండు పూర్ణిమ చంద్రుడు మిలమిలా మెరుస్తున్నాడు... అతడి చుట్టూతా తారకలు.

ఈ సమయంలో తన తారకలతో యువరాజు వసంతోత్సవ వేడుకలు జరగవలసివుంది. కానీ ఈ వృద్ధుడి మరణంతో అన్నీ తారుమారయ్యాయి. సముద్రగుప్తుడిలో కలగాపులగంగా ఆలోచనలు.

వృద్ధుడు బతికివున్నపుడు అతడి మాటలను తను ఖాతరు చేయలేదు. కాని ఇప్పుడుమాత్రం పదే పదే గుర్తుకు వస్తున్నాయ్!

'తన పూర్వజన్మ తెలుసట. అతడి రాబోయే జన్మకు, తనకూ ఏదో అవినా భావసంబంధమున్నదట'

ఎందుకనో తెలియదుకాని సముద్ర గుప్తుడి ఆలోచనల్లో 'నిన్న, 'రేపు'అన్నవి మచ్చుకు కూడా కన్పడవ్.

జీవిత మకరందాన్ని గ్రోలేందుకు అతడికి రోజుకు ఎన్ని ఘడియలయినా సరిపోవటంలేదు. ఇక నిన్న, రేపులగురిం చిన 'చింతన'కు సమయం ఎక్కడ వుంది? సముద్రగుప్తుడికి రాజ్యం, రాజ్యాంగం,రాజ్యపాలనలు అనేవి తల నొప్పి కలిగించే విషయాలు.

ఈ బరువు బాధ్యతలు దురదృష్ట వంతులనే వరిస్తాయని అతడి నమ్మిక. సోదరుడు కచగుప్తుడికి రాజ్యమూ, రాజ్యవిస్తరణ అంటే ఎంతో మక్కువ. ఆ బరువు బాధ్యతల్ని అతడే మోసు

కొని అందులో ఆనందం ఏదో అతడే పొంది ఈ 'ఆనంద సామ్రాజ్యాన్ని' తనకు వదిలేస్తే చాలు.

రాజ్యాలూ, రక్తపాతాలు, ఆ ముళ్ళ కిరీటంనుంచి తను దూరంగా జీవిస్తే చాలు- ఇదీ సముద్రగుప్తుడి అంత రంగం. అయితే విధాత ఎంత విచిత్ర మైనవాడు. వద్దన్నవాడి వెంటపడటం, కావాలనుకునేవాడిని విసిరివేయటం ఆ విధాతకు యుగయుగాలుగా నడు స్తోన్న ఆనవాయితీ.

బహుశా 'నిరాసక్తుడ్ని' ఆసక్తుడిగాను, 'ఆసక్తుడిని' నిరాసక్తుడిగా మార్చాలని ప్రయత్నించటం అతని చిత్రవైచిత్ర సృష్టి లీలాంతర్భాగం కాబోలు'

రాకుమారుడు సముద్రగుప్తుడు కూడా యుక్తవయస్సు వచ్చేవరకూ గురుకులంలో ఉన్నాడు. అనేకశాస్త్రాలు అభ్యసించాడు. ఎన్ని విద్యలు అయినా నేర్చాడు కాని, ఖడ్గ విద్య అంటే అత డికి ఏవగింపు ఉండేది. ఒకరోజు ఒక చిన్న సంఘటన జరిగింది.

ఖడ్గ విద్యను నేర్చుకుంటున్న మొట్ట మొదటి రోజునే తనలోని ఏమరు పాటుకు అశ్రద్ధకు తన గురువు పొరం గుడి మోచేతికి గాయాలై రక్తం చిమ్మ మని ఎగసింది.

తను పుట్టినతర్వాత అంతటి రక్త ధారను యువరాజు చూడనే లేదు. ఒళ్ళంతా తడిసిపోయిన రక్తసిక్త వస్త్రా లతో అగ్నిపుష్పంలా కనపడిన ఆ ఖడ్గ విద్యా విశారదుడిని, తన గురువును చూసి రాకుమారుడి నవనీత హృదయం విలవిలలాడిపోయింది.

పైగా గురువు మాటలు 'భళా, రాకుమారా! ఇది నిజమయిన శుభ సూచకం. ఈ ఖడ్గానికి శత్రువుల రక్తం ఏరులుగా పారాలి. నీ కీర్తి అజరామర మవ్వాలి"

సముద్రగుప్తుడిలో ఆ మాటలకు ఏవగింపు వచ్చింది.



## కండిషన్స్ అప్లై

ఓ స్థాయికి చేరిపోయాక నయన తారసినిమాల ఎంపికరేంజ్ఆసాంతం మారిపోయింది.సన్నివేశాల్లోకాని, పారి తోషికం విషయంలోకాని ఏమాత్రం రాజీపడినట్లు కనపడడంలేదు. ఎంత ఏరికోరి ఎంచుకున్నా తీరిక లేనంత బిజీ. తమిళంలోమహిళా ప్రాధాన్యం గల చిత్రాలకే ఓటేస్తున్నది.

తెలుగులో సీనియర్ హీరోలతో కలిసి అయితే ఓ.కె. అదికూడా కోరి నంత పారితోషికం సమర్పిస్తేనే. అంతటితో రాజీపడుతుందా-అంటే అస్సలు లేనేలేదు. ఏ సన్నివేశంపడితే అది ఎలా పడితే అలా చెయ్యనే చెయ్యనంటోందట.

ఇక ప్రమోషన్‌ల జోలికైతే అస్సలే వెళ్ళడంలేదు. డిమాండ్ ఉన్నప్పుడు, లక్కీ లెగ్ ఇమేజ్ ఉన్నప్పుడు ఏం చేసినా చెల్లుతుంది కదూ!

"రక్తం ఏరులై పారాలట. తన కీర్తి దిగంతాలకు వ్యాపించాలిట! ఇదేనా రాచరికం. ఇదేనా రాజధర్మం" తన భావసంచలనాన్ని వెనక్కి నెట్టివేసి గురువుతో "క్షమించాలి గురుదేవా! మిమ్మల్ని గాయపరిచాను. మీకు ఎంతో బాధని కలిగించాను" అన్నాడు.

గురువు అంత బాధలో కూడా నవ్వుతూ "రాకుమారా! నీవు రాచబిడ్డవు. భావి సామ్రాజ్యాన్ని భుజస్కంధాలపై మోయవలసిన గురుతర బాధ్యత, నిర్దాక్షిణ్యంగా శత్రువులను తుదముట్టించి వారి రక్తంలో స్నానం చేయవలసినవాడవు నీవు. భయము, బాధలు సామాన్యుడు మాట్లాడుకునే మాటలు, ఈ రెండింటినీ అధిగమించటమే ఏ రాచబిడ్డకైనా కర్తవ్యం"

ఎంత సమాధానపరచుకుందామన్నా, సముద్రగుప్తుడి మనసు అతడికి ఎదురు తిరిగింది. పర్యవసానం మరో రెండు సంవత్సరాలవరకు రాకుమారుడు ఖడ్గాన్ని తాకనైనా తాకలేదు.

సమాచారం చేరిన చంద్రగుప్తుడిలో తీరని విచారం ఆవరించుకుంది.

'తన కొడుకేంటి... ఖడ్గాన్ని ఏవగించుకోవడమేమిటి?' చంద్రగుప్తుడికి చిన్నకొడుకు సముద్రగుప్తుడు అంటే వల్లమాలిన ప్రేమ. చంద్రగుప్తుడికే కాదు, నిత్య సౌందర్య తేజో సంశోభితుడై, మెత్తని మనసుగల సముద్రగుప్తుడంటే సమస్త రాజపరివారానికీ వల్లమాలిన ప్రేమాభిమానాలు.

అంతేకాదు, సముద్రగుప్తుడిలోని విశ్లేషణ, పాండితీ ప్రకర్ష, అతి చిన్న వయస్సులోనే అతడు ఆకళింపు చేసుకున్న అద్భుత విషయాలు. జీవితాన్ని పరిశీలించే తీరు, సౌందర్యారాధన అన్నిటికీమించి అతడిలోని దయార్ద్ర హృదయాన్ని ఎవరు ఆరాధించకుండా ఉండగలరు? కానీ చంద్రగుప్తుడి ఆలోచనాధోరణి మరోలా ఉండేది.

# చిలిపి

'అప్పిచ్చువాడు వైద్యుడు' అయితే చిప్పిచ్చువాడు?
అల్లుడు.

హాల్లో స్వాతి! మాదైనది నీదికానిది ఏది?
ఈ శీర్షిక మీదే.

నువ్వెప్పుడైనా అలిగేవా? కుమారి?
నాకింకా పెళ్ళికాలేదుగా!

శుభలేఖలు దేనికి?
అవి చూపించి 'మ్యారేజ్ అడ్వాన్స్‌లు సంపాదించటానికి!

కొన్ను కష్టమైతే?
ఆర్టీసీ బస్సెక్కిస్తే సరి.

ఎదురింటి అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే?
రవాణా ఖర్చులుండవు.

హోటల్ సర్వర్‌ని అడగకపోయినా సప్లయి చేసేది ఏది?
బిల్లు.

మన జీవితం?
ఓ కాగితం.

'సముద్రగుప్తుడు సాత్వికుడు. కాని రాచరికానికి, రాజ్యాంగ నిర్వహణకు, దండనీతిని ఆచరించేందుకు కావాల్సింది రజస్సు. రజోగుణ ప్రధానుడైన క్షత్రియుడే రాజ్యాన్ని ఏలటానికి అర్హత ఉన్నవాడు. రాజవంశంలో ఇలాంటి సాత్వికుడెలా ఆవిర్భవించాడు?"

మొట్టమొదటిసారిగా చంద్రగుప్తుడు జ్యోతిష్యాన్ని ఆశ్రయించాడు. ఉద్దండ జ్యోతిషపండితులు అందరూ కూర్చొని ఆ లెక్కలు, ఈ లెక్కలు వేసి చివరకు తేల్చిన విషయం -

సముద్రగుప్తుడు మహావీరుడు, శూరుడు... అరివీరభయంకరుడు... శత్రువులకు సింహస్వప్నమవుతాడని, గుప్తవంశంలో ఆచంద్రార్కమూ నిలచిపోయే యశస్సును ఆర్జిస్తాడని, రాజ్యాన్ని బహుముఖంగా విస్తరిస్తాడు అని ఏకకంఠంతో ఘోషించారు.

చంద్రగుప్తుడికి ఆ జ్యోతిష్కులందరి తలలు తీయిద్దామని ఒక క్షణంలో విచిత్రమైన కోరిక కల్గింది. కానీ అందరికీ తలా ఒక కొరడా దెబ్బకొట్టించి బయటకు గెంటించాడు.

ఆ రోజునుంచి ఈ రోజువరకు ఏ జ్యోతిష్కుడూ చంద్రగుప్తుడికి ఎదురుబడ్డ సాహసమూ చేయలేదు. ఒకవేళ ఎదురుబడ్డా తను జ్యోతిష పండితుడివని, తనకు జ్యోతిషం తెలుసునని పొరపాటున కూడా చెప్పుకోలేదు.

నిజానికి చంద్రగుప్తుడికి పుండు మీద కారం రాసినట్టు అయింది. ఒక పక్కన రాకుమారుడిలో విచిత్ర సాత్విక ప్రవృత్తికి తను కృంగిపోతుంటే, మరొకపక్క అందుకు విరుద్ధంగా ఈ జ్యోతిష్కుల ఘోష. అయితే అందులో ఒక వృద్ధ జ్యోతిషపండితుడ్ని మాత్రం సామ్రాట్ కొరడా దెబ్బకు దయతలచి మినహాయించాడు.

అయితే ఆ వృద్ధుడు సాహసం చేసి "రాజా! నీకు అధికార బలం ఉంది కదా అని మా పండితుడిని నిష్కారణంగా దండించావ్! దీనికి ఒకానొక రోజున నువ్వు తీవ్ర పశ్చాత్తాపం పడే రోజు వస్తుంది!" అన్నాడు.

సామ్రాట్ కోపంగా చూసి "జ్యోతిష శాస్త్రం ఇంతటి నిస్సారమయిందని ఈనాడే తెలుసుకున్నాను. మనిషిలోని స్వతసిద్ధమయిన సహజ ప్రవృత్తులకు విరుద్ధంగా ఏదీ జరగదు. యువరాజు సాత్వికుడు. అతడి ప్రవృత్తిలో యుద్ధ కాంక్షలు కాదుగదా, కనీసం ఖడ్గాన్ని ధరించడమంటే విరక్తి ఉన్నవాడు"

మళ్ళీ ఆ వృద్ధ జ్యోతిష్యుడు "కానీ ఇంతమంది ఏకకంఠంతో ముక్తకంఠంతో ఘోషించిన విషయం పొల్లుపోతుందా రాజా!" అన్నాడు.

ఈసారి సామ్రాట్ ఒక్కక్షణం నింపాదిగా ఆలోచించి ఆ తర్వాత తల విదిల్చాడు. "మీరన్న మాటలెపుడో పొల్లుపోవటం కాదు. ఈ క్షణం, అసత్యమయింది. ఎక్కువ మాట్లాడకుండా మీరు నిష్క్రమించవచ్చు!"

'బ్రతుకు జీవుడా!' అని వాళ్ళందరూ పారిపోయారు. ఆ రోజు నుంచి రాజుకు జ్యోతిష్యమన్నా, జ్యోతిష్కులన్నా ఒక రకమైన ఏవగింపు.

ఈ విషయం సముద్రగుప్తుడి చెవులకు చేరింది. ముందు మనసులో బాధపడ్డాడు. తండ్రికి తనమీద ఆశలు తెలుసు. అలాగే అవి అడియాసలని కూడా తెలుసు. కారణం తన మనసులో రాజ్యకాంక్ష శూన్యం.

తను ఈ దేశాన్ని పరిపాలించాలని ఏనాడూ కోరుకోవటంలేదు. కానీ జ్యోతిష్కుల్ని తండ్రి దండించిన తీరుకు ఎంతో బాధపడ్డాడు. వాళ్ళందర్నీ తిరిగి తన ప్రాసాదానికి ఆహ్వానించాడు.

ఆ జ్యోతిష్యులందరూ గజగజమని వణుకుతూ మళ్ళీ ఏమి ముప్పుముంచుకొస్తోందోనని పులిబోనులోకి వెళ్ళే మేకపిల్లలులాగా రాకుమారుడి ముందు హాజరయ్యారు. వాళ్ళందర్నీ సాదరంగా ఆహ్వానించి, దయగా మాట్లాడి వాళ్ళ భయాన్ని పోగొట్టితనవల్ల వారికెటువంటి కీడూ వాటిల్లదని భరోసా కల్గించాడు.

తేరుకున్న జ్యోతిష్యులు రాకుమారుడికి సశాస్త్రీయంగా వివరించారు-

"తాము చెప్పిన భవిష్యత్ వాణి అబద్ధం అయితే తలలు తీయించుకోవడానికి సిద్ధమని అన్నారు"

అందరికీ బంగారు నాణాలు, చీని, చీనాంబరాలు బహూకరించి సగౌరవంగా సాగనంపారు.

తండ్రి చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేశాడు రాకుమారుడు.

అందరూ వెళ్ళిపోయాక ఆ వృద్ధుడు మాత్రం ఉండిపోయాడు, రాకుమారుడి కోరికమీద. **ఇంకా ఉంది**



హిందూత్వ గురించి యోగి ఆదిత్యనాథ్ నుండి పాఠాలు నేర్చుకోవాల్సిన అవసరం కాంగ్రెస్‌కి లేదు.
-సిద్ధరామయ్య, కర్ణాటక సి.ఎమ్

## పర్సనల్ ఎజెండా

తొలి చిత్రం 'దబాంగ్'నుంచి ప్రస్తుత 'నూర్' దాకా సోనాక్షిసిన్హా కెరీర్ పయనం గురించి ప్రత్యేకంగా ప్రస్తావించుకోనవసరం లేదు. తనగురించి తనే సో లక్కీ, హ్యాపీ గోయింగ్ అంటూ తరచూ చెప్పుకుంటుంది. తన వ్యక్తిగత అభిప్రాయాల్లోకి వెళ్తే...

► **ప్రస్తుత తరం అమ్మాయిలు :** ఇరవైలలో ఉండే యువతి జీవితంలో అన్నీ కావాలని కోరుకుంటుంది. గొప్ప కెరీర్, మంచి ప్రేమ జీవితం, చక్కని పని- వ్యక్తిగత సమతౌల్యం, అందమైన ఆకృతి- అన్నీ ఆమెకు కావాలి

► **అత్యంత ఛాలెంజింగ్ పాత్ర చేయాల్సి వస్తే:** నా పాత్రకు సంబంధించి అతని బుర్రలో ఎటువంటి దృష్టి ఉందో అర్థంచేసుకోవడంకోసం ముందుగా దర్శకుడితో మాట్లాడతాను.

ఇప్పటిదాకా నేను చేసిన సినిమాలు అన్నింటి విషయంలో అలాగే చేశాను

► **నా దృష్టిలో దర్శకులు :** పూర్తి దార్శనీయతగల వారు. ఓ సినిమా ఎలా తీయాలన్న విషయంలో వారికో మార్గం ఉంటుంది.

కాబట్టి వారి కోణంనుంచే పాత్రను బాగా అర్థం చేసుకుంటాను. ఆపైన నా సామర్థ్యంమేరకు ఉత్తమంగా నటించే ప్రయత్నం చేస్తాను

► **సినిమాల్లో నచ్చే రకాలు :** రొమాంటిక్, కామెడీలు, యాక్షన్ చిత్రాలు.ఇవి రెండూ నా ఫేవరెట్స్

► **నా దృష్టిలో స్టార్, యాక్టర్ కాంబినేషన్ :** అమీర్ ఖాన్, దీపకా పదుకొనె

► **పరిశ్రమలో నాకు బాగా నచ్చేది :** ఒక్కరోజు కూడా డల్ డే లేకపోవడం

► **నచ్చని విషయం :** పరిశ్రమలో కొంచెం కూడా ప్రైవసీ లేకపోవడం నాకు అస్సలు నచ్చదు

► **నన్ను నేను నిర్వచించుకోవాలంటే :** ఓ నటిగా నన్ను నేను మలుచుకోగల వ్యక్తిని.

ఓ గాయనిగా మోజుపడే తత్వం. ఫ్యాషనిస్తాగా అసంకల్పితం. సాధారణ అమ్మాయిగా పక్కింటి అమ్మాయి తత్వం.మొత్తంమీద లక్కీ,హ్యాపీ గాళ్ని

► **గాయనిగా, నటిగా :** ఏది ఎంపికచేసుకోవాలని నేను ప్రశ్నించుకోను.

రెండూ ఎందుకు చెయ్యకూడదు? పాట పాడాల్సి వుంటే, పాత్ర చేస్తూనే సాగించవచ్చు కదా

► **నా దృష్టిలో పరిశ్రమలో సెక్సీయెస్ట్ :** హీరో అయితే హృతిక్ రోషన్. సెక్సియెస్ట్ హీరోయిన్ అయితే దీపికాపదుకొనె

Courtesy : STARDUST

# నేనెవరో తెలుసా!

మనసుకు నచ్చిన విద్యను అభ్యసించే అవకాశం వుండేది ఒకనాడు మన దేశంలో.

ఆ తర్వాత కాలంలో బ్రిటీష్‌వారు ప్రవేశపెట్టిన విద్య వచ్చింది.ఫలానా గ్రూప్ మాత్రమే చదవాలన్న నిబంధనలు వచ్చాయి.

ఉద్యోగంకోసం చదువుగా తయారైంది. తల్లిదండ్రులు నిర్దేశించిన చదువులు చదవాల్సి వచ్చింది. సంపాదన లక్ష్యంతో చదివే చదువులు మనసును అంతగా వికసింపచెయ్యటంలేదు. ఇది నేడు మనం చూస్తున్న విద్యా విధానం.

తల్లిదండ్రులు పెంచుతున్న ఒత్తిడి. ఇది వందేళ్ళ క్రితమే మొదలైంది. పుస్తకాలలో వున్నది కాకుండా మరేదో కళమీద ఆసక్తి కలిగివుండటం తప్పుగా తల్లిదండ్రులు భావించేవారు. ఫలితంగా వారిలోని కళ అదిమిపెట్టబడేది. ఇటువంటి అనుభవమే ఒక మహాచిత్రకారుడికి కలిగింది.

చిన్నతనంనుండి అతనికి రంగులంటే ఇష్టం. రకరకాల బొమ్మలు తయారుచేయటం అంటే ఇష్టం. బెంగాల్‌లో పెద్ద పండుగ దసరా. ఆ పండుగకు పందిర్లు వేసి అందంగా అలంకరించి అమ్మవారి పూజలు చేస్తారు. బాల్యంలో ఆ పందిరికి అలంకరణ చెయ్యటం ఇష్టపడేవాడు.

చిన్నకుర్రవాడైనా అతగాడు చేస్తున్న పందిరి అలంకరణ అద్భుతంగా వుందని చూసినవారంతా మెచ్చుకునేవారు. 'మీ అబ్బాయి మంచి కళాకారుడవుతాడండీ' అని నలుగురు మెచ్చుకుంటుంటే ఆ కుర్రాడు ఆనందపడేవాడు. కాని తల్లిదండ్రులు మాత్రం ఈ రంగులద్దుకోవటం ఏమిటి మన ఇంటావంటా లేని పని అని విసుక్కునేవారు.

మరి తండ్రి నాటి దర్భంగా ఎస్టేట్ ఆఫీసరాయె. తల్లికి బొమ్మలు చెయ్యటంలో నేర్పు వున్నా అది అబ్బాయిల కళ కాదన్నది ఆమె నమ్మకం.

అందువల్ల ఆ కుర్రాడిని బాగుపరచాలంటే ఇంటికి దూరంగా పంపి చదివించాలనుకుని అతని 15వ ఏట కలకత్తా పంపించారు.

బలవంతంగా ప్రెసిడెన్సీ కాలేజీలో బి.కామ్‌లో చేర్చారు. అస్సలు ఇష్టంలేని చదువు. మనసు చిత్రకళ మీద వుంటే కామర్స్‌లో లాభనష్టాల లెక్కలు ఎక్కడ ఎక్కుతాయి. అందుకే పరీక్షలు పాసవలేకపోయాడు. ఎన్నిసార్లు పరీక్ష తప్పాడో లెక్కలేదు. చివరికి వీడిని బాగుచెయ్యటం మా తరం కాదు అని తల్లిదండ్రులు చేతులు ఎత్తేశారు.

'నేను బాగుపడి మీకు మంచి పేరు తెస్తా. నన్ను చిత్రకళ కోర్స్‌లో చేర్చండి' అని బతిమలాడుకున్నాడు. చివరికి ఒప్పుకుని కలకత్తా స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో చేర్చారు. జాతి మెచ్చిన చిత్రకారుడయ్యాడు.

ఇండియన్ స్టైల్ ఆఫ్ పెయింటింగ్‌కి గుర్తింపు తెచ్చాడు. 'మనం చిత్రకళగురించి మరెవరి దగ్గరో నేర్చుకోవటం ఏమిటి! మన దగ్గర ఘనమైన చిత్రకళా వారసత్వం వుండగా' అంటూ అజంతా గుహల్లోని కుడ్య చిత్రాలను చూపించేవారు.వాటినుండే ఆయన స్ఫూర్తి పొందాడు.

ఆ భారతీయ చిత్రకళను పునరుద్ధరించేందుకు అంతర్జాతీయ స్థాయి కళాకారులందరినీ కూడగట్టాడు. వారందరిచేతా ఆ కుడ్య చిత్రకళకున్న విలువను గుర్తింపచేయగలిగాడు. తనకంటూ ఒక గుర్తింపు పొందటమేకాక ఆ భారతీయ చిత్రకళలో శిష్యులను తీర్చిదిద్దాడు ఆయన.

దేశంలోని నలుమూలలనుండి ఆయన దగ్గరికి చిత్రకళను అభ్యసించేందుకు విద్యార్థులు వెళ్ళేవారు. అలా వెళ్ళిన చిత్రకారులలో తెలుగు వాడైన కొండపల్లి శేషగిరిరావు వున్నారు.

ఆ గురువుగారి స్ఫూర్తితోనే ఆంధ్రులకు తెలుగు తల్లి బొమ్మను గీసి, సగర్వంగా సమర్పించారు. నేటికీ మనమంతా 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అంటూ తెలుగు తల్లి ముందు నిలబడి పాడుకుంటున్నామంటే అది ఆ గురు పరంపరలో వచ్చిన చిత్రకళను చూసి గర్విస్తూనే.

కలకత్తాలో రవీంద్రనాథ్ ఠాగూర్ స్థాపించిన శాంతినికేతన్ అన్ని రకాల కళలను నేర్పు గురుకులం వంటిది. అక్కడ చిత్రకళా విభాగం కళాభవన్. ఆ కళాభవన్‌కి ప్రిన్సిపాల్ అయ్యాడు.

ఆయన గీసిన చిత్రాలలో అధిక భాగం భారతీయ ఇతిహాసాలు, అజంతా శిల్పాలనుండి స్ఫూర్తి పొందినవే. గ్రామీణ జీవితం, మహిళలు ప్రధాన అంశాలుగా చిత్రాలు గీసేవారు.

నవీన యుగపు అత్యంత విలువైన చిత్రాలుగా భారతీయ సాంస్కృతిక మంత్రిత్వ శాఖ భద్రపరిచింది. అవి జాతి సంపదగా ప్రకటించారు.

ఆయన కళాకారుడిగా వికసించింది రవీంద్రనాథ్ ఠాగూర్ నీడలో.ఆయన కళాకారుడిగా ఎదుగుతున్న సమయం స్వాతంత్ర్య ఉద్యమ సమయం.

మహాత్మాగాంధీ ఉప్పు సత్యాగ్రహం దేశాన్ని కదిలించింది. చేత కర్రపట్టి గాంధీజీ ముందు నడుస్తుండగా ఆయన వెనక మిగిలినవారు నడుస్తున్న చిత్రాన్ని నల్లరంగు రూపంలో నాడు ఈయన గీశాడు. అదే ఆ తర్వాత ఉద్యమచిహ్నమైంది.

పలుచోట్ల దానికి శిల్పరూపం ఇచ్చారు. నేటికీ మద్రాసు మెరీనా బీచ్‌లో ఆ శిల్పాన్ని చూడవచ్చు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. సొంతంగా రాజ్యాంగం రాసుకుని గణతంత్రరాజ్యంగా అవతరించింది. ఆ రాజ్యాంగం ప్రతిలో వున్న అక్షరాల గురించే మనందరికీ తెలుసు.

కాని వాస్తవంలో అక్షరాలతోపాటు పలుచిత్రాలు అందులో భాగంగా వున్నాయి. ప్రతి పేజీకి అంచులను అందంగా తీర్చిదిద్దారు. ఆ అంచుల్లో భారతీయతను, భారతీయుల ఆత్మను ఆవిష్కరించారు.

భారతీయులు పూజించే జంతువైన గోమాతను, భారతీయులు ఆరాధించే శ్రీరామచంద్రుని అందులో చిత్రీకరించారు. అవన్నీ చిత్రీకరించింది ఈ కళాకారుడే. అలాంటి చిత్తరువులతో కూడిన రాజ్యాంగ ప్రతిని ఆయనచేత తయారుచేయించింది జవహర్‌లాల్ నెహ్రూ. ఆ విధంగా రాజ్యాంగ రచనలో ఈ మహా కళాకారుడి కుంచె వుంది.

గణతంత్ర రాజ్యంలో పౌరులను సత్కరించేందుకు 'పద్మశ్రీ' మొదలుకుని 'భారతరత్న' వరకు అవార్డులు ఇవ్వాలని నెహ్రూ ప్రభుత్వం నిర్ణయించింది.

అందుకు అవసరమైన అవార్డ్ నమూనాని చిత్రీకరించే బాధ్యతను ఈ కళాకారుడికే అప్పగించారు. ఆయన రూపొందించిన అవార్డులో తొలి పద్మవిభూషణ్‌ని ఆయనే అందుకోవటం ఒక విచిత్రం.

ఆయన అందుకున్న అవార్డులకు లెక్కలేదు. ఎన్నెన్నో విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేట్‌లను అందించాయి.

విశ్వభారతివారు దేశికోత్తమ అవార్డును అందించారు. ఆయన జీవితం ఠాగూర్ కుటుంబంతో ముడిపడింది. రవీంద్రనాథ్ ఠాగూర్ సోదరుడు చిత్రకళలో ఆయనకు గురువు.

వారి అండతోనే ఆయన చిత్రకారుడిగా ఎదిగి భారతదేశ చిత్రకళకు వైభవం తెచ్చాడు. 80 ఏళ్ళ వయసులో కూడా చిత్రకళకు అంకితమై గడిపి ఎందరో శిష్యులను తయారుచేసి దేశ విదేశాలకు పంపగలిగిన ధన్యజీవి ఆయన.ఇంతకీ...

*1. ఎవరు ఆ చిత్రకారుడు?*

*2. ఆయన గురువు పేరేమిటి?*

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 3 ఫిబ్రవరి 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా ఎంపికచేసి ₹500/- నగదు బహుమతిని అందజేస్తాం.

19.1.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :

1. సుశీలా నయ్యర్
2. ప్యారేలాల్ నయ్యర్.

విజేత : జె.జయశ్రీ
డోర్ నెం. 5-1-613, ట్రూప్ బజార్
హైదరాబాద్ 500 095.

# Singapore

In Singapore, you can find people of many races living together peacefully.










## Chingay Parade

Would you like to watch the Chingay Parade?It is held to celebrate the 15th day of the Chinese New Year. Performers sing and dance through the streets.

## samsui women

In the past, samsui women carried heavy bricks and helped to build many of Singapore's buildings.





## Changi Airport

Have you seen the Vanda Miss Joaquim? It is not a person, it's the national flower! You can find it in the orchid garden at the Changi Airport.



## trishaw

There were many trishaw riders,too.Riding in a trishaw is fun, but pedalling is hard work!



## Sang Nila Utama

People say that Sang Nila Utama set foot in Singapore 800 years ago. He saw a lion, so he called this place "Singa Pura", which means "Lion City".

## Merlion



## Esplanade Theatres

Today, if you take a bumboat down the Singapore River, you will see the Esplanade Theatres. People watch theatre shows and concerts there. Do you see the Merlion? It has a lion's head and a fish's tail!





## Singapore River

## bumboat

# మన లైఫ్ మన ఇష్టం

జీవితం అంటే ఏ మార్పూ లేకుండా స్థిరంగా, ఎప్పుడూ ఒకేమాదిరి సాగదు. అది వాంఛనీయం కాదుకూడా. మార్పులేని జీవితం చప్పగా, నిస్సారంగా ఉంటుంది. అయితే జీవితం మనం కోరుకున్నట్లే అన్నిసార్లూ ఉండదు.

కొన్నిసార్లువాంఛనీయంకాని అంశాలు జరిగిపోతుంటాయి. మన నియంత్రణలో లేని విషయాలను యధాతథంగా ఆమోదించగల అంగీకార ధోరణిని అలవరచుకోవడమన్నది జీవితంలోని సవాళ్ళలో అతి పెద్దది.

వ్యక్తిగత నియంత్రణలోలేని విషయాలను ఆమోదించగలగడానికి, చర్యలను చేపట్టడానికి అనువైన ధోరణి ఉన్నప్పుడు జీవితానికి చక్కని పోషణ, పరిపూర్ణత లభించినట్టే.

క్లిష్టత అనేది మానవజీవితంలో భాగం. అయితే దానితాలూకు నొప్పిని ఎదుర్కోగలగడం మన ఛాయిస్ అనేది నిపుణుల అభిప్రాయం కూడా.

ఆమోదయోగ్యకర, అంగీకారధోరణి బాధలనుంచి, నొప్పులనుంచి ఉపశమనాన్ని కలిగిస్తుంది. ఇందుకోసం ఎవరికి వారు తగిన థెరపీని ఇచ్చుకోవడాన్ని అభ్యసించాలి. దీనిలో ప్రవర్తనా సంబంధిత థెరపీ భాగం అయివుంటుంది.

ఇతరులను మార్చడానికో లేదా జడ్జిమెంట్లు ఇవ్వకుండా ఆలోచనలు,భావాలను ఏవిధంగా ఆమోదించాలో, ఇతరులను ఎలా గుర్తించాలో ఈ థెరపీలో అభ్యాసం చేయాలి. ఇలా చేయడంవల్ల సంక్షేమంపై ప్రతికూలలఆలోచనలు,భావాలప్రభావంతగ్గుతుంది.

ఇటువంటి ఫ్లెక్సిబుల్‌గా వుండే ధోరణి వ్యక్తిగత విలువల ఆధారంగా లక్ష్యాలు సాధించడానికిమార్గాన్ని సుగమం చేస్తుంది. అసౌకర్యపూరితమయిన భావాల నుంచి బయటపడాలి. ఉదాహరణకు జరగబోయే సామాజిక కార్యక్రమం గురించి ఆందోళన, ఆతృత ఉన్నాయనుకుందాం.

## హెల్దీ థెరపీ

ఇటువంటి అనవసర అసౌకర్య భావోద్రేకాలను తగ్గించుకోవడానికి సాధన చేయాలి. అసౌకర్యం ఎక్కడ, ఎందుకు తలెత్తిందో అర్థం అయితే, సగం విజయం సాధించినట్లే. సమస్యను గుర్తించినప్పుడు పరిష్కారాన్ని ఎదుర్కోవడం సులువవుతుంది.

దీనినే 'యాక్సెప్టెన్స్, కమిట్‌మెంట్ థెరపీ' అని చెప్పుకోవాలి. అసౌకర్యాన్ని గుర్తించినప్పుడు దాన్ని తొలగించుకునే చర్య అసంకల్పితంగా ఆరంభం అవుతుంది. ఈ థెరపీ ప్రక్రియ విషయాన్ని ఆమోదించడంతో మొదలై, వ్యక్తిగత విలువల ఆధారంగా అనుకూల జీవిత అలవాట్లను నిర్మించుకునే దిశగా సాగుతుంది.

అంటే, అనుకూల దృక్పథాన్ని అలవరచుకోవడం మాత్రమేకాదు, జరిగిన నష్టాన్నుంచి మనస్సు మళ్ళించుకుని, ముందుకు కదలడమనేది ఈ ప్రక్రియలో కీలకం. నష్టాన్ని నిర్లక్ష్యంచేసినా, కలిగిన బాధ శరీరంలో, మనస్సులో ఉండిపోతుంది.

మనస్సులోని భావాలను నిజాయితీగా వ్యక్తీకరించగలగడం ఎంత ముఖ్యమో, ఫాల్స్ పాజిటివ్‌నెస్‌వల్ల ఉపయోగం లేకపోవడమూ అంతే. అది అవమానకరంగా దారితీయగలదు.

జీవితం సవాళ్ళతో నిండిపోయివుంటుంది. అది ఏ అనారోగ్యం అయినా కావచ్చు. లేదా వయస్సు రీత్యా వచ్చే మార్పులు కావచ్చు. శరీరం అంతకు ముందుమాదిరి, అంతే శక్తిసామర్థ్యాలతో ఉండదు. ఈ విషయాలను ఆమోదించలేక, సర్దుకుపోలేక సతమతం అవుతుంటే జీవితంలో సమృద్ధి ప్రభావితం అవుతుంది. పరిష్కారత లోపిస్తుంది.

కాబట్టి ఎదురయ్యే సవాళ్ళను అంగీకరించగల ధోరణి అనివార్యం. జరిగిన, జరుగుతున్న నష్టాన్నీ, మనస్సుకు నచ్చని విషయాలనో ఆమోదించడంవల్ల వ్యక్తిగత విలువల ఆధారంగా ఛాయిస్‌లు తీసుకునే అవకాశాలకూ ద్వారాలు తెరిచినవారవుతారు.

మానసికంగా ఫ్లెక్సిబిలిటీ తత్వాన్ని అలవరచుకున్నప్పుడు ఎన్నో ప్రయోజనాలు, సౌకర్యాలుంటాయి. ఫ్లెక్సిబిలిటీ అంటే నమ్మకాలు, విలువలు, విశ్వాసాలకు నీళ్ళు వదులుకొమ్మని అర్థంకాదు.

సందర్భాన్ని అనుసరించి, సర్దుకుని సాగడం, క్లిష్టతరమయిన భావోద్రేకాలను వాటిపట్ల తీవ్రంగా స్పందించకుండా వాటిని బుర్రనుంచి వెలికి సాగనంపడాన్ని అలవాటుగా మలుచుకోవాలి.

## వర్తమానంపై ఏకాగ్రత

బాల్యంలో అయితే ఏ క్షణంలో ఆనందండక్కితే దాన్ని హాయిగా అనుభవిస్తూ, ఎంజాయ్ చేస్తారు. కాని ఎదిగేకొద్దీ ఈ రకం వర్తమాన ఆనందాన్ని చవిచూడడం తగ్గిపోయి భవిష్యత్ గురించిన ఆలోచనలే



Courtesy : VANITHA

నిరంతరం చుట్టుముట్టేస్తుంటాయి.కాని, వర్తమానాన్ని మనసారా అనుభవిస్తూ, అప్పటికప్పుడు కలిగే ఆనందాలను,అనుభూతులను ఆస్వాదించడం ఓవరం.

నూరుశాతం సంతోషాన్ని అందిపుచ్చుకోగలగడం ఓ సామర్థ్యం. చిన్నచిన్న బాధలు, నొచ్చుకోవడాలు ఉంటుంటాయి. వాటినే హైలెట్ చేసుకుంటూ కలిగిన ఆనందాన్ని అడుగంటనీయకూడదు.

వర్తమానంలో జీవించగల అలవాటు ప్రాక్టీస్‌తో, స్ట్రగుల్‌తోమాత్రమే స్వంతం కాగలదు.

ఆలోచనలపట్ల మంచి ఎవేర్‌నెస్‌తో ఉంటే ఇందుకు దోహదం కలుగుతుంది. చేతిలో ఉన్న ప్రతిపనినీ వందశాతం ఏకాగ్రతతో కొనసాగిస్తూపోతే వర్తమానం అంతా ఆనందమయమే. అయితే కొందరు ఏదో ఇబ్బంది, కష్టం, నష్టం ఎదురయ్యాయని తాగడం, స్మోకింగ్, అతిగా తినడం, ఒంటరిగా గడిపేయడం వంటి పనులు చాలామంది చేస్తుంటారు.

ఇటువంటి చర్యలవల్ల వచ్చిన సమస్యలు సమసిపోవు కదా. కాబట్టి, మంచి ఛాయిస్‌లు తీసుకునే ధోరణిని అలవరచుకోవాలి.

అతిగా, అనవసరంగా రియాక్టవకుండా, వీటిస్థానే మంచి ప్రత్యామ్నాయాలను అనుసరించే స్థిమిత ధోరణి కావాలి. అప్పుడే జీవితసారం, పరిపూర్ణత దక్కుతాయి. విలువల పరిరక్షణకోసం ఆమోదం, నిబద్ధతలతో కూడిన థెరపీని అనుసరించాలన్న మాట. ఈ రకం థెరపీ నచ్చిన, అనుసరించే విలువలకు ఊతం ఇస్తుంది. ఉదాహరణకు అవుట్‌డోర్ కార్యకలాపాలంటే అమిత ఇష్టం.



కాని అందుకు శరీరం సహకరించని పరిస్థితి ఉందనుకుందాం. అవాస్తవాన్ని ముందుగా అంగీకరించగలగాలి. ఇది మొదటి చర్య. ఈ కోరికను తీర్చుకోవడానికి ప్రత్యామ్నాయమార్గాలను ఆలోచించడం రెండోచర్య. ఇదే ఫ్లెక్సిబుల్ దృక్పథం.

పక్కనే పవర్ వాకింగ్ చెయ్యవచ్చు. స్థానికంగా వుండే పార్కులకో, తోటలకో వెళ్ళి ప్రకృతిని ఆస్వాదిస్తూ నడవనూవచ్చు.

అంటే, జీవితంలో వుండే కోరికల సాధనకు ప్రత్యామ్నాయ ఆలోచనలు అనేకం వుంటాయి.

ఒకేదిశగా, ఒకే దృక్పథంతో ఒక్కటే ఆలోచన చెయ్యకూడదు. అవకాశాలుగల ఇతర మార్గాలవైపునకు దృష్టి మరల్చాలి.

ఈ థెరపీలో గతాన్ని తవ్వుకోవడమన్నది అస్సలు ఉండకూడదు. పూర్తిగా వర్తమానంపైనే పూర్తి ఏకాగ్రత, ధ్యాస ఉంటే భవిష్యత్ మార్గం సుగమం అవుతుంది. జీవితంలో యాక్సెప్టెన్స్, కమిట్‌మెంట్‌ను ఏ విధంగా అలవరచుకోవాలన్న కసరత్తు మొదట్లో చేస్తే, అదే నెమ్మదిగా అలవాటయిపోతుంది.

ఇటువంటి మానసిక ఫ్లెక్సిబిలిటీని అలవరచుకోవాలంటే ఆరు ప్రధాన అంశాల లక్ష్యంగా కొనసాగాలి.

**ఆమోదం, అంగీకార దృక్పథం** : ఏం జరిగింది, ఏం జరుగుతుంది అన్న విషయాలను వాస్తవికంగా అంగీకరించగలగడం.

**ఆలోచనా విధానం** : ఆలోచనలు ఒకేవిధంగా, స్థిరంగా వుంటాయనుకోకుండా ఆలోచనా విధానం నిరంతర స్రవంతి అని, నిరంతరం మారే ప్రక్రియ అని, ఆ ఆలోచనలే ప్రవర్తనను నియంత్రిస్తుంటాయని గుర్తించగలగాలి.

**వర్తమానం** : ఎటువంటి తీర్పులూ ఇచ్చుకోకుండా అంతర్గత మరియు బాహ్య అనుభవాలపట్ల అప్రమత్తంగా ఉండగలగాలి.

**వ్యక్తిగత అనుభవాలు** : ప్రతివ్యక్తీ జీవితాన్ని విభిన్నంగా అనుభవిస్తుంటాడన్న విషయాన్ని అవగాహన చేసుకోవాలి. తమకున్నటువంటి అనుభవం రీత్యా నిర్వచనాలు ఇవ్వకూడదు.

**విలువలు** : మనకు ఏది ముఖ్యం అనే విషయాన్ని స్పష్టీకరించుకుని, వర్తమానంలో ప్రయోజనకరమైన చర్యలు చేపడుతుంటే, అవి కోరుకునే భవిష్యత్ ఫలితాల సాధనలో సాయపడతాయి.

**చర్యల నిబద్ధత** : విలువలతో కూడిన చర్యలు చేపట్టడాన్ని అలవరచుకోవాలి.

ఈ పద్ధతులన్నీ జీవితంలో పరిపూర్ణత సాధించడానికి సహకరించి, ఉత్తమంగా తీర్చిదిద్దుకోవడానికి ఎంతో ఉపకరిస్తాయి.

టి.సుధాకర్

# వారఫలం

జనవరి 25 నుండి 31, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 9492156064

## మేషం

అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. ఇంటా-బయటా మిశ్రమ ఉత్సాహాలతో సాగగలరు. మీకై గుర్తింపులున్నా ప్రయోజనాలు అంతంతమాత్రంగా ఉంటాయి. ఖర్చులు కొంతశాతం ఎక్కువగా ఉంటాయి. ఆచరణ సాధ్యం కాని ఆలోచనలు ఎక్కువుగా చేసే సూచనలున్నాయి. వివాహాది శుభకార్య నిశ్చయాలలో తాత్సారం చేయుట మేలవ్వగలదు. గురు, శుక్ర, సోమవారాలు అనువైనవి.

## వృషభం

కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. శారీరకంగా ప్రమాదాలకు గురికాకుండా జాగ్రత్తలు అవసరం. ముఖ్యం అనుకున్న పనులను కొన్నిటిని వాయిదావేయవలసి రావచ్చును. ఖర్చులు, ఆదాయాలు పరవాలేనివిగా ఉంటాయి. ప్రణాళికాపరంగానే వ్యవహరించుకోవాలి. వృత్తి, ఉద్యోగాలలో సాధారణతలు సిద్ధించగలవు. వ్యాపారాలలో సమయానుకూలంగా సాగించ గలరు. వీరికి ఆది, బుధవారాలు అనువైనవి.

## మిథునం

మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా. గతంలో ఆందోళన కలిగించినవి, వాయిదాపడినవి పూర్తిచేసుకోగల్గుతారు.ఊహించని వ్యక్తులనుండి ఆహ్వానాలుంటాయి. కుటుంబవ్యక్తుల తీరులో మంచి మార్పులు చూడగలరు. పరిచయంలేని వ్యక్తులతో మెలకువలు అవసరం.అగ్రిమెంట్లు,రిజిస్ట్రేషన్‌లు పూర్తిచేసుకోగల్గుతారు. పెట్టుబడులలో సలహాలకు ప్రాధాన్యత నీయండి.ఆదాయాలు అవసరాలు తీరునట్లుంటాయి. గురు, శుక్ర, సోమవారాలు అనువైనవి.

## కర్కాటకం

పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. కొత్త బాధ్యతలను స్వీకరించవలసి రావచ్చును. మీ పరిధులను తెలుసుకుని పట్టుదలలతో, మనోధైర్యాలు చూపి వ్యవహరించుకోవాలి. ఆశించిన ఫలితాలను పొందగలరు. వ్యక్తిగత విమర్శలకు దూరంగా ఉండండి. కుటుంబవ్యక్తుల సహకారాలు పెరుగుతాయి. సంతానమునకు శుభాలు నిశ్చయింపచేయగలుగుతారు. ప్రయాణాలలో మెలకువలు అవసరం. శారీరక బడలికలుంటాయి. వీరికి గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి. కాలభైరవాష్టక పారాయణలు ఉపకరిస్తాయి.

## సింహం

మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. ఆర్థిక స్థితిలో మార్పులేక నిరుత్సాహాలకు గురికాగల సూచనలున్నాయి. పనులలో కదలికలు అంతంతమాత్రంగా ఉంటాయి. మీ అభిప్రాయాలను ఖచ్చితంగా మరింత పారదర్శకంగా ఉండేటట్లు జాగ్రత్తలు తీసుకోండి. ఏకాగ్రతలు చూపుటచేతనే వృత్తి, ఉద్యోగాలను అనుకూలింపచేసుకోగలరు. దైవ-సేవా కార్యక్రమాలు చేపట్టి మానసికంగా ఉత్సాహాలను పొందుతారు. వీరికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.

## కన్య

ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. మీ మాట తీరుకు, ఆలోచనలకు మంచి గుర్తింపులుంటాయి. అవసరాలు కోరికలు నెరవేర్చుకునే దిశగా సాగగలరు. ఖర్చులందు నియంత్రణలతో సాగి అన్నిటా బ్యాలన్స్‌డ్‌గా వ్యవహరించుకోగలరు.వృత్తి,వ్యాపారాలందు కొన్ని మంచి అవకాశాలు ఏర్పడతాయి. ధనప్రలోభాలు వంటి వాటికి దూరంగా అధికారులు వ్యవహరించుకోవాలి. గురు, శుక్ర వారాలలో మెలకువలు అవసరం.

## తుల

చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2,3పా. ప్రయత్నాలను వేగవంతం చేయండి. మానసికంగా కుదుటపడగలరు.శుభకార్యాలలో పాల్గొనగలరు.రుణాలకు చేతిమార్పులు ఇవ్వగలరు. హామీలవంటివాటిచే ఆర్థిక భారాలను మోయవలసి రావచ్చును.విద్యార్థులు ఒత్తిడులకు గురికాకుండా ప్రణాళికావిధంగాసాగాలి.నిరుద్యోగులకుమేలుతనాలుంటాయి.గురు, శుక్ర, బుధవారాలు అనువైనవి.

## వృశ్చికం

విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ఈ వారం యంత్ర, వాహనాల వాడకాలలో మెలకువలు అవసరం. ఆడంబరాలకు ఖర్చులెక్కువ చేయు సూచనలున్నాయి. గతంలో వాయిదాపడిన పనులను పూర్తిచేసుకోగల్గుతారు. వృత్తి, వ్యాపారాలందు ఆటుపోట్లు,నష్టాలువంటివిఎదుర్కోవలసి రావచ్చును.ప్రణాళికా రచనలుంటాయి కాని-అమలులోపెట్టలేకపోతారు. స్థిరాస్తి వ్యవహారాలను కొంతకాలం కదపకుండుట ఉపకరించగలదు. సుబ్రహ్మణ్య ఆరాధనలు అవసరం. సోమ, మంగళవారాలందు అన్నిటా మెలకువలు అవసరం.

## ధనుస్సు

మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. రావలసినవి ఆలస్యంగా అందుతాయి. తరచూ చికాకులకు గురికాగలరు. ఇతరులనుండి సలహాలు, సహకారాలు తీసుకోలేకపోతారు. ధనమూలక సమస్యలను ఎదుర్కోవలసి రావచ్చును. పనుల సానుకూలతను బాగా శ్రమించాలి. అవకాశాలు కన్పిస్తాయి కాని అందిపుచ్చుకోలేకపోతారు. అధికారులు భ్రాతృవర్గంవారినుండి సహాయాలు పొందుతారు. ఈశ్వరారాధనలు తప్పనిసరి చేయండి. శని,ఆది,సోమవారాలు అనువైనవి.

## మకరం

ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. వేడుకలలో పాల్గొనగలరు. ఆత్మీయుల కలయికలు ఏర్పడతాయి. ఆర్థికంగా ఉన్నతమైన ఫలితాలను పొందుతారు. ఏర్పడిన అవకాశాలను అందిపుచ్చుకోగలరు. ఇతరుల సలహాలు తీసుకొనుటకంటే సొంత నిర్ణయాలే ఉపకరిస్తాయి. సోదరుల మధ్య కొత్త విషయాలు చర్చలకు రాగలవు. కొన్ని ముఖ్యం అనుకున్న ప్రయాణాలు వంటివి ఏర్పడతాయి. స్థిరాస్తుల ఏర్పాటు దిశగా ఆలోచనలు సాగుతాయి. విద్యార్థులు, నిరుద్యోగులు ఉన్నతమైన ఫలితాలను పొందగలరు. వీరికి వారమంతా అనుకూలమైనదే.

## కుంభం

ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2,3పా. పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి. ప్రయత్నాలను ముమ్మరం చేయగలరు. కృషికి తగిన ప్రయోజనాలను ఏర్పరచుకోగలరు. బంధుమిత్రులతో సంబంధాలను మెరుగుపరచుకోగలరు. వ్యవహారాలను సొంతంగా చూసుకోండి. టార్గెట్లను అధిగమించుటకు అనువైన సమయం-సద్వినియోగపరచుకోండి. ఖర్చులు కొంత ఎక్కువైనా మంచిరోజులు ముందు ఉన్నాయి అనే భావనతో సాగండి.కుటుంబమున ఉత్సాహాలుంటాయి.వీరికి గురు, శుక్ర, బుధవారాలు అనువైనవి.

## మీనం

పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. గతంతో పోల్చితే అనుకూలతలు పెరుగుతాయి. పొరపాట్లకు తావివ్వకుండా ఏకాగ్రతలతో వ్యవహరించుకోవాలి. ఎదుటి వ్యాఖ్యానాలను పట్టించుకోకుండా సాగండి.స్వల్ప చికాకులు మినహా ఇబ్బందులుండవు. గృహమార్పు యత్నాలు ఉపకరిస్తాయి. వృత్తి, ఉద్యోగాలందు అధికారులను ప్రసన్నం చేసుకోగల్గుతారు. వాహనాలను ఏర్పరచుకోగలరు. ఋణ సమస్యలు వంటివి కొన్ని తీరగలవు. కుటుంబసభ్యుల తీరు ఉత్సాహాన్నివ్వగలదు. ఈ రాశివారికి శని, ఆది, సోమవారాలు ముఖ్యమైన పనుల చేపట్టుటకు చాలా అనువైనవి.



# తోక పీకుడు గాడు

అనగా అనగా ఒక ఊళ్ళో వెంకయ్య అనే రెడ్డి ఉన్నాడు. అతనికి బర్రెలు, ఆవులు, ఎడ్లు, కోడెలు దాదాపు రెండువందలదాకా ఉన్నాయి. వాటిలో కోడెదూడ ఒకటి భలే బాగా ఉంటుంది.

ఆ ఊళ్ళో ఒక దొంగ దాన్ని కాజెయ్యాలని ఎన్నాళ్ళనుంచో చూస్తున్నాడు. ఆనాడు ఎవ్వరికీ తెలియకుండా కొట్టములోకి వెళ్ళి దూలం మీద దాక్కున్నాడు.

ఆ ఊరికి దగ్గర్లో ఒక చిన్న అడవి ఉంది. దాంట్లో ఒక పెద్దపులి ఉన్నది. ఆ పెద్దపులికి ఆ రోజున ఆహారం లేక ఒక కోడెదూడనైనా పట్టుకుతిందామని చీకటి పడ్డాక ఆ చావిట్లో ఒక ప్రక్క పడుకొని ఉంది.

బాగా చీకటిపడి అందరూ నిద్రపోయాక దొంగ వాడు దూలంమీద నుండి క్రిందకు దిగాడు.



వాడు కావాలనుకున్న కోడెకు ఇంకా కొమ్ములు రాలేదు కనుక వరసన అన్నిటినీ నెత్తిమీద చెయ్యేసి తడుముతూ పులి దగ్గరకొచ్చి తడిమాడు.

కొమ్ములు చేతికి తగల్లేదు. ఇదేరా కోడెదూడ అనుకొని పైన ఎక్కికూర్చొని 'ఛెయ్' అని తోలాడు.

పులి గాభరాపడింది. ఆ పులికి గిలి అంటే భయం. తనమీద ఎక్కింది 'గిలి' అనుకుని భయపడి పరుగెత్తడం మొదలుపెట్టింది. తిన్నగా అరణ్యంలోకి దారితీసింది. తెల్లవారేటప్పటికి బాగా నట్టడవిలోనికి పోయింది. తెల్లవారగానే తనెక్కింది కోడెదూడగాదు, పులి అని దొంగ గ్రహించాడు. ఎట్లారా భగవంతుడా దీనిని తప్పించుకునేదని ఆలోచిస్తున్నాడు.

ఇంతలోకి పెద్దపెద్ద ఊడలు దిగివున్న మర్రి చెట్టు క్రిందగా పెద్దపులి పోతున్నది.దొంగ ఒక ఊడ పట్టుకొని చెట్టుమీదకు పారిపోయాడు.

తనమీద ఉన్న గిలిపోయింది కదా అని పులి పరిగెత్తుకుంటూపోయింది. దారిలో పెద్దపులికి ఎలుగుబంటి ఎదురై "ఎక్కడికి పోతున్నావు పులిబావా!" అని అడిగింది.



పులి జరిగిన సంగతంతా చెప్పింది. అది విని ఎలుగుబంటి పకపక నవ్వుతూ "ఆ గిలిని నేనుచంపుతా, రా! నేను చెట్టెక్కి ఆ గిలిగాణ్ణి క్రిందకు తోస్తాను. నీవు వెంటనే అదాటున గిలిగాడిమీద పడి చంపేయి" అంది.

సరేనంటే సరేననుకుని ఆ రెండూ బయల్దేరి ఆ చెట్టు దగ్గరకు వచ్చాయి. ఎలుగుబంటి చెట్టెక్కింది. పెద్దపులి క్రింద కాపలాకాస్తూ కూర్చుంది. ఇది చూస్తున్న దొంగకి ఏమీ తోచడంలేదు.

ఎలుగుగొడ్డు దగ్గరకు వస్తున్నది. దొంగ ఇంక లాభంలేదని వచ్చే ఎలుగుగొడ్డుని వెనక కాలితోటి ఒక్కతన్నుతన్నాడు. ఆ తన్నుకి పట్టువదిలి ఎలుగుగొడ్డు క్రిందపడింది. గిలిగాడు క్రిందపడ్డాడని పులి ఎగిరి ఎలుగుగొడ్డుమీద దూకింది.

"బావా నేను ఎలుగుగొడ్డుని, చంపమాకు. వీడు గిలిగాడు కాదు, వెనక తన్నుడుగాడు. ఇక్కడున్నామంటే అన్యాయంగా చంపుతాడు" అని పెద్దపులిని వెంటపెట్టుకొని అక్కడనుంచి వెనక్కి తిరిగి చూడకుండా ఒకటే పరుగు... పరుగెత్తిపోయింది.

అట్లా పోతుండగా వాళ్ళకి నక్కబావ ఎదురై "ఏమిటలా పరుగెత్తుతున్నా?"రని అడిగింది.

"మన అరణ్యంలోకి గిలిగాడు వచ్చాడు" అంది పెద్దపులి.

"కాదు వెనక తన్నుడుగాడు వచ్చాడు..." అని ఎలుగుబంటి అన్నది.

నక్క పెద్దపెట్టున నవ్వి "ఓరి పిచ్చివాళ్ళల్లారా! ఈ భాగ్యానికే పరిగెత్తిపోతున్నారా? గిలిగాడేమిటి? వెనకతన్నుడుగాడేమిటి? మీరు పారిపోవటమేమిటి? మీ పరాక్రమం మండినట్టే ఉంది. వెనక్కి పదండి. వాడి అంతు నేను కనుక్కుంటాను" అని ప్రోద్బలం చేసి ఆ ఇద్దర్నీ వెనక్కి తిప్పింది.

దొంగ ఇంక ఇక్కడ ఉంటే లాభంలేదని దగ్గర్లోనే పాడుబడ్డ గుడివుంటే దాంట్లోకి వెళ్ళి తలుపు బిగించి కూర్చున్నాడు. నక్క, పెద్దపులి, ఎలుగు గొడ్డు ఆ చెట్టు దగ్గరకు వస్తే వాడు అక్కడ లేడు.

"నేను చెప్పలేదా? మనం వచ్చేలోపల వాడెక్కడోదాక్కున్నాడు. పిరికివాడు కాకపోతే దాక్కుంటాడా? ఇక్కడ దాక్కునేటందుకు మాత్రం ఏముంది, ఈ గుడితప్ప. రండి, ఈ గుళ్ళో ఉన్నాడేమో చూద్దాం" అని నక్క పులినీ, ఎలుగుగొడ్డునూ గుడి దగ్గరికి తెచ్చింది.

గుడితలుపులు వేసిఉన్నాయి. గుడితలుపుతీయాలని నక్క ప్రయత్నంచేసింది. కాని సాధ్యపడలేదు.చివరకు నక్క విసిగి ఆ తలుపుబొక్కగుండా తోకదూర్చి గడియ తీద్దామని ప్రయత్నించింది. ఇది దొంగచూసి దాని తోకపట్టుకున్నాడు. నక్క ఇకిలించటం మొదలుపెట్టింది.

నక్క ఇకిలింపు చూసి ఎలుగుగొడ్డు "ఏం నక్క బావా? ఇకిలిస్తున్నావెందుకూ?" అని అడిగింది.

"ఇకిలించందీ పికిలించందీ ఎన్నాళ్ళ కిందటో వేసిన ఇనుపగడియలు వస్తాయా?" అన్నది నక్క.

ఈ విధంగా కాసేపు దొంగా, నక్కా పీకులాడేసరికి నక్కతోక కాస్తా తెగిపోయింది.

నక్క బ్రతుకుజీవుడా అని పరిగెత్తటం మొదలుపెట్టింది. పులీ, ఎలుగుగొడ్డూ కూడా వెంట పరుగెత్తి "నక్కబావా, నక్కబావా? గుళ్ళో ఉన్నది ఎవరు?" అని అడిగినాయి.

"గుళ్ళో ఉన్నది గిలిగాడూ కాదు, వెనకతన్నుడుగాడూ కాదు, తోక పీకుడు గాడు" అని అదే ఉరుకు ఉరికింది నక్క.

పాపందొంగ ఇక "దూడలేకపోతేపోయింది. ప్రాణమన్నా దక్కిందికదా" అని ఇంటికి చేరుకున్నాడు.

**కోట రామకోటేశ్వరరావు**





DISA PATANI, Photography : NICK SAGLIMBENI, Courtesy : MAXIM INDIA

Condoms are obviously the best protection against the allergy



భారతదేశానికి యువ జనాభా ఒక గొప్ప సంపద.ఆ యువజనాభా సంఖ్య స్పెయిన్, జపాన్, జర్మనీ దేశ జనాభాలన్నీ కలిపినదానికన్నా అధికం. మరి అటువంటి యువ జనాభా శక్తిని సక్రమంగా వినియోగించుకుంటున్నదా! దేశం!

యువతకు విజ్ఞానం, నైపుణ్యాలు అవసరం అనేది ప్రభుత్వం చేస్తున్న ప్రచారం. అందుకోసం కోట్లాది రూపాయలు ఖర్చుచేస్తున్నారు. అయితే ఆ పరిజ్ఞానంలో లైంగిక పరిజ్ఞానాన్ని భాగం చెయ్యక పోవటంవల్ల దేశానికి నష్టం కలుగుతున్నది.

యువశక్తిని సంపూర్ణంగా వినియోగించుకోవటం సందేహంగా మారుతోంది.యువజనాభాలో లైంగిక పరిజ్ఞానం లేకుండా లైంగిక అనుభవం పొందేవారు పెరుగుతున్నారు. మన దేశంలో బాల్య వివాహాలు ఇంకా జరుగుతూనేవున్నాయి. కనీస వివాహవయసు చట్టాన్ని ధిక్కరించి వివాహాలు చేస్తున్నారు.

లైంగిక అంశాలు సరిగా తెలియవు. లైంగిక ఆనందం సక్రమంగా పొందరు. కాని 20 ఏళ్ళలోపే తల్లులవుతున్నారు. కోర్కెలు సరిగా కలగని, శరీరం సంతానం కనటానికి సరిగా సిద్ధమవకుండానే ఆడపిల్లలు తల్లులవుతున్నారు. దీనివల్ల వారికి కలుగుతున్న ఇబ్బందులు అనేకం.

వివాహ బంధంలో ఉన్న మజా ఏమిటో తెలియదు. జీవితములో సెక్స్‌ని ఎలా



# సెక్స్ AND సైకాలజీ

బి.కె. అమలాపురం

*అతిగా రతిలో పాల్గొనడంవలన ఆరోగ్యం చెడుతుందా?*

రతికి అతి అనేది లేదు. రతిలో ఎంత ఎక్కువగా పాల్గొన్నప్పటికీ ఆరోగ్యం చెడటం ఉండదు. రతిలో పాల్గొనే విషయంలో రతి సామర్థ్యం ఒక్కొక్కరిలో ఒక్కొక్క విధంగా ఉంటుంది.

కొందరు ఎక్కువసార్లు పాల్గొనవచ్చు, మరికొందరు రోజులో ఒక్కసారే పాల్గొనవచ్చు. ఏదీ ఎక్కువా కాదు, ఏదీ తక్కువా కాదు.

సి.ఎమ్. యలమంచిలి

*శోభనం గదిలో పళ్ళు, మిఠాయిలు పెడతారు కదా.శోభనంరోజున తిన్నట్లుగానే రోజూ పళ్ళు, మిఠాయిలు తింటే సెక్స్‌లో గొప్పగా పాల్గొనగల్గుతారా?*

మిఠాయిలు, పళ్ళు, పాలు తప్పకుండా సెక్స్ సామర్థ్యాన్ని పెంచుతాయి. శక్తిని ఇస్తాయి. ప్రతిరోజూ ఆహారంలో వీటిని తీసుకోవడం మంచిది. పడక గదిలో ఉండటం కూడా మంచిదే.

ఆర్.ఆర్. నెల్లూరు

*నాకు తరచూ యోనిలో మంట అనిపిస్తుంది. మావారికి ఏ బాధా లేదంటారు. ఒక్కొక్కసారి మంట భరించలేక రతిని త్వరగా ముగించమని గోలపెడతాను. యోని మంటవలన నేను సెక్స్‌ని ఎంజాయ్ చేయలేకపోతున్నాను. నాకే ఈ బాధ ఎందుకని? మావారికి ఈ బాధ ఎందుకు లేదు?*

సాధారణంగా యోనిలో ద్రవాలు ప్రవిస్తూంటాయి. సెక్స్‌లో పాల్గొన్నప్పుడు మరింత ఎక్కువ ద్రవాలు ఊరతాయి. సెక్స్‌లో మంట అనిపించకుండా ఉండాలంటే యోనిలో ద్రవాలు ఎక్కువ ఊరాలి.

సెక్స్‌పరంగా స్పందించని స్త్రీలల్లో యోనిలో ద్రవాలు అంతగా ఊరవు. ద్రవాలు తక్కువగాఊరితే సెక్స్‌లో పాల్గొన్న కొద్దిసేపటికే యోని డ్రై అయిపోయి సెక్స్‌లో మంట అనిపిస్తుంది. సెక్స్‌లో పాల్గొనేముందు ఉల్లాసంగా,ఉత్సాహంగా ఫోర్‌ప్లేలో పాల్గొంటే సెక్స్‌లో ఆసక్తి పెంపొందడమే కాకుండా యోనిలో ద్రవాలు కూడా చక్కగా ప్రవిస్తాయి.

పైగా సెక్స్‌లో మంచి అనుభూతులు కల్గుతాయి. కొందరు స్త్రీలల్లో ట్రైకోమొనియాసిస్, మొనిలియాసిస్, క్లామిడియల్ ఇన్‌ఫెక్షన్ ఉండి సెక్స్‌లో పాల్గొన్నప్పుడు కాస్త మంట, నొప్పి అనిపించవచ్చు.

గనేరియావంటి సుఖవ్యాధులు సోకినప్పుడు కూడా సెక్స్‌లో పాల్గొన్నప్పుడు మంట, నొప్పి అనిపిస్తాయి. యోనిలోపల మంట, నొప్పి అనిపించే అవకాశం ఉంది. మీ విషయంలో డాక్టరుకి చూపించుకుని చికిత్స పొందండి. అలాగే సెక్స్‌మీద ఆసక్తి పెంపొందించుకోండి. మీ సమస్య తీరిపోతుంది.

బి.కె. కావలి

*ఎంతసేపు సెక్స్‌లో పాల్గొంటే స్త్రీకి సుఖం కల్గుతుంది? నా సందేహానికి సమాధానమివ్వగలరు.*

శృంగారంలో పాల్గొన్నప్పుడు దంపతులిద్దరూ ఫోర్ ప్లేతో ఉద్రేకం చెందితే అంగప్రవేశంతో స్త్రీలో 1-2 నిముషాల్లోనే సుఖప్రాప్తి కలుగుతుంది. అందుకని స్త్రీకి సెక్స్‌లో సుఖప్రాప్తి లభించాలంటే ముందుగా ఫోర్‌ప్లే చాలా ముఖ్యం.

బి.ఆర్.కె. రాజమండ్రి

*నాకు అంగం చిన్నదని అనుమానం. అంగం చిన్నదైతే స్త్రీ తృప్తి చెందదని అంటారు కదా. నా అంగం చిన్నదో కాదో తెలుసుకోవడం ఎలా?*

*నాకింకా పెళ్ళి కాలేదు. ఇంతవరకు ఏ స్త్రీతోనూ కలవలేదు. పెళ్ళయ్యాక నా భార్యదగ్గర షేమ్ అయితే చావే గతి అవుతుంది. నా అంగం సైజు తగినంత ఉందో లేదో తెలుసుకోవడం ఎలా?*

చాలామంది మగవాళ్ళల్లో అర్థంలేని అనుమానం ఉంటుంది. అంగస్తంభనలు ఉన్నప్పుడు, హస్త ప్రయోగం చేయడం ఉన్నప్పుడు ఇక అంగం సైజు గురించి ఆలోచించడం అనవసరం.

అంగం చిన్నదిగా ఉన్నా, పెద్దదిగా ఉన్నా స్త్రీకి రతిలో తృప్తి ఒకేలా కలుగుతుంది. ప్రతి పురుషుడూ

# పరిజ్ఞానం లేకుండా లైంగిక అనుభవం

అనుభవించాలో తెలియకుండానే పిల్లల భారంనెత్తిన పడుతున్నది. కోర్కెలు బాగా పెరిగి, శరీరం లైంగిక అనుభవాన్ని కొత్త రకంగా అనుభవించమని రెచ్చగొడుతున్న వయసు వచ్చేసరికి పిల్లల బాధ్యతపెరిగి, ఏకాంతంలోపించి జీవితంలో నిరాశ పెరుగుతోంది.

కోర్కెలు బలవంతంగా అణుచుకోవటంవలన మానసికంగా ఇబ్బందులు తలెత్తుతుంటాయి. మరోవైపు చిన్నవయసులోనే వరుస కాన్పులతో శరీరం మీద శ్రద్ధ తగ్గుతుంది.ఆకర్షణ లోపిస్తున్నది.

సమాజంలో వచ్చిన మార్పులు బాలబాలికలకు స్వాతంత్ర్యాన్ని పెంచింది. పాఠశాల స్థాయినుండే ఆకర్షణలు మొదలవుతున్నాయి. సినిమాలు, సీరియల్స్ కోర్కెలను రెచ్చగొడుతున్నాయి.

పదిహేనేళ్ళ వయసులోనే లైంగిక అనుభవం పొందుతున్న అమ్మాయిల సంఖ్య పెరుగుతున్నది. సెక్స్‌లో పాల్గొంటే ఏం జరుగుతుందనేది తెలియదు. గర్భం వస్తుందన్న విషయం వారిలో చాలామందికి తెలియదని చెప్పారు. ఇంట్లో పెద్దలు ఆ విషయంలో తమను హెచ్చరించలేదన్నారు. ఫలితంగా గర్భం వచ్చి సామాజిక బహిష్కరణకు గురవుతున్నారు.

చాలామందికి లైంగిక విజ్ఞానం కావాలని ఉన్నా ఎవరిని అడగాలో తెలియదు. అమ్మాయిల్లో సగం మంది లైంగిక విషయాలు అడిగితే పెద్దలు చిన్నబుచ్చుతారని అదిమిపెట్టుకుంటున్నారు.

వైద్యుల్లో చాలామంది లైంగిక సమస్యలతో వెళితే తమను బెదిరించి, దోపిడీ చేస్తున్నారని చెప్పారు.

తమకు అర్జెంట్‌గా లైంగిక విజ్ఞానం, లైంగిక అంగాల ఆరోగ్యం గురించిన విషయాలు తెలియచెప్పాలని వారు కోరుతున్నారు.

కండోమ్‌ల వాడకంమీద పరిజ్ఞానం లేదు. అది కూడా అమ్మాయిలను ఇబ్బందిపెడుతోంది.

పురుషులు కండోమ్ ధరించేందుకు అంగీకరించక తమ ఆరోగ్యం పాడుచేస్తున్నారని అమ్మాయిలు అంటున్నారు. కాబట్టి హైస్కూల్ స్థాయిలో లైంగిక విజ్ఞాన అంశాలను బోధించి ఈ తరాన్ని ఆరోగ్యవంతులుగా తీర్చిదిద్దాలి.

పెళ్ళికి ముందే ప్రెగ్నెన్సీ, అబార్షన్, లైంగిక వ్యాధులబారిన యువత పడితే అవి ఆరోగ్య భారత్‌కి ఇబ్బందికరమైన విషయం. లైంగిక ఆరోగ్యం కూడా సంపూర్ణ ఆరోగ్యంలో భాగంగా భావించి, ఆ పరిజ్ఞానం వచ్చినతర్వాతే లైంగిక అనుభవంలోకి దిగమని యువతకు చెప్పాలి. ◆



## డా॥జి. సమరం

అంగపరిమాణం గురించి ఒక విషయం తెలుసుకోవాలి. సాధారణంగా అంగపరిమాణం 2 అంగుళాల నుంచి 4 అంగుళాల మధ్య ఉంటుంది.

విచిత్రం ఏమిటంటే అంగం స్తంభించినప్పుడు నాలుగు అంగుళాల పరిమాణం ఉన్న పురుషాంగం ఎంత పెద్దది అవుతుందో రెండంగుళాలున్న పురుషాంగం కూడా దాదాపు అంతగానే పెరుగుతుంది. దానికి కారణం చిన్నదిగా అనిపించే పురుషాంగంలో సాగే గుణం, ఉబ్బే గుణం ఎక్కువగా ఉంటుంది.

మీకు అంగస్తంభనలు, హస్తప్రయోగం చేయడం ఉన్నట్లయితే ఇక అంగపరిమాణం గురించి ఆలోచించడం అనవసరం. సెక్స్‌లో పాల్గొనగలరు, మీ భార్యను మెప్పించగలరు.

జె.ఎమ్. సూర్యాపేట

*నాకు మొన్ననే పెళ్ళి అయింది. మొదటి రాత్రి సెక్స్‌లో పాల్గొన్నప్పుడు పురుషాంగం ముందు ఉండే చర్మం వెనక్కి వెళ్ళిపోయి రింగులాగా పట్టేసింది. ఏదో కష్టపడి ముందుకు గుంజుకున్నాను.*

*మళ్ళీ రెండవ రోజు కూడా అలాగే పట్టేసింది. ఈసారి ఎంతకీ ముందుకు రాలేదు. బాగా ఉబ్బిపోయింది. దానివల్ల నాకు ఏమయినా అవుతుందా? ఇప్పుడు నేను ఏం చేయాలి?*

సాధారణంగా పురుషులకి పురుషాంగం చివర ఉండే శిశ్నంమీద ఉండే చర్మం తేలికగా ముందుకీ వెనక్కీ కదులుతుంది. కొందరి విషయంలో శిశ్నం మీద తొడుగుగా ఉండే ఈ చర్మం చాలా టైట్‌గా ఉంటుంది. అది అంగం మామూలు దశలో ఉన్నప్పుడు కాస్త తేలికగా ముందుకీ వెనక్కీ కదిలినప్పటికీ స్తంభించినప్పుడుమాత్రం టైట్‌గా మారిపోతుంది.

మామూలుగా పెళ్ళికానివాళ్ళు ఇలా టైట్‌గా ఉండటాన్ని పట్టించుకోరు. పెళ్ళి అయినతర్వాత సెక్స్‌లో పాల్గొన్నప్పుడు మొదటి కలయికలోనే శిశ్నం వెనక్కి ఈ తొడుగు వెళ్ళిపోయి రబ్బరుబ్యాండులాగా పట్టేస్తుంది. ఈ పరిస్థితి రాకుండానే ప్రతి పురుషుడూ ముందే గమనించి సున్తీ చేయించుకోవాలి.

సున్తీ చేసినప్పుడు శిశ్నానికి తొడుగుగా ఉండే చర్మాన్ని కట్‌చేసి శిశ్నం వెనక్కివుంచడం అవుతుంది. మీ విషయంలో మీరు వెంటనే డాక్టరుకి చూపించి శిశ్నం వెనక బిగుసుకుపోయిన చర్మాన్ని కట్‌చేసి సున్తీ చేయించుకోండి.

వి.ఆర్. కరీంనగర్

*నా వయస్సు **40** సంవత్సరాలు. నాకు బుడ్డ చాలా కాలం నుంచీ ఉంది. ఏ బాధా లేదని పట్టించుకోలేదు. ఈ మధ్య కొంతకాలం నుంచి బుడ్డ నొప్పి చేసింది. అకస్మాత్తుగా చలిజ్వరం వచ్చింది.*

*డాక్టరు తాత్కాలికంగా మందులు వాడి జ్వరం తగ్గినతర్వాత బుడ్డ ఆపరేషను చేశారు. బుడ్డ చీము పట్టేసిందని చెప్పారు. ఏ బాధా లేని బుడ్డ చీము పట్టడం ఏమిటి? బుడ్డకి చీము పట్టడంతో దాన్ని తీసివేశారు. ఇప్పుడు నా ప్రశ్న ఏమిటంటే ఉన్న రెండు బీర్జాల్లో ఒక బీర్జాన్ని తీసివేయడంవలన నేను సెక్స్‌కి పనికిరాకుండా పోతానా?*

చాలామంది పురుషులు బుడ్డ పెద్దదిగా ఉన్నప్పటికీ పట్టించుకోరు. బుడ్డనే హైడ్రోసిల్ అని, వరిబీజం అని అంటారు. కొందరిలో వరిబీజం కాస్త పెద్దదిగా మారినతర్వాత అందులో రక్తం చేరవచ్చు లేదా ఇన్‌ఫెక్షన్ కలిగి చీము చేరవచ్చు.

ఇలా జరిగినప్పుడు బీర్జం డ్యామేజీ అవుతుంది. డ్యామేజీ అయిన బీర్జాన్ని తీసివేయడం ఒక్కటే మార్గం. మీ విషయంలో ఒక బీర్జం బాగానే ఉంది కనుక సెక్స్ విషయంలో మీకు ఎటువంటి భయం అవసరం లేదు. మీరు మామూలుగానే సెక్స్‌లో పాల్గొనగలరు.

కె.ఆర్. భీమవరం

*నాకు ఇంకా పెళ్ళికాలేదు. నాకు ఒక అమ్మాయితో స్నేహం కలిగింది. ఆ అమ్మాయికి కూడా పెళ్ళికాలేదు. మూడురోజుల క్రితం ఇద్దరం సెక్స్‌లో పాల్గొన్నాం. సాధారణంగా పెళ్ళికాని అమ్మాయితో సెక్స్‌లో పాల్గొన్నప్పుడు ఆ అమ్మాయికి కన్నెపొర చిరిగి రక్తం కారుతుందటకదా.*

*కాని ఆ అమ్మాయికి అలా ఏమీ జరగలేదు. దాంతో ఆ అమ్మాయి మీద నాకు డౌటు ఏర్పడింది. నేనుండలేక నీకెందుకని రక్తం కారలేదని అడిగాను.*

*ఇంతకుముందే సెక్స్ సంబంధాలున్నాయా అని అడిగాను. దానికి ఆ అమ్మాయి నాకు రక్తం తక్కువ ఉందని డాక్టరు చెప్పారు. అందువల్లే రక్తం కారలేదు అంది. తనకి ఇంతకుముందు ఎవరితోనూ సెక్స్ సంబంధాలు లేవని చెప్పింది. నేను ఆమె మాటలు నమ్మవచ్చా? నమ్మకూడదా?*

మొదటి కలయిక అయినప్పటికీ రక్తం రావాలని లేదు. చాలామంది అమ్మాయిలకి ఒక్క చుక్క రక్తం కూడా కారదు. అంతమాత్రాన ఆమెకు అంతకుముందే సెక్స్ సంబంధాలు ఉన్నాయనుకోవడం తప్పు.

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

సీరియల్

# మనిషిలో మనిషి

హాలు తలుపులు మూసివున్నాయి. హాల్లో లైట్లు వెలుగుతున్నాయి.

చాలాసేపటిగా ఒక జాతకాన్ని శ్రద్ధగా పరిశీలిస్తున్నారు కృష్ణశాస్త్రి.

ఒక రఫ్ నోట్‌మీద జన్మకుండలి వేసి ఆమూధంకట్టి జాతకుని జనన కాలంలో గ్రహస్థితులెలా ఉన్నాయి లగ్నబల మెంత? ప్రస్తుత గ్రహస్థితి ఏమిటి జాతకుడి కిప్పుడు నడుస్తున్న దశ ఏమిటి ఒక్కటికాదు. మొత్తమంతా లెక్కలుగట్టి చూస్తున్నారు.

కృష్ణశాస్త్రిగారు చెప్పే ఫలితాలకోసం ఆత్రంగా నిరీక్షిస్తున్నారు రాజావారు. రెండుగంటలుగా శాస్త్రి గారు పరిశీలన సాగుతూనే ఉంది. చీమ చిటుక్కు మన్నా విన్పించేంత నిశ్శబ్దం అలుముకొనుందక్కడ.

ఉన్నట్టుండి తలెత్తి చూశాడు మున్నలూరు కృష్ణ శాస్త్రి గారు. పై తుండుతో ముఖం తుడుచుకున్నాడు. "ప్రభూ! జాతకాన్ని పరిశీలించమని ఎందుకిచ్చారో నాకు తెలీదు. ఫలితాలు వినేముందు ఒక సందేహం తీర్చండి. రాజకుమారికి వరాన్వేషణలో భాగంగానే ఈ జాతకాన్ని చూడమనిచ్చారా?" అనడిగాడు.

"కాసేపు అలానే అనుకోండి గురువర్యా. మీ పరి శీలనలో ఏం తెలుసుకున్నారో చెప్పండి" అన్నారు నవ్వుతూ రాజావారు.

"నన్ను మీరు పరీక్షకు పెడుతున్నారు..." అంటూ నవ్వాడు రాజగురువు మున్నలూరు కృష్ణశాస్త్రిగారు. అంతవరకు తను రాసుకున్న కాగితాలను మరోసారి చూసుకుని గొంతు సవరించుకున్నాడు.

"ఈ జాతకుడు ఎవరోగానిఖచ్చితంగాఇతను ఏ సంస్థానానికీఅధిపతిగాని, వారసుడు గానికాదుప్రభూ. ఇతడిది మృగశిరా నక్షత్రం మూడో పాదం. మిధునరాశి ఇతనిది. వృశ్చికలగ్నం.

జాతకంప్రకారం నామకరణం జరిగుంటే ఇతడి నామధేయం 'కా' అనేఅక్షరంతో ఆరంభం అవుతుంది. ఇతడి జనన కాలములో గ్రహస్థితులు అస్సలుబాగ లేవు. ఎక్కడోపుట్టి ఎక్కడోపెరిగి చాలా కష్టాలు పిన్న వయసులోనే అనుభవించిన జాతకమిది. అయితే కుజుడి నీచదృష్టి తొలగటం గురుశుక్రులు కలిసిరావ టంతో బాల్యంనుండే క్రమంగా మబ్బులు తొలగిన పున్నమిచంద్రునిలా ప్రకాశిస్తూ వచ్చాడు.

బుధుడి కటాక్షం పరిపూర్ణంగా ఉంది. ఖచ్చి తంగా ఇతడు మహామేధావి. సందేహం లేదు.

ఈ జాతకుడికి ప్రస్తుతం శనిమహాదశ నడుస్తోంది. శని వక్రదృష్టితాకితే ఎంత గొప్పవాడైనా మసికావల సిందే. అదే శుభదృష్టితాకితే ఎంత బికారినైనా కుబే రుడ్ని చేస్తుంది.

శనీశ్వరుని గొప్పతనం అది. మహా శక్తిమంతుడు. ప్రస్తుతం జాతకుని మీద శనిదృష్టి సమస్థాయిలో ఉంది.

ఇప్పుడు ఇతడికంటూ ఎటువంటి కష్టాలూ లేవు.కాని ఆత్మీయులకోసం కష్టాలపాలవుతాడు. వాటి నధిగమించడానికి పోరా డక తప్పదు. అద్భుతాలు సాధించే జాతకమిది.

ముఖ్యమయిన విషయం మరొకటి వుంది. ఇతడు శ్రీరామచంద్రునిలా ఏక పత్నీవ్రతుడయివుంటాడు. ఈ విషయంగా విశిష్టమైన జాతకుడు ఇతడు.

భార్యకోసం ప్రాణమైనా ఇచ్చే గొప్ప ప్రేమికుడయి ఉంటాడు. అంతేకాదు... ఇతని కళత్ర స్థానం చాలా బలంగా ఉంది.

బలహీన జాతకురాలు కూడా ఇతన్ని వివాహమా డితే కష్టాలుదాటి ఇతని వెంట నిండు నూరేళ్ళు నిశ్చింతగా జీవింపగలుగు తుంది" అంటూ చెప్పి కాస్త





## జరిగిన కథ

**11**

**యు**వరాణి మేఘనా సౌందర్యానంద సహానాదేవి జాతకములో వున్న దోషాన్ని పోగొట్టేందుకు మొదటిగా ఓ మేకపోతుతో ఆమె వివాహం జరిగినట్లుగా ఓ క్రతువును నిర్వహిస్తారు. ఆమె అచ్చు తన ప్రియురాలు సంజనాలా వుండటం చూసి షాక్ అవుతాడు కార్తికేయ. అయితే ఆమె సంజనాయే అని నిర్ధారించుకుని ఆమె రాజావారు ఇద్దరూ తననెందుకు మోసంచేశారోనని ఆవేదన పడి అక్కడినుండి వెళ్ళిపోతాడు.

అతను అలా వెళ్ళిపోయేసరికి సంజనా తనగురించి కార్తికేయ ఏమనుకున్నాడోనని బాధపడుతుంది. యోగేంద్రుడు రక్షాకవచంగా ఇచ్చిన సంజనా మెడలోని తులసి మాల ఆ క్రతువులో దగ్ధమవుతుంది.

తనో ఎన్నారైనని తనదగ్గర చేరి తన ప్రేమను పొందిన సంజనా ఓ సంస్థాన యువరాణి అని తెలిసి తనకు చెప్పకుండా ఆ రహస్యం దాచినందుకు చాలా బాధపడతాడు కార్తికేయ. నీకు అన్నీ తెల్సు, నా కూతుర్ని ప్రేమగా చూస్కో అని రాజావారు చెప్పేసరికి మరింత అయోమయంలో పడతాడు.

కార్తికేయ దగ్గరకు వస్తుంది సంజనా. పెళ్ళి కాకుండానే ఆ రాత్రి శోభనం జరుగుతుంది వారిద్దరికీ. స్వామి సత్యానంద వెళ్ళేటప్పుడు ఓ స్ఫటికమాలను సంజనాకిస్తాడు. తర్వాత జరిగేది చదవండి.

విరామం ఇచ్చాడు మున్నలూరు కృష్ణశాస్త్రి.

సంతృప్తిగా తలపంకించారు రాజా విష్ణు చంద్ర గజపతి మహాదేవ్. గుండెల మీదినుంచి గొప్ప భారం తొలగిపోయినట్టు ఫీలవుతూ నవ్వారు.

"చాలు గురువర్యా, ఇక చాలు" అన్నారు.

"ఇంకేమీ చెప్పక్కర్లేదంటారా రాజన్యా" అంటూ ఒకింత ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణశాస్త్రి.

"**అ**వసరంలేదు. అంతా మేము ఊహించినట్టే మీరు చెప్పిన ఫలితాలూ అద్భుతంగా ఉన్నాయి. ఇక మీరు చూడాల్సింది ఈ జాతకాన్ని. మా ప్రియపుత్రిక జాతకంతో పోల్చిచూడండి. ఈ ఇద్దరికీ వివాహం జరిపిస్తే వారి భవిష్యత్తు ఎలా ఉంటుందో చెప్పండి" అనడిగారు రాజావారు.

రాజావారి మాటలకు కించిత్తు కూడా ఆశ్చర్యపోలేదు కృష్ణశాస్త్రి.

ఇలాంటిది ఏదో ఉందని ముందే ఊహించాడు. కాని సందేహమలాగే ఉండిపోయింది. ఇంతకీ ఎవరిదీ జాతకం? ఏ సంస్థానాధీశునిది?"

"క్షమించాలి. ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోవద్దు. జాతకం ప్రకారం ఇతడు సంస్థానాధీశుడు కాడు. ఆచారం ప్రకారం సంస్థానవారసురాల్ని మరో సంస్థానవారసునికి లేదా సంస్థానాధీశునికిచ్చి గదా వివాహం చేయాలి. ఈ వైవిధ్యానికి కారణం తెలుసుకోవచ్చా ప్రభూ?" అనడిగాడు.

"తొందరపడకండి గురువర్యా. సమయం వచ్చినప్పుడు మీకే అర్థమవుతుంది. ముందు జాతకాలు పరిశీలించండి" అన్నారు రాజావారు.

తిరిగి జాతకాలు ముందేసుకుని ఆ పనిలో నిమగ్నమయ్యారు మున్నలూరు కృష్ణశాస్త్రి.

ఇంతలో బయట పరిచారిక ఒకామె హాలు ప్రవేశ ద్వారం తెరిచింది. ముందుగా రాజకుమారి, ఆమె వెనకే కార్తికేయ లోనకొచ్చారు.

పరిచారిక తొంగి తలుపు దగ్గరగా మూసింది. వచ్చింది రాకుమారిగాబట్టి రాజావారి అనుమతితో పనిలేదు. అందుకే కార్తికేయతో సరాసరి లోనకొచ్చేసింది. ఆ ఇద్దర్నీ చూసి ఉత్సాహంగా నవ్వారు రాజావారు. చేస్తున్న పని ఆపి ఆ జంటను విస్మయంతో చూడనారంభించాడు కృష్ణశాస్త్రి.

**కా**ర్తికేయను ఇదే మొదటిసారి చూడ్డం ఆయన. సంజనాను రాకుమారిగా గత సాయంత్రం శివాలయంలో తొలిసారిగా చూశాడు. ఆమె లండన్ నుంచే వచ్చిందనుకుంటున్నాడు ఇంకా కృష్ణశాస్త్రి. మళ్ళీమళ్ళీ చూడాలనిపించే స్ఫురద్రూపి ఈ యువకుడు ఎవరా అని ఆలోచిస్తున్నాడు.

"రండి రండి. కూర్చోండి. అన్నట్టు నువ్వు టిఫిన్ చేశావా ఇంకా లేదా? అలాగే వచ్చేశావా?" కార్తికేయనుద్దేశించి అడుగుతున్నారు రాజావారు.

"కాఫీ టిఫిన్లు ముగించే వచ్చాం డాడీ" అంటూ వెళ్ళి తండ్రి సరసన కూర్చుంది సంజనా. ఎదురుగా మరో సోఫాలో కూర్చున్నాడు కార్తికేయ.

కార్తికేయ ఎలాగూ ప్యాలెస్‌కొస్తాడని సంజనాకు తెలుసు. అతడు వచ్చేవరకు ఆగి డైనింగ్‌హాల్‌కు తీసుకెళ్ళింది. తర్వాతే ఇక్కడికొచ్చారు. సంజనా చాలా ఉత్సాహంగా ఉంది.

కుమార్తె ముఖంలో కళను ఆనందాన్ని రాజావారు గమనిస్తూనేవున్నారు.

"కార్తీ! వీరు మా రాజ గురువు మున్నలూరు కృష్ణ శాస్త్రిగారు..." అంటూ కార్తికేయకు పరిచయం చేశారు. వినయంగా నమస్కరించాడు కార్తికేయ. అదే సమయంలో



E-mail: Suryadevaranovelist@gmail.com

# సూర్యదేవర రామ్‌మోహనరావు

అప్రయత్నంగా కార్తికేయ దృష్టి ఎదురుగా ఉన్న విండో గ్లాస్‌మీద పడింది. నొసలు విరిచి ఒక్కక్షణం ఆశ్చర్యంగా అటే చూస్తూండిపోయాడు. సందేహం లేదు. విండో గ్లాస్ వెనక ఎవరో ఉన్నారు.

చెవి గ్లాస్‌కి ఆన్చి ఇక్కడి మాటలు వింటున్నాడు. అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తోంది టైమ్. ఎండ నిలువునా పడ్డంతో నీడ స్పష్టంగా లేదు. కాని తలపాగా షేపునుబట్టి అక్కడ మనిషి ఉన్నట్టు గుర్తించి ఉలికిపడ్డాడు కార్తికేయ.

అజ్ఞాతశత్రువు గురించి రాజావారు చెప్పిందానికి ఇక్కడ జరుగుతున్నదానికి సరిపోయింది. ఎవడో ప్యాలెస్‌లో విషయాల్ని బయటికి చేరవేస్తున్నాడు.

ఎంతమంది గూఢచారులు వున్నారో తెలీదుగాని తలపాగానుబట్టి ప్యాలెస్ సిబ్బందిలోనే ద్రోహులు వున్నారని ఊహించాడు. ఒక్కడ్ని పట్టుకున్నా చాలు మొత్తం కుట్ర బయటపడుతుంది.

కృష్ణశాస్త్రి ఏదో అడగబోతుంటే చివ్వున పైకి లేచాడు కార్తికేయ. "మీరు మాట్లాడుతూ వుండండి. ఇప్పుడే వచ్చేస్తాను" అని చిన్నగా చెప్పి వేగంగా బయటికి వెళ్ళిపోయాడు కార్తికేయ.

రాజావారితోబాటు కృష్ణశాస్త్రి కూడా విస్తుపోయి చూశారు. ఎందుకొచ్చాడు, ఎందుకు వెళుతున్నాడు అర్థంకాలేదు. కాని సంజనాకు కార్తికేయ గురించి బాగా తెలుసు. కార్తికేయ చూపుల్నిబట్టి పదిసెకన్ల ఆలస్యంగా విషయం గ్రహించింది.

తండ్రికి సైగచేసి విండోవంక చూపించింది. ఈలోపల బయటికొస్తూనే శరవేగంతో గార్డెన్‌వైపు పరుగుతీశాడు కార్తికేయ. మూడే మూడునిమిషాల్లో గార్డెన్‌లో ప్రవేశించాడు. అయితే విండోపక్కన నక్కి వింటున్న వ్యక్తి చాలా అప్రమత్తంగా ఉన్నాడు.

కార్తికేయ యాభై అడుగుల దూరంలో ఉండగానే ప్రమాదం పసిగట్టి తిరిగిచూడకుండా పరుగెత్తాడు. వాడిని వదిలే ఉద్దేశం కార్తికేయకు లేదు. రెట్టించిన వేగంతో పారిపోతున్నవాడి వెంటపడ్డాడు.

విండో గ్లాస్‌మీద నీడ తప్పుకోగానే చివ్వున లేచి వెళ్ళి విండో తెరిచారు రాజావారు. ఆగంతకుడు కనబడలేదుగాని వాడ్ని తరుముకెళ్తూ కన్పించాడు కార్తికేయ. ఇంతలో ఉన్నట్టుండి కదిలింది సంజనా. ఒకే దూకులో విండోగుండా బయటపడి కార్తికేయకు సాయంగా పరుగుతీసింది.

ఏం జరుగుతోందో అర్థంగావటంలేదు... రాజ గురువు కృష్ణ శాస్త్రి విస్తుపోయి చూస్తున్నాడు... ధైర్యసాహసాల్లో మగాడికి తీసిపోదని రాకుమారికి జాతకం చెప్పాడు. ఆ సాహసాన్నిప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు.



సమాజంలో వస్తున్న మార్పుల నేపథ్యంలో మహిళలపై నేరాలు పెరుగుతున్న మాట వాస్తవం.

-ఎమ్.మాలకొండయ్య, ఎ.పి, డి.జి.పి.

ఆ ద్రోహి ఎవడోగాని వాడ్ని వదిలే ఉద్దేశం కార్తికేయకు లేదు. వెన్నంటి తరుముతున్నాడు. వాడు ధరించిన యూనిఫామ్‌నిబట్టి వాడు ప్యాలెస్ సిబ్బందిలో మనిషిగా గుర్తించాడు. ఎర్రటి తలపాగా ఉంది. దానివస్త్రభాగాన్ని ముఖం తెలీకుండా కవర్ చేసుకున్నాడు... గార్డెన్‌లో చాలాదూరం తరిమాడు కార్తికేయ. మరోప్రక్కనుంచి సంజనా చిరుతలాగా దూసుకువస్తోంది. ఏం జరుగుతోందో అర్థంగాక ఎగువనుంచి కొందరు ప్యాలెస్ గార్డ్‌లు ఎదురు పరుగెత్తుకునివస్తున్నారు.

ఇక వాడు తప్పించుకోలేడనుకొంటున్న సమయంలో ఒక గుబురుపొదను దాటి అవతల చెట్ల గుబురులోకి పోయి అదృశ్యమయ్యాడు వాడు. తరువాత ఎటు పోయాడోగాని అంగుళం అంగుళం గాలించినా వాడి జాడ తెలీలేదు.

నిరాశతో వెనుతిరిగారు.

ఈలోపల జాతకాలు కలుస్తాయో లేదో పరిశీలించి ఉంచమని సాయంత్రం కలుద్దామంటూ రాజగురువు కృష్ణశాస్త్రిని ఆయన విడిదికి పంపించివేసి తనూ గార్డెన్‌లోకి వచ్చేశారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్. సంజనా కార్తికేయలకు ఎదురువస్తూ "ఏమయింది?" అని అడిగారు.

"తప్పించుకున్నాడు డాడీ.వాడు మన ప్యాలెస్ రక్షకదళం యూనిఫామ్‌లో ఉన్నాడు. ముఖం తెలీలేదు" అంది సంజనా.

"ఇప్పుడే ఖచ్చితంగా చెప్పలేం సర్. బయటివాడు కావచ్చు. ఎవరికీ అనుమానం రాకుండా యూనిఫామ్‌లో తిరుగుతూండొచ్చు. ఇలాంటివాళ్ళు ఎంతమంది ఉన్నారో తెలీదు. ఎవరో వీళ్ళకి సాయం చేస్తూండాలి. కాని ఒక్కటిమాత్రం నిజం.

వీళ్ళు ఇక్కడి విషయాలు సేకరించి ఎప్పటికప్పుడు బయటికి చేరవేస్తున్నారు. ఈగూఢచారుల్నిఏర్పాటు చేసుకున్న ఆ శత్రువు ఎవరు?" అనడిగాడు కార్తికేయ. అంత దూరంలో ఇటుగా వీల్‌ఛైర్‌లో వస్తూ కన్పించాడు సూర్యప్రకాశవర్మ.

ముగ్గురూ అక్కడే పొన్నచెట్టు నీడన ఛైర్స్‌లో కూర్చున్నారు. "కార్తీ! నేనెందుకు భయపడుతున్నానో ఇప్పుడర్థమైందా? జాతకరీత్యా మా బిడ్డకు ప్రాణగండం ఉందట. జరుగుతున్న పరిణామాలు చూస్తూ వుంటే అది నిజమేననిపిస్తోంది. మీరు అనుక్షణం అప్రమత్తంగా మెలగాలి" అన్నారు రాజావారు.

"కాని శత్రువు ఎవరు? రాకుమారితో వాడికి పగలేమున్నాయి" అడిగాడు కార్తికేయ.

"ఎవరో తెలీదు. ఎందుకో అంతకన్నా తెలీదు కార్తీ. అదే మమ్మల్ని వేధిస్తున్న సమస్య..." అంటూ భారంగా నిట్టూర్చాడు రాజావారు.

ఇంతలో సూర్యప్రకాశవర్మ కూడా వీల్‌ఛైర్‌లో వచ్చి వారిని కలిశాడు. జరిగిందానికి చాలా నొచ్చుకున్నాడు. రాజావారు కొద్దిరోజులిక్కడ ఉండి లండన్ వెళ్ళిపోతారు. సదా ఇక్కడి వ్యవహారాలు చూసుకునేది చక్కబెట్టేది బావమరిది సూర్యప్రకాశవర్మే.

ప్యాలెస్‌కు సంబంధించి అంతా అతడి అధీనంలోనే ఉంటుంది. ఏం జరిగినా వర్మనే సందేహించాల్సివస్తుంది. రెస్పాన్సిబిలిటీ పర్సన్‌కాబట్టి అతడి భయం అతనిది.

"సారీ బావగారూ. భద్రతా ఏర్పాట్లు కట్టుదిట్టం చేస్తాను. ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా చూస్తాను. అనుమానితులు కొత్తముఖాలు

## వారెవ్వా! భలే ఆఫర్!



బొద్దుగా ఉన్నందున భారీ ఆఫర్లు రావడంలేదని రూపాన్ని నాజూగ్గా మార్చేసింది పరిణీతిచోప్రా. గ్లామర్ హంగులు బాగా అద్దేసింది. అయినా పరిణీతిచోప్రాకు పెద్ద గుర్తింపు తెచ్చే సినిమాలు లేకపోవడం ఆమె బ్యాడ్‌లక్ కావచ్చునేమో.

ఎన్ని ప్రయత్నాలు ఎంతగా చేసినా అవకాశాలు అరకొరే అనుకుంటున్న తరుణంలో బాలీవుడ్ క్రేజీ హీరో అక్షయ్‌కుమార్‌తో కలిసి నటించగల బంపర్ ఆఫర్ దక్కించుకోగలిగింది.

అక్షయ్ నటిస్తున్న 'పాడ్ మెన్' సినిమా ఇప్పటికే ఆసక్తిని రేకెత్తిస్తున్నది. దీని తర్వాత క్రేజీ ప్రాజెక్టు కరణ్‌జోహార్, అక్షయ్‌కుమార్, అనురాగ్‌సిన్హాల కాంబినేషన్‌లో సెట్స్‌పైకి వెళ్తుంది. ఈ భారీ బడ్జెట్ సినిమాలో పరిణీతి ఛాన్స్‌కొట్టేసి, ఇకనైనా తన దశ తిరిగిపోగలదని ఉత్సాహపడుతున్నది.

ఎవరు కన్పించినా బంధించమని చెప్తాను. ఇప్పుడే ఆ ఏర్పాట్లు చేస్తాను" అంటూ ఒక నౌకరు వీల్ ఛైర్‌ను తోస్తూండగా వేగంగా అక్కడినుండి నిష్క్రమించాడు సూర్యప్రకాశవర్మ.

కార్తికేయ మనసులో చాలా సందేహాలున్నాయి. వాటిని అడిగి రాజకుటుంబ వ్యవహారాలలో తల దూర్చటం కార్తికేయకు ఇష్టంలేదు.అందుకే ఈ విషయాల్ని పక్కనపెట్టి "ఒకవిధంగా నేను ఇలా రావటం మంచిదే అయింది సర్. కుట్రల సంగతి బయట పడింది. అసలు నేను వచ్చిన పనే వేరు.

మన ప్రాజెక్ట్ గురించి ఢిల్లీ వెళ్ళాల్సివుంది. ఎప్పుడు వీలవుతుందో తెలుసుకుందామనివచ్చాను" అని చెప్పాడు కార్తికేయ.

"మర్చిపోలేదు కార్తీ. కొంచెం టైమ్ పడుతుంది. ప్రధానమంత్రిగారు నిన్ననే తూర్పు ఆసియా దేశాల పర్యటనకు బయలుదేరి వెళ్ళారు. రావటానికి పది రోజులు పడుతుంది. నేను పి.ఎమ్. కార్యాలయంతో టచ్‌లోనే ఉన్నాను. అపాయింట్‌మెంట్ దొరగ్గానే ఢిల్లీ వెళ్దాం" అన్నారాయన.

"అలాగే సర్. ఇక నేను వెళ్ళొస్తాను" అంటూ లేచాడు కార్తికేయ. వెంటనే "నో నో నో" అంటూ అభ్యంతరం చెప్పారు రాజావారు.

"తొందరేముంది? భోంచేసి వెళ్దాగాని లేదా సాయంత్రం ఇద్దరూ కలిసే వెళ్ళొచ్చు" అన్నారు.

"లేదు సర్. భోంచేసి నేను వెళ్ళిపోతాను. సంజనా ఇక్కడే ఉంటుంది" అన్నాడు వెంటనే కార్తికేయ.

రాత్రిలాగే ఈ రాత్రీ తన గదిలోకి వచ్చేస్తుందన్న భయంతో అలా చెప్పాడతను. అయిందేదో అయింది ఇకనుండైనా కాస్త నిగ్రహంగా ఉండాలన్నది అతని ఉద్దేశం... కాని సంజనాకు ఆ మాటలు రుచించలేదు. ముఖం ముడుచుకుంది. కోపం పొంగుకొచ్చింది. "కార్తీ! నేను అలా చెప్పానా. ఇక్కడే ఉండిపోతానని నీతో చెప్పానా? అలాగయితే పద. ఒక్కక్షణం కూడా ఇక్కడుండను. ఇప్పుడే మనింటికి వెళ్ళిపోదాం" అంది రోషంగా.

అభివృద్ధిలో ఆంధ్రప్రదేశ్ మిగతా ప్రపంచానికి ఆదర్శంగా రూపుదిద్దుకోవాలి.

-బిల్‌గేట్స్, మైక్రోసాఫ్ట్ స్థాపకుడు



కార్తికేయ గుండెలు దబదబా కొట్టుకున్నాయి. ఏమిటీ అమ్మాయి పెళ్ళిగాకుండానే మన ఇల్లు అంటోంది. రాజావారు ఏమనుకుంటారోనన్న బిడియంతో "అదికాదు సంజూ. నువ్విక్కడుంటేనే సేఫ్ గదా?" అంటూ నచ్చచెప్పాలని చూశాడు.

"ఏంటి సేఫ్. జరిగింది చూసి కూడా ఎందుకిలా చెపుతున్నావ్? నన్ను పక్కనపెట్టాలని చూడకు కార్తీ. ఊరుకోను..." సంజనా కోపం చూసి ఫక్కున నవ్వేశారు రాజావారు.

"ఊరుకోతల్లీ. ఏదో తమాషాకి అలా చెప్పాడు. కోపం దేనికి? నీకు ఎక్కడ ఉండాలనిపిస్తే అక్కడే ఉండొచ్చు. ముందు కార్తీని లోనకు తీసుకురా. భోంచేసి విశ్రాంతి తీసుకున్నాక తీరిగ్గా పోట్లాడుకోవచ్చు పదండి" అంటూ ప్యాలెస్‌లోకి దారితీశారు రాజా విష్ణుచంద్రగజపతి మహదేవ్.

సంజనా, కార్తికేయలు వాదులాడుకొంటూనే ఆయన్ని అనుసరించారు.

ఇక్కడ కార్తికేయ ఆలోచనలు కూడా వేరుగా ఉన్నాయి. సంజనా ఎవరో ఇప్పుడు అందరికీ తెలిసిపోయింది. ఎంత సాధారణ దుస్తుల్లో తిరిగినా పర్లాకిమిడిలో రాకుమారిగా ఆమెను చూసినవాళ్ళు గుర్తించే అవకాశం ఉంది.

ప్యాలెస్‌లో కుట్రలు పురుడుపోసుకుంటున్న ఈ తరుణంలో తను సంజనాతో వచ్చిపోతున్న విషయం ఎంత గోప్యంగా ఉంటే అంతమంచిది కాబట్టి ఇక మీదట కలిసి తిరక్కూడదని నిర్ణయం తీసుకున్నాడు. ఈ ఆలోచనలతోనే మధ్యాహ్నం భోంచేసి తన బైక్‌మీద ఇంటికి వెళ్ళిపోయాడు కార్తికేయ.

వెళ్ళేముందు సంజనాకు స్పష్టంగా హెచ్చరించాడు. చీకటిపడ్డాక రాత్రి ఏడుగంటలకు బయలుదేరమని. అంతా బాగానే ఉందిగాని ఇంటికి వెళ్ళిపోడంలో కార్తికేయ తనకు తెలీకుండానే ఒక తప్పు చేశాడు. వెళ్ళకుండా ఉండివుంటే ప్యాలెస్‌లో మరో దారుణమైన కుట్ర బయటపడి ఉండేది.

చెప్పినట్టుగానే ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకి రాజగురువు మున్నలూరు కృష్ణశాస్త్రి రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ మరోసారి సమావేశమయ్యారు. ఈసారి ప్లేస్ మార్చారు.

తన రాజమందిరంలోని ఆంతరంగిక సౌండ్‌ప్రూఫ్ మందిరంలో కూర్చున్నారు. ఇక్కడయితే బయటి వాళ్ళకు తమ మాటలు విన్పించే అవకాశంలేదు.

మొదట అక్కడ రాజావారు, రాజగురువు కృష్ణశాస్త్రి ఇద్దరే ఏకాంతంగా కూర్చున్నారు. ఇక అతను చూసిన జాతకాలు భేషుగ్గా కలిశాయి. ఎలాంటి సమస్యా లేదు. జాతకులు ఇద్దరికీ నిశ్చింతగా పెళ్ళి జరిపించవచ్చని సూచించాడు కృష్ణశాస్త్రి.

అలా కృష్ణశాస్త్రి ఫలితాలు చెపుతుండగానే ఏదో విషయం చెప్పటంకోసం బావమరిది సూర్యప్రకాశవర్మ లోనకొచ్చాడు. అంతలో సంజనా కూడా లోనకొచ్చి తలుపు మూసింది. ఎందుకో ఈ సమావేశంలో బావమరిది సూర్యప్రకాశవర్మ కూడా దగ్గర వుంటే మంచిదనిపించింది. అందుకే అతన్ని కూడా కూర్చోమని చెప్పారు రాజావారు.

సంజనాను వెనక్కి పంపించేయాలని ఆలోచించి కూడా ఆ పని చేయలేదు. అంతా టేబుల్‌చుట్టూ కూర్చునున్నారు. సూర్యప్రకాశవర్మకు సగం అర్థమైంది సగం అర్థంకాలేదు.

కృష్ణశాస్త్రిని, రాజావారిని మార్చి మార్చి చూశాడు. "ఇంతకీ బావగారూ, ఈ జాతకాలు ఎవరివో తెల్సుకోవచ్చా?" ఇక ఆత్రం ఆపుకోలేక అడిగేశాడు.

"ఇవాళ గాకపోతే రేపయినా మీకు తెలియాల్సిందే. అందుకే కూర్చోమన్నాను. మా ప్రియపుత్రికకోసం వరుని ఎంపికచేస్తున్నాం" చెప్పారు రాజావారు.

సంజనా మౌనంగా చూస్తూ కూర్చుంది.

"వరుడెవరు? ఏ సంస్థానాధీశుడు బావగారూ?" కుతూహలంగా అడిగాడు సూర్యప్రకాశ వర్మ.

"వర్మా...! ఒక్కోసారి ఆచారాల్ని పక్కనబెట్టక



## తెలుగు అంటే ఇష్టం

బార్బీబొమ్మ మాదిరి తీరుగా, సరయిన ఒంపుసొంపులతో, అంతకుమించిన క్రేజీ నవ్వులతో కనపడే కేథరిన్‌కు టాలీవుడ్ అంటే బోల్డెంత ఇష్టం అట. మామూలుగా ఆధునిక వస్త్రధారణలో విందుచేసే ఈ పిల్ల తెలుగు సంప్రదాయక వస్త్రాలన్నా అమిత ఇష్టం అంటోంది.

"నా మాతృభాష తెలుగు కాకపోయినా ఇక్కడే నాకు చాలా గుర్తింపు వచ్చింది. అందుకే టాలీవుడ్‌కే నా తొలి ప్రాధాన్యం.

తెలుగుభాషను కూడా బాగా నేర్చుకుంటున్నాను. ఓ ట్యూటర్‌ను సైతం పెట్టుకున్నా. భవిష్యత్‌లో నా పాత్రకు నేనే డైలాగులు చెప్పాలన్నది నా కోరిక" అంటున్నది.



## అన్నిపనులకూ సమయం

'సమయం లేదు' అన్న మాట అందాల రాశీ ఖన్నాకు అస్సలే నచ్చదట.

సమయపాలన ఉండాలే కాని, అన్ని పనులకూ సమయం చిక్కుతుందనేది రాశి నమ్మకం.

"సరయిన ప్రణాళిక ఉంటే అన్ని పనులకూ సమయం వుంటుంది. ఇంట్లో వస్తువులు సర్దుకునే చిన్నచిన్న పనులకు కూడా సమయాన్ని కేటాయిస్తుంటా. చిన్నతనంనుంచిగల పుస్తకాలు చదివే అలవాటును కొనసాగిస్తున్నాను.

కుటుంబసభ్యులతో సమయాన్ని గడపగలుగుతున్నా. కాకపోతే ప్రపంచాన్ని చుట్టిరావాలన్న కోరిక తీరడంలేదు. దానికి కొంత ఎక్కువ సమయాన్ని కేటాయించాలి కదా" అంటోంది.

తప్పదు. వరుడు సంస్థానాధీశుడు కాదు. నీకును తెలిసినవాడే" అన్నారు రాజావారు.

"తెలిసినవాడా... ఎవరు?"

"ఇంకెవరు? కార్తికేయ"

కారికేయ పేరు వినగానే సూర్యప్రకాశవర్మ ముఖం ఒక్కసారిగా మాడిపోయింది.

"బావగారూ! మీరు తప్పుచేస్తున్నారు. తరతరాలుగా మన రాజకుటుంబాల్లో ఆచారాల్ని పద్ధతుల్ని పక్కనపెడుతున్నారు. ఇది సరి కాదు. రాచనెత్తురు కలుషితంగాకూడదని ఒక రాజ కుటుంబం మరోరాజకుటుంబంతోనూ ఒకసంస్థానం మరో సంస్థానంతోనూ ఇంతవరకు సంబంధబాంధవ్యాలు నెరుపుతూవచ్చాము.

అలా కానిపక్షంలో బంధువర్గంలో జరగాలి.అంతదేనికి మీరు వివాహమాడింది కూడా విజయపురం సంస్థానాధీశులమైన మా అక్కగారు సులక్షణాదేవినే గదా. దాయాదుల పోరుతో సంస్థానం చేజారటంతో మేము మీ పంచన చేరాల్సివచ్చింది.

కార్తికేయ ఒక అనాథ. వెనకాముందూ ఎవరూలేని ఏకాకి. పర్లాకిమిడి సంస్థానం వేసిన భిక్షతో చదువుకొని పైకి వచ్చినవాడు. ఇప్పుడు కూడా అతను ఏ ఉద్యోగం చేస్తున్నాడో నాకు తెలీదు.

రాకుమారి లండన్ నుంచి వచ్చి మాకు ఎవరికీ తెలీకుండా కార్తికేయవద్ద సెక్రటరీగా ఉద్యోగంలో చేరటమే ఒక విడ్డూరం.సంస్థానానికి అతడ్నిఅల్లుడిగా నిర్ణయించటం అంతకన్నా విడ్డూరం.

అంతగా మీరు మేఘనకు వివాహం జరిపించాలంటే మా కొడుకు లేడా? ఆస్ట్రేలియాలో డాక్టర్‌గా డబ్బు,పేరుకూడా సంపాదించుకొని సెటిలయ్యాడు. వాడితో జరిపించండి" అంటూ మనసులో మాట బయటపెట్టాడు సూర్యప్రకాశవర్మ.

ఆ మాటలు ఓపిగ్గా విన్నారు రాజావారు.

కొంచెం కూడా కోపం తెచ్చుకోలేదు.

చెరగని చిరునవ్వుతో "చూడండి వర్మగారూ...! మా కుమార్తె మనసులో కార్తికేయ ఉన్నాడు. ఎక్కడో ఉన్న మీ కొడుకు తన మనసులోలేడు.కాబట్టిఅలాంటి ఆలోచనలు చేయకండి.కార్తికేయ అన్నివిధాలా తగినవాడని కృష్ణశాస్త్రిగారు చెపుతున్నారు" అన్నారు.

"మీరు అనాథ అయిన ఆ కార్తికేయకు ఎక్కువ చనువిచ్చినప్పుడే అనుకున్నాను, ఇలాంటిదేదో జరుగుతుందని. ఎక్కడ పుట్టాడో ఎక్కడ పెరిగాడో తెలీదు. తల్లిదండ్రులెవరో తెలీదు. ఏ కులమో అంతకన్నా తెలీదు. సంస్థానం ఆదుకోకుంటే ఎక్కడో బికారిలా తిరగాల్సినవాడు. అలాంటి అనామకుడి చేతిలో"

అంతవరకూ ఓపికగా వింటున్న సంజనా ఇక సహించలేకపోయింది. కోపంతో "మావయ్యా" అని అరుస్తూ చివ్వున లేచింది. అదిరిపడి మాటలు మింగేశాడు సూర్యప్రకాశవర్మ.

"మీరు ఎక్కువ మాట్లాడుతున్నారు. నా కార్తీని ఇంకొక్కమాటన్నాసహించను. ఎవరు అనాథ? ఎవరు బికారి? నా చేయి అందుకున్నాక కూడా తను అనాథ ఎలా అవుతాడు...?" అంటూ కోపంతో అరిచింది.

"మేఘనా ప్లీజ్..." అంటూ వారించారు రాజావారు.

"మావయ్యకు అసలు విషయం తెలియక అలా మాట్లాడుతున్నారు. నాకు తెలుసు. కార్తికేయ అనాథ కాదు. బికారి అంతకన్నా కాదు. అంతా వుండీ అనాథలా పెరిగాడంతే" అన్నారు బాధగా.

సూర్యప్రకాశవర్మ విస్తుపోయాడు.

సంజనా ఆశ్చర్యానికి అంతులేదు.

తన తండ్రికి చాలా విషయాలు తెలుసు. ఇంత వరకు చెప్పకుండా దాచారనిపించింది. ఈ గొడవలు గందరగోళంగా ఏమీ అర్థంగాకుండా చూస్తోంది రాజ గురువు కృష్ణశాస్త్రి. ఎవరూ చెప్పకపోయినా సంజనా వెంట ఉదయం చూసిన చాకులాంటి యువకుడే కార్తికేయ అని ఇప్పుడిప్పుడే ఆయనకర్థమవుతోంది.

"బావగారూ! ఏమిటి మీరంటున్నది. కార్తికేయ ఎవరో మీకు ముందే తెలుసా?" విభ్రాంతి చెంది అడిగాడు సూర్యప్రకాశవర్మ.

సంజనా కూడా షాక్‌తో తండ్రినే చూస్తూ తిరిగి సీట్లో కూర్చుంది.

"డాడీ...! నిజంగా కార్తికేయ ఎవరో మీకు తెలుసా?" అని అడిగింది.

"తెలుసు. నాకు అంతా తెలుసు" అని అన్నారు పొడిగా రాజావారు.

"ఎవరతను?" అడిగింది.

"ఇంతవరకు నా మనసులోనే దాచుకున్న రహస్యమిది. సమయం వచ్చాకే కార్తికేయతో చెప్పాలనుకున్నాను. మీరుకూడా చెప్పనంటేనే చెప్తాను"

"ప్రామిస్ చేస్తున్నాను డాడీ. నేనుగా ఈ విషయం కార్తికేయకు చెప్పను. చెప్పండి డాడీ"

"ఎవరో కాదమ్మా, స్వయానా నాకు మేనల్లుడు. నీకు బావ. నా చెల్లెలు ఉమామహేశ్వరీచంద్రబాల కొడుకు. అది వింటూనే సూర్యప్రకాశవర్మకు పెద్ద షాక్. తన చెవుల్ని నమ్మలేనట్టు కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూశాడు. ఏనాడో జరిగిన పాతికేళ్ళకిందటి మాట. తిరిగి ఇప్పుడు వినాల్సివస్తుందనుకోలేదు.

అప్పట్లో పర్లాకిమిడి సంస్థానాధీశుడైన రామచంద్ర గజపతి మహాదేవ్‌కి ఒక కొడుకు, కూతురు ఇద్దరే సంతానం. కొడుకు విష్ణుచంద్రగజపతి మహాదేవ్‌కి సోదరి ఉమామహేశ్వరీచంద్రబాల అంటే ప్రాణం.

అన్నాచెల్లెళ్ళిద్దరూ అన్యోన్యంగా ఉండేవారు.బాగా చదువుకున్నారు. యుక్తవయస్సులో అడుగుపెట్టారు. అప్పట్లో తమ విజయపురి సంస్థానంతో పర్లాకిమిడి సంస్థానానికి మంచి స్నేహబంధాలుండేవి.

తన అక్కగారైన సులక్షణాదేవిని విష్ణుచంద్ర గజపతి మహాదేవ్‌కి అలాగే ఆయన చెల్లెలు ఉమామహేశ్వరీ చంద్రబాలను తనకూ ఇచ్చి కుండమార్పిడి పద్ధతిలో వివాహాలు జరిపించాలని పెద్దలు నిశ్చయించారు. ఒక్కోసారి మనం అనుకున్నవి అనుకున్నట్టు జరగవు.

ముహూర్తములు నిశ్చయించేలోపలే ఉమామహేశ్వరీ చంద్రబాల ఎవరినో ప్రేమించి లేచిపోయిందని తెలిసింది.

**ఇంకా ఉంది**



**కాంగ్రెస్ సెక్యులర్ పార్టీ...అది ఈ మధ్యనే కొత్త అధ్యక్షుడిని ఎన్నుకుంది.**

-డి.రాజా, సి.పి.ఐ. నేత

# అవాంఛితానికి చెక్

శరీరంపై ఎక్కడైనా అవాంఛిత రోమాలున్నప్పుడు అవి చికాకుపెడుతుంటాయి. తరచూ వాటిని తొలగిస్తూ పోవడం అన్నా కొన్నిసార్లు విసుగ్గా అనిపించవచ్చు. ఇటువంటివారు శాశ్వత పరిష్కారంకోసం లేజర్ చికిత్సలకు ప్రాధాన్యం ఇస్తుంటారు.

అయితే, ఈ చికిత్సపట్ల చాలామంది మహిళల్లో అనేక సందేహాలు పొడచూపుతుంటాయి. లేజర్ హెయిర్ రిమూవల్ మంచిదా? కాదా? సమస్యలెదురవుతాయా?అన్న సంశయాలకు వివరాలు తెలుసుకుంటే కొంత అవగాహన ఏర్పడుతుంది.

**ఎంతవరకు సురక్షితం :** పూర్తిగా సురక్షితమైనదే. కాకపోతే ఈ పద్ధతివాడే టెక్నాలజీ, టెక్నిక్‌లు ఫలితాలను నిర్దేశిస్తాయి. క్లినికల్‌గా పరీక్షించిన చికిత్స ఇది. పేషెంట్ల రక్షణకు సంబంధించి విస్తృత ప్రయత్నాలు, ప్రయోగాలు సాగించిన థెరపీ.



Courtesy : HAIR IMAGE : SHUTTERSTOCK.COM

## రేడియేషన్ ప్రభావం

లేజర్ ద్వారా వచ్చే రేడియేషన్ శరీరానికి హాని కలిగిస్తుందేమోననే భయసందేహాలూ వుంటుంటాయి. లేజర్ క్యాన్సర్‌కు కారణం అవుతుందని అపోహపడేవారూ లేకపోలేదు.

కానీ ఇది నిజంకాదు. లేజర్ చికిత్స ఎఫ్‌డిఎ ఆమోదం పొందిన మెడికల్ గ్రేడ్ లేజర్ సొప్రానో ఐస్ ప్లాటినం దీనిలోని కాంతి జుట్టుకుదురు ఎంత లోతుగా వుంటుందో అక్కడి దాకా మాత్రమే చొచ్చుకుపోతుంది.

వెంట్రుకలోని పిగ్మెంట్‌ను మాత్రమే లక్ష్యం చేసుకుంటుంది. కాబట్టి చర్మం లేదా శరీరంలోని పరిసర టిష్యూలకు ఏ విధంగానూ హానిచేయదు.

**నొప్పి ఉంటుందా :** సొప్రానో ఐస్ ప్లాటినం ఉపయోగిస్తూ చేసే లేజర్ హెయిర్ రిమూవల్ పూర్తిగా నొప్పిలేని ప్రక్రియ. చికిత్స జరుగుతున్నప్పుడు ఆ ప్రదేశంలో వేడిగా ఉన్నట్లు అనిపిస్తుంది.

అయితే, లేజర్ పనిచేస్తున్నప్పుడు అదే సమయంలో ఆ ప్రదేశాన్ని చల్లబరిచే కూలింగ్ టిప్‌కూడా మెషిన్‌కు ఉంటుంది.

సొప్రానో ఐస్‌ప్లాటినం టెక్నాలజీలో, ఒకే మెషిన్‌లో మూడు విభిన్న లేజర్ తరంగాలుంటాయి. ఒకేసారి జుట్టుకుదురులోపల విభిన్న టిష్యూలోతులనులక్ష్యంగా చేసుకుని పనిచేస్తాయి.

దీనివల్లప్రస్తుతం ప్రపంచంలోనే లభించే హెయిర్ రిమూవల్ చికిత్సల్లో ఇది అత్యంత సురక్షిత పద్ధతిగా గుర్తింపు పొందింది. అన్నిరకాల చర్మతత్వంగల వారికి ఇది సూటవుతుంది.

ముఖం, శరీరంపైగల అవాంఛితరోమాలను శాశ్వతంగా తొలగించడంలో ఖచ్చితమైన, నొప్పిరహిత ఫలితాలను ఇవ్వగల చికిత్స ఇది.

**ఖరీదైనదా :** లేజర్ హెయిర్ రిమూవల్ బాగా ఖరీదైనదని చాలామంది భావిస్తుంటారు. ఏళ్ళతరబడి వ్యాక్సింగ్ కోసం వెచ్చించే సమయాన్ని, డబ్బును లెక్కలుకడితే, శాశ్వతంగా ఒకేసారి తొలగించుకోవడానికి అయ్యే ఖర్చు తక్కువకిందే అనుకోవాలి.

**శాశ్వత పరిష్కారమా:** అవాంఛితరోమాల తొలగింపులో లేజర్ చికిత్స శాశ్వత పరిష్కారమే. ఒకసారి ఓ వెంట్రుక కుదురును నశింపజేశాక, తిరిగి అది పెరగదు. రోమాల్ల ఎదుగుదల హార్మోనల్ మార్పులను బట్టి ఫలితాలు భిన్నంగా వుంటాయి.

శరీరంపై ఆరుసెషన్లు అవసరం అవుతాయి. క్రమంతప్పని సమయపాలన అనుసరించాలి. 80 నుంచి 90 శాతం రోమాలు తొలగిపోతాయి.

శరీరంపై, ముఖంలో ఏ ప్రదేశంలోనైనా లేజర్ చికిత్స తీసుకోవచ్చు.

సొప్రానో ఐస్ ప్లాటినం అన్ని రకాల చర్మతత్వాలకు, అన్ని శారీరక ప్రదేశాలకు సూటవుతుంది.

## ఎవరికి వద్దు?

లేజర్ చికిత్స చేయడానికి ముందు పూర్తి వైద్య సంప్రదింపులను, క్లయింట్ వైద్యచరిత్రను సమీక్షించడం సాధారణంగా జరుగుతుంది. గర్భవతులకు, పాలిచ్చే తల్లులకు చెయ్యకూడదు.

వారిలో హార్మోన్లలో హెచ్చుతగ్గులు ఎక్కువగా వుంటుంటాయి. తెల్లగా, బ్లాండ్‌గా లేదా లైట్ కలర్‌లో వెంట్రుకలుంటే వారికి చికిత్స అంతగా ఉపకరించదు. ఎందుకంటే లేజర్ వెంట్రుకలోని డార్క్ పిగ్మెంట్‌ను టార్గెట్ చేస్తుంది.

పదహారేళ్ళు దాటినవారెవరైనా లేజర్ హెయిర్ రిమూవల్ చికిత్సకు అర్హులే.




# కోటా

ఆఫీసులో శంకరం పేరు ప్రమోషన్ జాబితాలోకి వచ్చింది. అది సీనియారిటీని బట్టి మామూలుగానే వచ్చింది. ప్రమోషను మాత్రం మామూలుగా రాదు. మామూలుతోనే వస్తుంది. అది బాస్‌కివ్వాలని అతడికి తెలుసు.

ఎలాగివ్వాలో తెలియక ఆలోచిస్తుండగా సీనియర్ కొలీగ్ రాధాకృష్ణ అతణ్ణి పిలిచి కంగ్రాట్యులేషన్స్ చెప్పి, "ఈ ప్రమోషన్ పూర్తిగా బాస్ చేతుల్లో ఉంది. ఇక్కడ నీకో విషయం చెప్పాలి. మన సమాజంలో పెద్ద హోదా వాళ్ళందరికీ రకరకాల డీల్సుంటాయి.

ఒకో డీల్‌కి ఒకో దళారి ఉంటాడు. మన ఆఫీసులో ప్రమోషన్లకి బాస్‌కి దళారి ఎవరో కాదు, మీ పక్క వీధిలోని నాయక్. ఆయన్ని కలుసుకో, పనైపోతుంది" అన్నాడు రాధాకృష్ణ. రోజూ ఉదయం వాకింగులో కనబడే నాయక్ తన బాస్‌కి దళారి అని తెలియగానే "రేపుదయమే ఆయన్ని కలుసుకుని ఈ విషయం ప్రస్తావిస్తాను" అన్నాడు శంకరం ఉత్సాహంగా.

"నాయక్ అంతసులభంగా లొంగడు.నేనో మార్గం చెబుతాను. నాయక్‌కి మిర్చిబజ్జీ మహా ఇష్టం. ఓరోజు మీ ఇంటికి పిలిచి రుచికరమైన బజ్జీలు తెచ్చి నైవేద్యంగా పెట్టి కడుపారా తినిపించు. ఇట్టే ప్రసన్నుడౌతాడు. అప్పుడు విషయంచెప్పు" అన్నాడు.

అప్పుడు శంకరానికి మేనత్త సుభద్ర గుర్తుకు వచ్చింది. ఆవిడ వంటలకి పెట్టింది పేరు.

మిర్చిబజ్జీ ఆవిడ స్పెషాలిటీ.మర్నాడు సాయంత్రం మిర్చిబజ్జీలకి ఇండెంట్ పెట్టాడు.

ఆవిడొప్పుకున్నాక మర్నాడుదయం వాకింగులో నాయక్‌ని పలకరించి ఆ సాయంత్రం తనింటికి రమ్మనిఆహ్వానించాడు.దళారికదా, ఇలాంటిపిలుపులాయనకి కొత్తకావు. ఏ పిలుపులో ఏ సంబరముంటుందోనని సరేననడమే తప్ప ఎందుకనడగడం ఆయనకి అలవాటు లేదు. ఆ సాయంత్రం శంకరం ఇంటికెళ్ళాడు.

శంకరం ఆయన్ని మర్యాదగా సోఫాలో కూర్చోబెట్టి, మాట వరసకి కుశల ప్రశ్నలు అయ్యాయనిపించాక లోపలికెళ్ళి ఓ ప్లేటునిండా మిర్చిబజ్జీలు తెచ్చి ఆయన ముందుపెట్టి, "ఇలాంటివి జీవితంలో ఎక్కడా తినుండరు. మా అత్తయ్య చేసింది"అంటూ వాటి చరిత్రని చాగంటి వారంత మనోహరంగా చెప్పాడు.

నాయక్ ప్లేటు అందుకోలేదు. "అంతా నా దురదృష్టం. ఇక్కడికొచ్చేముందే ఎవరో మా ఇంటికొచ్చి మిర్చిబజ్జీ ఇచ్చి వెళ్ళారు. అవి తినే ఇక్కడికొస్తున్నాను" అన్నాడు నిట్టూర్చి.

అంటే తనకంటేముందే ఎవరో ఆయనపై మిర్చిబజ్జీ సమ్మోహనాస్త్రం ప్రయోగించి వెళ్ళారని అర్థమైన శంకరం హతాశుడయ్యాడు. కానీ వెంటనే తమాయించుకుని "అవి వేరు. ఇవి వేరు. ఒక్కటి తిని చూడండి. ఈ ప్లేటుతర్వాత ఇంకో ప్లేటు తెమ్మనకపోతే నన్ను అడగండి" అన్నాడు.

నాయక్ చలించలేదు. "వెరీ సారీ! ఈరోజుకి మిర్చిబజ్జీ విషయంలో నాకోటా ఐపోయింది. కోటా విషయంలో నేను చాలా స్ట్రిక్ట్" అన్నాడు.

"నో నేను ఎవరింటికైనా నెలకోసారే వెడతాను. ఈ నెలకి మీ కోటా ఐపోయింది" అనేసి వెళ్ళిపోయాడు నాయక్.

అప్పుడు శంకరానికొచ్చిన ఏడుపు మొహం మరునాటిదాకా అలాగే ఉండిపోయింది. అదే మొహంతో జరిగింది ఆఫీసులో రాధాకృష్ణకి చెప్పాడు. ఆ ఏడుపు మొహం మార్చు. నీకు ఇంకో ఉపాయం చెబుతాను" అని అన్నాడు.

"నాకు తెలిసి ఆయన ప్రతి శుక్రవారం ఉదయం గాంధీ పార్కుకి వెళతాడు. యథాలాపంగా అన్నట్లు అక్కడికి వెళ్ళి ఆయన్ని పలకరించు.

నాయక్ మంచి హాస్యప్రియుడు. జోక్సు చెప్పి కడుపుబ్బ నవ్వించేవాళ్ళంటే మహా ఇష్టం. నాలుగైదు మంచి జోక్సు వినిపించు. నచ్చేసి నవ్వాడా, ప్రసన్నుడవడం గ్యారంటీ" అన్నాడు రాధాకృష్ణ.

శంకరానికి జోక్సు చెప్పడం రాదు. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూవుండగా, బాల్యమిత్రుడు హాసన్ గుర్తుకువచ్చాడు అతనికి. తను నవ్వకుండా ఎదుటి వాళ్ళని పొట్ట చెక్కలయ్యేలా నవ్వించే కళ అతడికి తల్లి పొట్టలో ఉండగానే అబ్బిందంటారు.

ఇప్పుడిది సమస్యల యుగం కదా! హాసన్ తన వృత్తిలో ఎంత బిజీ ఐపోయాడంటే, శంకరాన్ని పలకరించి రెండేళ్ళయింది. శంకరమూ పట్టించుకోలేదు. కానీ ఇప్పుడు అవసరం వచ్చిందికాబట్టి హాసన్‌కి ఫోన్ చేసి "ఓ గంటసేపు ఓ మనిషిని నవ్వించాలి. ఉత్తినే కాదు. నీ ఫీజెంతో చెప్పు" అన్నాడు.

"నిన్ను ఫీజడగను. ఎటొచ్చీ రెండు నెల్లదాకా నా అపాయింట్‌మెంట్స్ ఛార్ట్‌ఫుల్. ఎక్కడా ఖాళీ లేదు. అయినా బాల్యమిత్రుడివి నిన్ను కాదనలేను కాబట్టి,

వసుంధర

ఓ గంట ఎక్కడో అడ్జస్ట్ చేస్తాను. మరి నాకు ఇరవై నాలుగు గంటలు అడ్వాన్సుగా చెప్పాలంతే" అన్నాడు హాసన్. శంకరం సరేనని అతణ్ణి శుక్రవారం ఉదయం ఆరింటికి గాంధీ పార్కుకి రమ్మన్నాడు.

శుక్రవారం ఉదయం ఆరింటికి శంకరం, హాసన్ గాంధీ పార్కుకి వెళ్ళారు. ఆ సమయానికి నాయక్ ఓ బెంచీమీద కూర్చుని ఆయాసపడుతున్నాడు.

శంకరం అధాతుగా చూసినట్లు మొహం పెట్టి "అరే, మీరిక్కడ?" అని పలకరించి, ఆ వెంటనే హాసన్‌ని పరిచయం చేశాడు. నాయక్ అతడితో కరచాలనంచేసి బెంచీమీద కాస్త పక్కకి జరిగాడు. వాళ్ళు కూర్చున్నాక, "నేను జోక్సంటే చెవి కోసుకుంటాను. అందుకే మా ఇంట్లో చాకులు, బ్లేళ్ళు నాకు అందుబాటులోకి రానివ్వరు" అన్నాడు.

ఆయన్ని ఇంప్రెస్ చెయ్యడానికి అదే సమయమనిపించింది శంకరానికి. వెంటనే, "అబ్బా ఏం జోకండీ!" అని పొట్ట పట్టుకుని మరీ నవ్వడం మొదలెట్టాడు.

నాయక్ అతణ్ణి చిరాగ్గా చూసి "మీరు నవ్వాపితే, నేను హాసన్‌గారి జోక్సు వింటాను" అన్నాడు.

శంకరం నవ్వు స్విచాఫ్. హాసన్ వెంటనే టైమ్ చూసుకున్నాడు. అతడికి టైమంటే బంగారం. అందుకని మరి జాప్యం చెయ్యకుండా, జోక్స్ చెప్పడం మొదలెట్టాడు. శంకరం జోక్సు వింటున్నాడు కానీ అతడి దృష్టంతా నాయక్‌మీదే ఉంది.

ఆయన నవ్వాలి. ప్రసన్నుడు కావాలి. తనకి సాయం చెయ్యాలి. కానీ హాసన్ వరుసగా జోక్స్ చెబుతుంటే, నాయక్ క్లాసులో లెక్కల మేస్టారి పాఠం వింటున్నవాడిలా ముఖం అతి గంభీరంగా పెట్టాడు. ముఖంలో ఎక్కడా నవ్వు ఛాయలు లేవు.

జోక్సునే వృత్తిగా చేసుకుని లక్షలార్జిస్తున్న హాసన్ జోక్సులో నిజంగా పసలేదా అని అనుమానమొచ్చి, ఈసారి దృష్టి హాసన్‌మీద పెట్టాడు. మొదటి జోక్ వినగానే నవ్వాపుకోలేక నాయక్‌ని చూస్తే ఆయన మొహం ఎప్పటిలాగే మహాగంభీరంగా ఉంది.

అలా అరగంట గడిచాక హాసన్ జోక్స్ చెప్పడం మానేశాడు. నాయక్ వెంటనే "మీ జోక్సు చాలా బాగున్నాయి. ఆపేశారేం, మరికాసిని చెప్పండి..." అన్నాడు గంభీరంగా.

"వాడేమో వినలేనట్లు చెవులు మూసుకున్నాడు. మీరేమో ఆర్టఫిల్మ్ చూస్తున్నట్లు గంభీరంగా చూస్తున్నారు. ఇలాంటి పరిస్థితి నాకు కొత్త. కాసేపుంటే పూర్తిగా డీమోరలైజ్ ఐపోతాను. నా వృత్తికే మోసమొచ్చేలా ఉంది" అన్నాడు హాసన్ నిరుత్సాహంగా.

నాయక్ నొచ్చుకుని "అయ్యో, మీరలా అనుకున్నారా? మీ జోక్సు నిజంగా అద్భుతం. మరొకప్పుడైతే పొట్టపట్టుకుని నవ్వేవాణ్ణి. కానీ ఇందాక లాఫింగ్ క్లబ్బులో నవ్వి నవ్వి మీరొచ్చేముందే, ఇక్కడికొచ్చి కూర్చున్నాను. నా నవ్వులకి ఈ రోజు కోటా అయిపోయింది. "హతోస్మి" అనుకున్నాడు శంకరం. అంటే నాయక్ నవ్వుకి కూడా కోటా ఉందన్నమాట!

అక్కణ్ణించి బయటపడ్డాక, శంకరం హాసన్‌కి కోటా విషయమై నాయక్‌తో తన పూర్వానుభవం చెప్పాడు. పార్కులో హాసన్ జోక్సుకి చెవులు మూసుకున్నందుకు సంజాయిషీ ఇచ్చాడు-

"నేనేమో నీ టైమ్ తినేశాను. నువ్వేమో బాగా హర్టయ్యావు. సారీరా!" అన్నాడు.

నాయక్ ఆత్మీయంగా అతడి భుజంతట్టి, "విషయం తెలిసిందిగా, నువ్వు నాకు సారీ చెప్పడం కాదు. నేనే నీకు థాంక్స్ చెప్పాలి. జోక్సుకి నాకిప్పుడో కొత్త సబ్జెక్టు దొరికింది" అని వెళ్ళిపోయాడు.

ఈ అనుభవాన్ని రాధాకృష్ణకి చెబితే, హాసన్‌ని చిన్నబుచ్చినట్లవుతుందనుకున్న శంకరం-

"యోగముంటే ప్రమోషన్ దానంతటదే వస్తుంది" అని సరిపెట్టుకుని ఇక నాయక్‌ని కల్సుకునే ఆలోచనమానుకున్నాడు. కానీ అనుకోకుండా రెండురోజుల్లోనే అతడు నాయక్‌ని హాస్పిటల్‌లో కలుసుకోవాల్సివచ్చింది.

మార్నింగ్‌వాక్ చేస్తూవుండగానే నాయక్‌ని ఓ కారు గుద్దింది. ఎగిరి అంత దూరాన పడ్డాడు.

డ్రైవింగ్ చేస్తున్న వ్యక్తి సమాజంలో పెద్దమనిషి కానీ బాగా తాగివున్నాడు. యాక్సిడెంటవగానే పొరపాటు గ్రహించి తనే స్వయంగా నాయక్‌ని హాస్పిటల్లో చేర్చాడు. మామూలుగా అయితే ఈ విషయాన్ని వార్తలా విని ఊరుకునేవాడు. కానీ శంకరానికిప్పుడు నాయక్‌ని ఓదార్చడం బాధ్యత అయింది.

ఆయనున్న హాస్పిటల్‌కి వెళ్ళాడు. కదలలేక మంచంమీద పడున్న ఆయన్ను చూస్తే అతడికి జాలేసింది. "ఎలాగుంది సార్" అనడిగాడు.

"దెబ్బలు పైకి కనిపించడంలేదు కానీ, ఒళ్ళు హూనమైపోయింది. ఒళ్ళంతా నొప్పులు, పోట్లు భరించలేకపోతున్నాను" అన్నాడాయన గంభీరంగా.

యాక్సిడెంట్ చేసిన పెద్దమనిషి ఆ వెనకాలే ఉన్నాడు. ఈ మాటలు విన్నట్లున్నాడు -

"తాగి డ్రైవ్‌చెయ్యడం నా తప్పే. నా కారు ఆయన్ని గుద్దుకోవడమూ నా తప్పే. పొరపాట్లు ఎవరివల్లనైనా జరుగుతాయి. అదృష్టంకొద్దీ ఆయనకి పెద్దగా దెబ్బలు తగల్లేదు. కానీ ఆయన ఆ విషయం ఒప్పుకోవడం లేదు. నాదగ్గర డబ్బు లాగాలనో ఏమో, నన్ను కేసులో ఇరికించాలనో ఏమో, మరి కనిపించని దెబ్బలతో ఒళ్ళు హూనమయిపోయిందంటాడు. నొప్పి భరించలేక పోతున్నానంటాడు. నమ్మే మాటేనా?" అని తన పక్కన వున్న పరిచితుడితో వాపోయాడు.

ఆ మాటలు నాయక్‌కీ వినిపించాయి. ఆయన శంకరాన్ని చూసి "నాకు మా పెదనాన్నదగ్గర బాగా చేరిక. చిన్నప్పటినుంచీ కన్నతండ్రికంటే ఎక్కువగా చేరదీసిన ఆయనంటే నాకు ప్రాణం.

నిన్ననే తెలిసింది ఆయనకి క్యాన్సరని. బ్రతికే అవకాశాలు చాలా తక్కువ అంటున్నారు. చాలాసేపు కన్నీరు మున్నీరుగా ఏడ్చాను.

వారానికి సరిపడ ఏడుపు కోటా నిన్ననే అయిపోయింది. టాంకు ఖాళీ అయిపోతే కుళాయిలో నీళ్ళొస్తాయా? అదీ నా పరిస్థితి" అన్నాడు.

**సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తులు లాగానే బి.జె.పి. ఎమ్.పిలు నోరువిప్పి మాట్లాడే ధైర్యం తెచ్చుకోవాలి.**

*-యశ్వంత్ సిన్హా, బి.జె.పి. నేత*

## ప్రేమలో పడిందండోయ్



అవకాశాలూ తగ్గాయి, చేసిన సినిమాలూ పరాజయం పాలవుతున్నాయి. దీంతో రెజీనా కసెండ్రా కాస్తంత టెన్షన్‌పడుతున్నట్లే ఉంది. అయినా కాని కొన్ని సినిమాలకు నో చెప్తోంది. ఎందుకిలా అంటే రెజీనా చెప్పిన సమాధానం షాకిచ్చింది.

"నటిని కావాలన్నది నా కోరిక. పరిశ్రమకు వచ్చి, నాలోని ప్రతిభను నిరూపించుకోగలిగాను. ఇన్ని సంవత్సరాలలో కెరీర్ ఎన్నో మలుపులు తిరిగింది. ఇటీవల నేను సినిమాలు తగ్గించిన మాట నిజం. ఎందుకంటే నేను ప్రేమలో పడడం అన్న పొరపాటువల్ల ఇలా జరిగింది.

ఇప్పుడు నా దృష్టి అంతా నా కెరీర్‌పైనే ఉంది. వరుస సినిమాలు చేసి నా ప్రతిభను నిరూపించుకుంటా" అంటూ కాన్ఫిడెంట్‌గా చెప్పింది.

# వాళ్ళనూ అడగండి



ఫ్యాషనిస్తా సోనమ్‌కపూర్‌ను ఎవరైనా వ్యక్తిగత విషయాల్ని అడిగితే అస్సలు నచ్చదు. సోనమ్‌ను పెళ్ళి గురించి ప్రశ్నిస్తే కస్సుమంటూ సమాధానం ఇచ్చింది. "బాలీవుడ్ స్టార్ హీరోయిన్లకు ఈ ప్రశ్న తప్పడం లేదు. ఇదే ప్రశ్నను రణవీర్‌సింగ్, రణవీర్ కపూర్ వంటివాళ్ళను అడగరేం?

అలాగే పెళ్ళయి, పిల్లలు పుట్టాక కెరీర్ గురించిన ప్రశ్నలు తారలనే వేస్తుంటారు. పెళ్ళయిన అగ్రహీరోలను కూడా అవకాశాలు ఎలా ఉన్నాయి, తండ్రీ అయ్యాక రీ ఎంట్రీ ఎప్పుడిస్తారు వంటి ప్రశ్నలు వేస్తే బావుంటుంది. పెళ్ళి తర్వాత కూడా తెరపై తమదైన ముద్ర వేస్తున్న తారలు ఎందరో ఉన్నారు కదా?" అంటూ చిరచిరలాడింది.

శంకరం తెల్లబోయాడు. ఏడుపుకికూడా కోటానా? 'ఈ విషయం బాస్‌కి చెప్పాల్సిందే' అనుకున్నాడు.

ఏదేమైనా ఈ కోటాల దళారితో తన ప్రమోషన్ జరిగే పని కాదనిపించింది. ఆ విషయం కూడా రాధాకృష్ణకి చెప్పలేదు. కానీ వారం తర్వాత రాధాకృష్ణ శంకరాన్ని పిలిచి, తనే స్వయంగా నాయక్‌ని పట్టడం విషయంలో ప్రోగ్రెస్ అడిగాడు.

జరిగింది తెలిశాక "భలేవాడివే, ఇది అంతా నాకు చెప్పొద్దూ! బంగారంలాంటి ప్రమోషన్ అంత సులభంగా వదులు కుంటావా?" అన్నాడు.

"ఏమో, యోగముంటే దానంతటదే అవుతుందని వదిలేశాను" అన్నాడు శంకరం.

"యోగానికి వదిలిపెడితే అంతే సంగతులు. నాకో విషయం పక్కాగా తెలుసు. నీ ప్రమోషన్లకి రేటుంది. అదెంతో తెలుసుకునేందుకు నువ్వు నేరుగా నాయక్‌ని కలుసుకో. అడిగిందిచ్చెయ్. పని అయిపోతుంది" అన్నాడు.

శంకరానికి నమ్మకం కుదరలేదు. ఇదేమైనా స్టింగ్ ఆపరేషనైతే అడ్డంగా దొరికిపోతానని భయపడ్డాడు. ప్రమోషన్ మాట అటుంచి ఉద్యోగం కూడా పోవచ్చు. ఆ పైన ఎంత అప్రతిష్ఠ?

ఈ సందేహం విని "నాయక్ మన బాస్‌కొక్కడికేనా దళారి? అతడికి పెద్ద పెద్దవాళ్ళతో డీలింగ్స్ ఉన్నాయి. అతణ్ణి కదిపితే కదిలేది కందిరీగల తుట్టే! మీడియాతోసహా ఎవ్వరూ ఆయన జోలికి వెళ్ళరు. నా మాట విని ఎల్లుండి ఏకాదశినాడు వెళ్ళి ఆయన్ను కలుసుకో. నీకు శుభమవుతుంది" అని ప్రోత్సహించాడు రాధాకృష్ణ.

శంకరంలో మళ్ళీ ఆశ రేగింది. "అదిసరే! మధ్య ఈ ఎల్లుండీ, ఏకాదశీ ముహూర్తమేమిటీ?" అని అన్నాడు. "నీ దగ్గర దాచడం ఎందుకూ? ఆ రోజు ఆయనకి దళారి వ్యవహారాల్లో నలుగురైదుగురి నుంచి, పదిలక్షలదాకా ముట్టనుంది. ఆయన కోటా అంతకంటే ఎక్కువుంటుందనుకోను.

ఆ రోజు కోటా ఐపోయిందనుకో. నీకు ఉత్తినే పని చేసిపెట్టొచ్చు" అన్నాడు రాధాకృష్ణ.

కోటా మాట వినగానే శంకరం నీరసపడిపోయి "ఆయన కోటాలేవీ నాకు కలిసిరాలేదు. ఎల్లుండి నేను వెళ్ళగానే ఈ విషయంలో ఆ రోజుకి తన కోటా అయిపోయిందీ, మళ్ళీ నెల్లాళ్ళదాకా తను ఎవర్నించీ ఏమీ తీసుకోననీ, నన్ను వెనక్కి పంపించేసే అవకాశాలే ఎక్కువ" అన్నాడు.

"ఇంక నేను చెప్పేదేముంది? నీ ప్రమోషన్, నీ ఇష్టం!" అన్నాడు రాధాకృష్ణ విసుగ్గా.

తన ప్రమోషన్ విషయంలో రాధాకృష్ణ మరి కలగజేసుకోడని శంకరానికి అర్థమైంది. దాంతో అతడిలో సందిగ్ధత మొదలైంది. ఇంట్లో భార్యతో చర్చించాడు.

"మీరు అనవసరంగా భయపడుతున్నారు. నా అనుమానం మీ బాస్ తనే రాధాకృష్ణగారిచేత ఈ సలహా ఇప్పిస్తున్నాడని! మీరాలోచించండి. ఈ అవకాశం చేజారిపోతే మళ్ళీ రెండుమూడేళ్ళదాకా మీకు ప్రమోషన్ అవకాశంరాదు" అంది శంకరం భార్య.

నిజమే అనిపించింది శంకరానికి. కానీ అంతలోనే ఓ చిన్న అనుమానం. "బాస్‌కి నామీద ఇంట్రెస్ట్ ఉంటే, మరి నాయక్ రెండుసార్లు కోటా పేరు చెప్పి నన్ను దూరం పెట్టాడెందుకు?" అన్నాడు.

"ఆ కోటా మీ బాస్ పెట్టింది కాదు కదా! ఒకో మనిషిది ఒకో తత్వం. ఈ నాయక్‌ది కోటా తత్వం. మీ విషయంలోనేనా, తన ఏడుపుకీ ఆయన కోటా పెట్టాడని మర్చిపోకండి. మీకు ఆయన కోటాతత్వం బెడిసికొట్టినప్పుడల్లా, మీ బాస్ మీకు రాధాకృష్ణచేత కొత్త సలహా ఇప్పిస్తున్నాడు.

రాధాకృష్ణ ఎల్లుండన్నాడుగా, అప్పుడెళ్ళిచూడండి. నిజంగానే మీ పని చౌకగా కూడా అయిపోతుందేమో!" అంది శంకరం భార్య.

నిజమే! తనకి ప్రమోషన్ రాకపోతే బాస్‌కి వచ్చే లాభం ఏమీలేదు. ఎటొచ్చీ స్వలాభం లేకుండా బాస్ తనకి ప్రమోషన్ ఇవ్వడు. అలా ఆలోచిస్తే భార్య మాటలు శంకరానికి సబబుగా తోచాయి.

ఏకాదశినాడు సాయంత్రం అతడు నాయక్ ఇంటికి వెళ్ళాడు. నాయక్ అతణ్ణి సాదరంగా ఆహ్వానించి, "ఊరక రారు మహాత్ములు" అన్నాడు.

శంకరం కూడా నర్మగర్భంగా, "నేను మహాత్ముణ్ణి కాదు. మహాత్ముడి ఇంటికొచ్చాను" అన్నాడు.

"ఓహో పనిమీదొచ్చారన్నమాట! ఏం కావాలో సూటిగా చెప్పండి" అన్నాడు నాయక్.

శంకరం తన ప్రమోషన్ గురించి సూటిగానే చెప్పాడు. నాయక్ వెంటనే, "ఇది మామూలు పని. మామూలు యాభైవేలు. మీకు వీలేనా?" అన్నాడు.

ఆయన రేటు చెప్పాడు. తను బేరం మొదలు పెట్టాలనుకుని, "కొంచెం తగ్గించగలరా?" అన్నాడు శంకరం. "ఆదాయపు పన్నులో రాయితీలుండొచ్చు. మామూలులో ఉండవు" అన్నాడు నాయక్.

ఇక ఆయన భాషలోనే మాట్లాడాలనుకున్న శంకరం "అవుననుకోండి. కానీ మీకు ప్రతి విషయంలోనూ కోటాలుంటాయిగా. ఈ విషయంలో ఈ రోజు ఇప్పటికే మీ కోటా చాలావరకూ పూర్తయిందనుకోండి. నాకేమైనా రాయితీ దొరుకుతుందేమోనని ఆశ!" అన్నాడు. నాయక్ అతడివంక అదోలా చూశాడు.

"ఇక్కడ మీకు ఓ విషయం చెప్పాలి. ఇలాంటి మామూళ్ళు ఒకోరోజు పదికోట్లుండొచ్చు. ఒకోరోజు పదివేలు వుండొచ్చు. ఎంత వున్నా వీటికి మాత్రం కోటా ఉండదు" అన్నాడు.

ఏ రాయితీ లేకుండా యాభైవేలు సమర్పించుకుంటేనే తనకి ప్రమోషన్ వస్తుందని శంకరానికి రూఢీ అయింది. ఎటొచ్చీ ఆ డబ్బు ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఇవ్వాలి అన్నది తెలుసుకోవాలి.

సకాలంలో డబ్బు అందజెయ్యడానికి నాయక్ కోటాలు అడ్డు తగలకుండా ప్లాన్ చేసుకోవాలి. ఏదేమైనా శంకరానికో విషయం అర్థమైంది.

ఈ దేశంలో ఎన్నింటికో కోటా పరిమితి ఉంది ఒక్క అవినీతికితప్ప! అది తెలుసుకున్న అతడికి ప్రమోషన్ రాకుండా ఉంటుందా?

చైనా శక్తివంతమైన దేశమే... అలాగని భారత్ బలహీన దేశం కాదు. -జనరల్ రావత్, ఆర్మీ చీఫ్



సోషల్‌మీడియా అనేపదం నేడు విశేషంగా వినిపిస్తున్నది. ఇంటర్నెట్ ద్వారా ఏర్పడిన ఒక శక్తివంతమైన మాధ్యమాన్ని సోషల్‌మీడియా అంటున్నారు.ఇందులో భాగమే ఫేస్‌బుక్, ట్విట్టర్, వాట్సప్‌ల వంటివి. ఇందులో ఎవరు వార్తను సృష్టిస్తారో తెలియదుకాని అతి వేగంగా ప్రపంచంలోని నలుమూలలకీ చేరిపోతుంది ఆ వార్త.

అది వాస్తవవార్త కావచ్చు, కల్పిత వార్త అయివుండవచ్చు. కాని దానిని కోట్లాదిమంది చదువుతారు. వార్తలే కాదు వ్యక్తిగత అంశాలు, వ్యక్తిగత వివరాలు కూడా ఈ సోషల్ మీడియాలో పంచుకుంటారు.

ఈ సోషల్ మీడియాకు వేళాపాళా వుండదు. వార్తాపత్రికలు ఒక నిర్దేశ సమయానికి వస్తాయి. ఇతర మీడియాలో వార్తలు ఒక ప్రత్యేక సమయంలో



# సోషల్ మీడియా మంచి, చెడు

వస్తాయి. కాని సోషల్‌మీడియాలో ఎప్పుడు ఎవరు ఎటువంటి వార్తపెడతారో తెలియదు.

కాబట్టి తరచుగా తమ ఫోన్‌లోకి వచ్చిన మెసేజ్‌లను చెక్ చేసుకుంటూవుండాలి. అది చివరికి ఒక అలవాటుగా మారుతున్నది.

ప్రతి ఐదు నిమిషాలకు ఒకసారి ఫోన్‌లో వచ్చిన సోషల్ మీడియా సందేశాలను చూసుకోకపోతే ఏదో కోల్పోయిన ఫీలింగ్ ఏర్పడుతుంది.

అటువంటి సోషల్‌మీడియా ఇప్పుడు స్నేహాలను ప్రేమసంబంధాలను మింగేస్తున్నదంటే నమ్మగలరా! అతి వేగంగా ఒకరి గురించి మరొకరు తెలుసుకునే అవకాశం ఇచ్చే సోషల్‌మీడియా ఆత్మీయంగా వుండాల్సినవారిమధ్య ఎడం పెంచుతున్నది.

## స్మార్ట్‌ఫోన్‌తో ప్రమాదం

సోషల్‌మీడియాతో అనుబంధంపెంచుకున్నా మానవ సంబంధాలను కత్తిరిస్తున్న వైనం గమనించటంలేదు. ప్రేమికులు, భార్యాభర్తలు, తోడబుట్టినవారు, స్నేహితులు... అన్నిరకాల సంబంధాలు సోషల్ మీడియా ఒత్తిడికి గురవుతున్నాయి.

సోషల్‌మీడియాలో ప్రస్తావిస్తున్నటువంటి అంశాలు, సోషల్ మీడియాలో చేసే వ్యాఖ్యలు, ఒకరి ఫోన్‌లోని సోషల్ మీడియా సంబంధాలను మరొకరు తెలుసుకోవాలని చేసే యత్నాలు ఘర్షణ వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి.

సోషల్ మీడియా ద్వారా ఏర్పడే సంబంధాలు అనుమానాలకు దారితీస్తున్నాయి. అయినవారి కోసం ఆ సంబంధాలు తెంచుకోలేక, అయినవారిలో అనుమానాలు నివృత్తిచెయ్యలేక గొడవలు పడుతున్నవారున్నారు. అలా సోషల్ మీడియా మనుషుల మనసుల్లో అనుమానాలను రేకెత్తిస్తున్నాయి.

సాంకేతికత మానవజీవితాన్ని ముందుకు నడిపిస్తుందనేది వాస్తవం. సాంకేతిక ప్రగతి ప్రభావానికి గురికాకుండా వుండటం కష్టం.

సాంకేతిక పరికరాల అవసరం వుంది. కాని వాటిని ఉపయోగించే తీరులో ఉపయోగించకపోతే ప్రమాదం ఉంది.ఇది అన్నిరకాల సాంకేతికపరికరాలకూ వర్తిస్తుంది. సోషల్‌మీడియాని ఉపయోగించటానికి వాడే స్మార్ట్‌ఫోన్‌తో వున్న ప్రమాదమూ అదే.

## జంటలమధ్య ఎడబాటు

సోషల్‌మీడియాతో మంచి, చెడు రెండువున్నాయి. మనుషుల ప్రవర్తనను సోషల్ మీడియా ప్రభావితం చేస్తోంది. సోషల్‌మీడియాలో కనిపించే మనుషులు, వారి ప్రవర్తనను గమనించి, తమవారి రూపం, ప్రవర్తనలతో పోల్చుకుంటున్నారు. పైగా ఆ సంఘటనలు వారిని ఊహాలోకంలోకి నెడుతుంది.

అటువంటి ఊహాలోకంలోని వ్యక్తులలాగా తనవారు లేకపోయారేనని దిగులుపడేవారున్నారు. వాస్తవ జీవితానికి,సోషల్ మీడియా అందిస్తున్న ఊహాజీవితానికి మధ్యఉండే తేడాను అర్థంచేసుకోలేనివారు మరింత ఇబ్బందిపడుతున్నారు.

సోషల్‌మీడియాలో వస్తున్నవాటిని చూసి జీవితాలను చక్కదిద్దుకుంటున్నవారున్నారు.తమ జీవితాలకు అవసరమైన సమాచారం సోషల్ మీడియా ద్వారా అందుకుంటున్నారు. కొత్త ఆలోచనలను అందుకునే సాధనమైంది సోషల్ మీడియా.

సామాజికంగా సోషల్ మీడియా తెస్తున్న మంచి, చెడులను ముఖ్యంగా చెడును అర్థంచేసుకోలేకపోయినవారు అలా సమయం వృథా చేసుకోవటమే కాదు, సున్నితత్వాన్ని కోల్పోతారు. మనుషులకు దూరంగా యంత్రానికి దగ్గరగా ఏర్పరుచుకునే జీవితం కొత్త ఇబ్బందులను తెస్తుంది.

## ప్రైవేట్ లైఫ్ పబ్లిక్‌గా...

తమ వ్యక్తిగత అంశాలను అనవసరంగా సోషల్ మీడియా లోకి ఎక్కిస్తున్నారు. తమ పడకటింటి రహస్యాలను సోషల్ మీడియాతో పంచుకుంటున్నారు.

సెక్స్‌లో పాల్గొన్న విషయం కూడా 'షేర్' చేస్తున్నారు. సెక్స్ తర్వాత ఒకరికొకరు దగ్గరగా, కౌగిలింతలో గడిపే అలవాటు నుండి భావప్రాప్తి తదుపరి రిలాక్స్‌ని స్మార్ట్ ఫోన్‌లో సందేశాలు చెక్ చేసుకోవటంగా మారటం నేటి విచిత్రం.

ఆ పడకటింటి గంట సమయం విశేషాలు గబగబా పంచుకోవాలనుకోవటమే నేటి ప్రమాదం.

సోషల్ మీడియా దంపతులమధ్య ఘర్షణ తెస్తున్నది. తమ వ్యక్తిగత అంశాలను మరొకరితో పంచుకోవటం దంపతుల్లో ఒకరికి ఇష్టం వుండక, రెండవవారు ప్రతి విషయాన్నీ సోషల్ మీడియాలో పెడుతున్నప్పుడు ఆ జంట మధ్య అపోహాలు ఏర్పడతాయి. పోట్లాటలుగా మారతాయి. వారి బంధంలో అభద్రత చోటుచేసుకుంటుంది.

వ్యక్తిగతం అనేది అలాగే వుండిపోవాలనుకునేది కొందరి అభిప్రాయం.తమ ఫోటోలు అందరితోపంచుకోవటం ఇష్టం వుండదు. తమ పిల్లల సమాచారం పదిమందికి తెలియచెప్పటం నచ్చదు.

అటువంటి వారి అభిప్రాయాలకు గౌరవం ఇవ్వకయథేచ్ఛగా ప్రతి విషయాన్నీ బహిరంగపరచటం అంటే కోరి ఇబ్బందులను తెచ్చుకోవటమే.

ప్రైవేటు జీవితానికి, పబ్లిక్ జీవితానికి మధ్యవున్న తేడాను చెరిపేస్తుంది సోషల్ మీడియా. ఆ ప్రమాదం ఎక్కడ ప్రారంభం అవబోతున్నదీ తెలుసుకుని తప్పుకోగలిగితే జీవితం బాగుంటుంది. ◆



Courtesy : VANITHA

సోషల్ మీడియా వ్యతిరేక ప్రభావం నుండి త్వరగా బయట పడకపోతే జీవితంలో ఇబ్బందులు తప్పవు. నేడు చాలా జంటల మధ్య వస్తున్న ఎడంకి కారణం స్మార్ట్‌ఫోన్, సోషల్ మీడియా అనేది నిజం. ఏకాంత సమయంలో కూడా ఫోన్‌ని వదల లేని బలహీనత, సోషల్‌మీడియాను చెక్ చేసుకునే అలవాటు చిరాకును పెంచుతాయి.

జంటగా పార్క్‌లో కలిసి ఏకాంతంగా గడుపుదామని, కబుర్లు చెప్పుకుందామనుకున్న వేళ రెండవ వారు ఫోన్‌లో మెసేజ్‌లను చెక్‌చేసుకుంటుంటే ఎంత కోపం వస్తుందో ఊహించవచ్చు.

ఇంటిలో ఏకాంతం దొరికినవేళ ఆ ఏకాంత సమయాన్ని ఆనందంగా అనుభవించక ఆ సమయంలోనూ సోషల్ మీడియా సందేశాలను చూసే మొగుళ్ళ మీద ఫిర్యాదులు పెరుగుతున్నాయి.

ఎప్పుడు చూడు సోషల్ మీడియాలో బిజీగా ఉంటాడు, ఎదురుగా తానున్నానన్న స్పృహ కూడా వుండటంలేదు అని తప్పుపడుతున్నారు.

'నేను ఫోన్‌లో ఏమి చెక్ చేసుకుంటున్నా నీ మాటలు వింటున్నా కదా!' అని అబ్బాయిలు సమర్థించుకుంటారు.

అయితే తన కళ్ళలోకి చూస్తూ మాటలు వినాలన్నది అమ్మాయిల కోరిక. పూర్తిగా దృష్టి తమ మీదే వుండాలని కోరుకోవటంలో తప్పులేదుగా.

ఏకాంత సమయం దొరికినప్పుడు ఏం చెయ్యాలో అది చెయ్యకపోవటం తప్పు. తమ మధ్య బంధం బలపరచగలిగినది ఏకాంత సమయం.

ఆ సమయంలో చెప్పుకునే కబుర్లు, చేసే చిలిపి పనులు కొత్త ఉత్సాహాన్నిస్తాయి. ఇద్దరినీ బాగా దగ్గరచేస్తాయి. కాబట్టి తమకు మాత్రమే ప్రత్యేకంగా సమయం కేటాయించుకుని ఆ సమయంలో ఫోన్‌ని పూర్తిగా దూరంగా ఉంచటం అవసరం.

జీవితాలు బిజీ అయిపోయి, ఉద్యోగ బాధ్యతలు భార్యాభర్తలిద్దరినీ ఉక్కిరిబిక్కిరి చేస్తున్నవేళ ఏకాంత సమయం దొరకటమే చాలా కష్టమవుతున్నది.దొరక్క దొరక్క, దొరికిన ఆ సమయాన్ని స్మార్ట్‌ఫోన్, సోషల్ మీడియాకి కేటాయించుకుంటే సంసార జీవితంలో నిరాశ, నిస్పృహలు మాత్రమే మిగులుతాయి.



Courtesy : UNISHKURI

సోషల్ మీడియానే జీవితం అనుకుంటే అసలు జీవితానికి దెబ్బతప్పదు.వ్యక్తులను మార్చివేస్తుంది సోషల్ మీడియా.

పరిమితులకు లోబడి జీవితం గడిపేవారు కూడా సోషల్‌మీడియాలో రెచ్చిపోవటం కనిపిస్తుంది. బయట మాట్లాడని పదాలు సోషల్ మీడియాలో విరివిగా ఉపయోగిస్తుంటారు.

బయట జీవితంలో కనిపించని చిలిపితనం సోషల్ మీడియాలో ప్రదర్శిస్తారు. తాము బయట చూసిన మనిషి సోషల్ మీడియాలో కలుస్తున్న వ్యక్తి ఒకరేనా అనే సందేహం కలిగిస్తారు.

ఇటువంటి ద్వంద్వ ప్రవర్తన వారి వ్యక్తిగత జీవితాల మీద వ్యతిరేక ప్రభావం చూపుతుంది.

**చిత్తయిపోతున్న యూత్**

సామాజికంగా కొన్ని ఆంక్షలకు లోబడి జీవిస్తాం. ఆ ఆంక్షలనుదాటి ఇబ్బందులు కొనితెచ్చుకోం. ఆంక్షలు అనుకున్నా అవి పరిమితులుగా భావించాలి.

ఆ పరిమితులు సోషల్ మీడియాలో కూడా దాట కూడదు. అవతలి వ్యక్తి ఎవరో, ఎటువంటివారో తెలియదు. వారు వల పన్నుతున్నారేమో అనే సందేహం కలగదు. వారి ప్రోత్సాహంతో రెచ్చిపోయి ఆ తర్వాత ఇరుక్కుపోతారు. అనారోగ్యకర సామాజిక పరిస్థితిలో చిక్కుకుంటారు.

సోషల్ మీడియా మత్తులో పడి వ్యక్తిగత సంబంధాలకు దూరం అవుతున్నారు. తల్లిదండ్రులతో సమయం గడపటానికి తీరిక లేనంత సోషల్‌మీడియా బిజీలో పిల్లలున్నారు.

ఇంటికి వచ్చిన అతిథులను పలకరించేందుకు స్మార్ట్‌ఫోన్‌లో నుండి తలెత్తి చూడ లేనంతగా ఫోన్‌కి అతుక్కుంటున్నారు. పక్కవారితో సంబంధాలు అక్కరలేనంతగా యువతీయువకులు సోషల్ మీడియా మత్తులో ఉంటున్నారు.

సోషల్ మీడియా ద్వారా నిరంతరం ఇతరులతో టచ్‌లో వుండటానికి చూపే ఇష్టత ఎదురుగా వున్న వారిని పలకరించటానికి లేకపోవటం ఒక రకమైన మానసిక జబ్బు అంటున్నారు సైకాలజిస్టులు. అటువంటి పరిస్థితిలోకి జారకుండా జాగ్రత్తపడాలి.

సామాజిక మాధ్యమాలలో అడ్డమైనవాటికల్లా 'లైక్'లు కొట్టే మగవారు కళ్ళ ఎదురుగా అందంగా చీరకట్టుకున్న భార్యకు తన 'లైక్' తెలియచెప్పలేక పోతున్నారు.

ఎవరెవరో పంపిన సందేశాలకు ఉదా రంగా థ్యాంక్స్‌లు మరొకటి చెప్పేవారు తమ భాగస్వామి చేసిన సహాయాన్ని అసలు సహాయంగా కూడా అంగీకరించటంలేదు. వాస్తవాన్ని వదిలి సోషల్ మీడియా ఊహావిహారం చిత్రమైన మానసిక స్థితి.

వ్యక్తిగత సంబంధాలను దెబ్బతీస్తున్న సోషల్ మీడియాతో జాగ్రత్త అవసరం.

ఎ.మధుప్రియ

# జై భారత్

మిలట్రీ జవాను,మావ్‌కేదో ఇవ్వడం గౌతమ్, సుజి గమనించారు."అది నా సెల్‌ఫోన్" అన్నాడు కంగారుగా గౌతమ్.

"సో, మావ్‌కు కావల్సిన ఆధారం కూడా దొరికిపోయింది. ఇక మనం ఇక్కడ ఒక్క క్షణం ఉండటం మంచిదికాదు.

పద వెళదాం" అంటూ హడావిడిగా సుజి కారువైపు నడిచింది. నీరసంగా ఆమెను అనుసరించాడు గౌతమ్.

ఇండియా ఢిల్లీ

"అమ్మా నేను కాలేజీకి వెళుతున్నాను" అని చెప్పి స్వాతి బయలుదేరింది. అలవాటుప్రకారం బయటకు వచ్చి ఒకసారి చుట్టూ చూసింది.

ఆమె ఇంటికి ఎదురుగా ఒక లైట్ పోల్ ఉంది. దానికింద ఒక యువకుడు నిలబడి ఉన్నాడు.మాసిపోయిన జీన్స్ దానిమీద నల్లరంగు టీషర్ట్ వేసుకున్నాడు.మనిషి చాలా రఫ్‌గా, మొరటుగా కనిపిస్తున్నాడు. స్వాతి ఇంటివైపు తీక్షణంగా చూస్తున్నాడు.

అతను ఎవరో ఎందుకు తన ఇంటివైపు చూస్తున్నాడో స్వాతికి అర్థంకాలేదు.దాదాపు నాలుగు రోజుల నుంచి అతన్ని చూస్తోంది. ఇరవై నాలుగు గంటలు ఆ పోల్ దగ్గర నిలబడి ఉంటాడు. స్వాతి ఇంటిని గమనిస్తూ ఉంటాడు.

ఆ విషయం మొదటిరోజే స్వాతి గమనించింది. ముందు కొంచెం భయంవేసింది. తల్లితో ఈ విషయం చెప్పాలని అనుకుంది. కాని దానివల్ల లాభం కంటే నష్టం ఎక్కువ. ఈ విషయం వింటే తల్లి అనవసరంగా భయపడుతుంది. రేపటినుంచి కాలేజీకి

చిత్ర వెంకటేష్



వెళ్ళవద్దని ఇంట్లో కూర్చోపెడుతుంది. అందుకే స్వాతి తల్లికి చెప్పలేకపోయింది.

అతనివైపు చూడకుండా గబగబ కాలేజీవైపు అడుగులు వేసింది స్వాతి.కాలేజీ ఆమె ఇంటికి చాలా దగ్గరే. పది నిమిషాలు నడిస్తే కాలేజి చేరుకోవచ్చు. నడుస్తూనే మెల్లగా వెనక్కి తిరిగి చూసింది.ఆ మనిషి తన బైక్ మీద ఆమె వెనుక వస్తున్నాడు.

స్వాతికి చాలా భయం వేసింది. అతని ఉద్దేశం ఏమిటో ఆమెకు అర్థంకాలేదు. ఎలాగో కంగారుగా కాలేజీ చేరుకుంది. కాలేజీ బయట చాలా హడావిడిగా ఉంది. చాలామంది స్టూడెంట్స్ గేటు దగ్గర గుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు.

కాలేజీ లోపల కూడా విద్యార్థులు ఎవరూ క్లాసులకు వెళ్ళలేదు. బయట నిలబడి ఉన్నారు. ఏం జరిగిందని తన స్నేహితురాలిని అడిగింది.

"నీకు ఇంకా తెలియదా. మన తెలుగు లెక్చరర్ హఠాత్తుగా గుండెపోటుతో నిన్న రాత్రి మరణించాడు. ఆయన ఎంత మంచివాడో నీకు బాగా తెలుసు. పైగా పాఠం చాలా చక్కగా చెప్తాడు.

అందుకే ఆయన మీద గౌరవంతో ఈ రోజు కాలేజీకి సెలవు ప్రకటించమని మన లీడర్ ప్రిన్సిపాల్‌ను అడిగాడు. ఆయన ససేమిరా అన్నాడు.దాంతో మన లీడర్‌కు కోపంవచ్చి క్లాసులు బాయ్‌కాట్‌చెయ్యమని పిలుపు ఇచ్చాడు. ఇదీ జరిగింది.

కాలేజీకి సెలవు ప్రకటించిన తరువాత మనమంతా తెలుగు లెక్చరర్ ఇంటికి వెళ్ళాలని తీర్మానించుకున్నాం" అంది ఆమె.

అప్పుడే ప్రిన్స్‌పాల్ గదిలోంచి స్టూడెంట్ లీడర్ సంతోషంతో బయటకు వచ్చాడు.

"ఫ్రెండ్స్ ఈ రోజు కాలేజీకి సెలవు. అందరం మన మాష్టారు ఇంటికి వెళదాం పదండి" అన్నాడు. స్టూడెంట్స్ అందరూ ఒక్కసారిగా హాహాకారాలు చేశారు. అందరూ ఒక్కసారిగా గేటువైపు దూసుకుపోయారు, ఒక స్వాతి మినహా.

ఆమెకు మూడ్ బాగా లేదు. తన వెనుక వచ్చిన ఆ రౌడీ గురించి ఆలోచిస్తోంది ఆమె.అందుకే వాళ్ళతో వెళ్ళకుండా తన ఇంటివైపు దారితీసింది. ఆ మనిషి తనబైక్‌తో ఆమెను యథాప్రకారం అనుసరిస్తున్నాడు.

ఇంతలో ఒక పాతరంగు మారుతీ కారు ఆమెముందు వేగంగా వచ్చి ఆగింది. ఆమె తేరుకునేలోగా కారు తలుపులు తెరుచుకోవటం ఒక బలమైన చెయ్యి ఆమెను లోపలికి లాగటం అంతా మెరుపువేగంతో జరిగిపోయింది. ఊహించని ఈ పరిణామానికి నిర్ఘాంతపోయింది. గట్టిగా అరవబోయింది.

ఇంతలో ఆమెను పట్టుకున్న మనిషి కర్చీఫ్ తీసి ఆమె ముక్కుకింది అదిమిపట్టాడు. అది క్లోరోఫాం మందు. ముందు తియ్యని వాసన వేసింది. వెంటనే తల తిరిగింది. తర్వాత ఏమైందో స్వాతికి తెలియదు. అచేతనంగా సీటుమీద వాలిపోయింది.

ఆ రోజు పాఠం అయినతర్వాత బయలుదేరటానికి లేచాడు లీ. గుమ్మం వైపు వెళుతూ అప్రయత్నంగా కాళ్ళకు బ్రేక్ పడినట్టు ఆగిపోయాడు. అంతవరకు మామూలుగాఉన్న అతనిమొహం గంభీరంగా మారిపోయింది.

ప్రద్యుమన్‌వైపు తీక్షణంగా చూశాడు. లీ ప్రవర్తన ప్రద్యుమన్‌కు కొంచెం కూడా అర్థంకాలేదు. కాని ఏదో ఉందని మాత్రం అతనికి తెలిసింది. "మిస్టర్ ప్రద్యుమన్ రెండు రోజులకు ముందు నేను ఇక్కడికి వచ్చాను కదూ" అన్నాడు లీ.

"అవును మామూలుగా పాఠం చెప్పించుకోవటానికి వచ్చారు. కాని ఆ రోజు మీ మూడ్ బాగాలేదని పాఠం వద్దని చెప్పారు. మనమిద్దరం కబుర్లు చెప్పుకున్నాం" అన్నాడు ప్రద్యుమన్.

"మనంమామూలువిషయాలు మాత్రమే మాట్లాడుకున్నామా. లేక ఇంకేదైనా మాట్లాడుకున్నామా"

"ఇంకేం మాట్లాడుకుంటాం కామ్రేడ్ లీ. చాలా సాధారణ విషయాలు మాట్లాడుకున్నాం. మీరు నా గురించి నాదేశం గురించి కొన్ని విషయాలు అడిగారు నేను చెప్పాను. అంతకుమించి మన మధ్య ఎలాంటి విషయాలూ ప్రస్తావనకు రాలేదు"

"లేదు.ఆ రోజు ఏంజరిగిందో నాకు లీలగా గుర్తు ఉంది. ఆ రోజు నిజంగానే నా మూడ్ బాగాలేదు. విపరీతమైన పని ఒత్తిడి నన్ను ఇబ్బందికి గురిచేసింది. ఏం చెయ్యాలో తోచలేదు. అందుకే ఆఫీసునుంచి తిన్నగా మిలిట్రీ క్యాంటీన్‌కి వెళ్ళాను.

అక్కడ రెండు పెగ్గులు తీసుకుని మీ దగ్గరికి వచ్చాను. మీరు పాఠం మొదలుపెట్టబోతుంటే పాఠం వద్దని సరదాగా కబుర్లు చెప్పుకుందామని అన్నాను. ఆ టైమ్‌లో నేను పూర్తిగా మత్తులో ఉన్నాను.

అఫీషియల్ విషయాలు మాట్లాడుతున్నానో అన్ అఫీషియల్ విషయాలు మాట్లాడుతున్నానో గమనించే స్థితిలో లేను.ఇంటికి వెళ్ళిన తరువాతగాని నా మత్తు దిగలేదు. ఒక్కసారిగా జరిగినదంతా నా కళ్ళముందు కదలాడింది.

నేను మందు తాగిరావటం మీతో నా అఫీషియల్ విషయాలు కూడా మాట్లాడటం అంతా లీలగా గుర్తుకువచ్చింది. అందుకే అడుగుతున్నాను.

మీతో నేను అఫీషియల్ విషయాలు చెప్పి ఉంటే చెప్పండి. నేనేం అనుకోను. కొంపతీసి బ్లాక్ కోబ్రా

## జరిగిన కథ 10

బ్లాక్ కోబ్రా బ్లూప్రింట్‌ని సంపాదించమని సుకాతో చెబుతాడు గౌతమ్. ఆ పనిలో పడతాడు సుకా. ఈలోగా తన ప్రయత్నాల్లో భాగంగా ఓ రోజు రాత్రి గౌతమ్ మిలట్రీ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంట్‌లోకి ప్రవేశిస్తాడు.

పన్నెండు అడుగుల ఎత్తున్న గోడల్ని దాటుకొని వెళ్ళిన గౌతమ్‌కి అక్కడ ఒక విమానం నమూనా కనిపిస్తుంది. ఇవన్నీ ఇలా వుండగా ప్రకాష్ మావ్‌కి ఫోన్‌చేసి 'మీ దేశంలో నెట్‌వర్క్ చేస్తున్న భారత ఏజెంట్ ఇప్పుడు మీరు రహస్యంగా తయారుచేస్తున్న విమానం వద్ద వున్నాడని చెబుతారు. క్యాంటీన్‌లో తనని కలిసిన ప్రద్యుమన్‌కి సిన్హా పంపిన ట్రాన్స్‌మీటర్‌ని రహస్యంగా అందిస్తాడు సింగ్.

భారత్‌నుంచి వచ్చిన అండర్ కరెంట్ ఏజెంట్‌ని వెదికిపట్టుకోమని మావ్ నాకు అప్పజెప్పాడని ప్రద్యుమన్‌తో చెబుతాడు 'లీ'. సిన్హాతో ట్రాన్స్‌మీటర్ ద్వారా రహస్యంగా తన ఎస్సైన్‌మెంట్ వివరాలు చెబుతాడు ప్రద్యుమన్.

తనని ఇండియన్ స్పైగా సుజి గుర్తించిందని తెలిసి అదిరిపడతాడు గౌతమ్.

తర్వాత జరిగేది చదవండి.

## ఎందుకీ హడావిడి

అవకాశాలు అంతంతమాత్రం కావడంతో మర్చిపోతారనుకుంటుందేమో కాని ఎన్.ఆర్.ఐ గాళ్ రిచాగంగోపాధ్యాయ ఏదో ఒక విషయంలో జోక్యం చేసుకుని నోరు విప్పే ప్రయత్నాలు చేస్తున్నది. ఈ మధ్య గతంలో విడుదలైన సిని మాల తాలూకు వార్షికోత్సవాలను నిర్వహించు కోవడం పరిపాటి అయింది.

సదరు సినిమాలకు సంబంధించిన స్పెషల్ పోస్టర్లు తయారుచేసి ఆన్‌లైన్‌లో పెడుతున్నారు. ఈ ట్రెండ్‌పైన రిచా కామెంట్లు విసిరింది.

"ఈ విధంగా చేసుకోవడంలోని ఉద్దేశ్యం అర్థం కావడం లేదు. హాలీవుడ్‌లో ఇటువంటి ట్రెండ్ ఎప్పుడూ చూడలేదు. దక్షిణాదిలో ఈ విధంగా యానివర్సరీ పేరిట హడావిడి చేస్తున్నారేంటో" అంటూ ట్వీట్ చేసింది. ఈమెకు ఎందుకట?



గురించి చెప్పలేదు కదా"

"నాటెటాల్ మీరు నాతో చాలాసేపు మాట్లాడారు కాని మామూలు విషయాలు మాత్రమే మాట్లాడారు. మన సంభాషణలో అఫీషియల్ విషయాలు ఏమాత్రం చోటుచేసుకోలేదు. నా మాట నమ్మండి.

నా గురించి, నా కుటుంబం గురించి అడిగారు. నేను చెప్పాను. మీరు కూడా మీ కుటుంబం గురించి చెప్పారు. అంతే. అంతకుమించి మన మధ్య అఫీషియల్ విషయాలు చర్చకు రాలేదు"

లీ ఇంకేం మాట్లాడలేదు.అసహనంగాలేచి నిల్చున్నాడు. "నేను వెళుతున్నాను" అని చెప్పి విసురుగా బయటకు వెళ్ళిపోయాడు లీ. ఆందోళనతో సతమతమయ్యాడు ప్రద్యుమన్.లీ ప్రవర్తన అతనికివిచిత్రంగా అనిపించలేదు. కాని దానివల్ల జరిగే పరిణామాలు అతనికి తెలుసు.తను అఫీషియల్ విషయాలు చెప్పాడని ఖచ్చితంగా తెలిస్తే లీ ఊరుకోడు.

తను చెప్పటం ఎంత తప్పో ప్రద్యుమన్ వినటం కూడా అంతే తప్పని లీ భావిస్తాడు. దాంతో వెంటనే ప్రద్యుమన్‌ను అరెస్ట్ చేసి ఇంటరాగేషన్ చేస్తాడు. తరువాత ఏం జరుగుతుందో ప్రద్యుమన్ ఊహించ గలడు.వెంటనే ప్రద్యుమన్ క్వార్టర్స్ తాళం వేసి సింగ్ రెస్టారెంటుకు వెళ్ళాడు.

"ఏంజరిగింది బాయ్ అదోలా ఉన్నావు"అని అడిగాడు సింగ్. జరిగినదంతా చెప్పాడు ప్రద్యుమన్.

"ఆ లీ చాలా తిక్కమనిషి. ఎప్పుడేం మాట్లాడతాడో అర్థంకాదు. ఇంతకుముందు ఇలాంటి సంఘటన జరిగింది.

నీ స్థానంలో అప్పుడు ఒక మిలిట్రీ జవాను ఉన్నాడు. ఆ రోజు లీ ఏ మూడ్‌లో ఉన్నాడో తెలియదు కాని తన హోదా అంతస్తు పూర్తిగా మరచిపోయాడు. ఒక మిలిట్రీ జవానుతో కలిసి ఇంట్లో మందుపార్టీ చేసుకున్నాడు. రెండు పెగ్గులు తాగిన తరువాత లీ తన సొంత విషయాలు మాత్రం కాకుండా అఫీషియల్ విషయాలు కూడా చెప్పాడు. ఆ సమయంలో అతనికి తను ఏం మాట్లాడుతున్నాడో తెలియదు. తాగిన మైకంలో ఏదేదో మాట్లాడాడు. ఇంటికి వెళ్ళిన తరువాత అతని మత్తు పూర్తిగా దిగిపోయింది.

జరిగినదంతా ఒకసారి బేరీజు వేసుకున్నాడు. తను తన కింది ఎంప్లాయ్‌తో సీక్రెట్ అఫీషియల్ విషయాలు చర్చించానని అతనికి అనుమానం కలిగింది.అంతే ఆ మిలిట్రీజవానుని అరెస్ట్‌చేసి జైలులో పెట్టాడు. ఈ పెద్దమనిషి చేసిన తప్పుకు ఆ చిన్న ఉద్యోగి జైలులో మగ్గిపోతున్నాడు.

ఇది జరిగి సంవత్సరం కావస్తోంది. మళ్ళీ అదే సంఘటన పునరావృతం అయింది. ఈసారి నువ్వు టార్గెట్" అన్నాడు సింగ్. "లీ నన్ను అరెస్ట్ చేస్తాడని నేను భయపడటం లేదు. ప్రభుత్వం నాకు అప్పగించిన పని పూర్తిచెయ్యలేకపోతున్నానని బాధగా ఉంది"అన్నాడు ప్రద్యుమన్.

బ్యాంక్ ఖాతాలకు అనుసంధానం విజయవంతం కావటం గిట్టక ఆధార్ మీద కొందరు తప్పుడు ప్రచారం చేస్తున్నారు.
-నందన్ నీలేకని, ఆధార్ సృష్టికర్త



"అలాంటిదేం జరగదు.లీ తన తప్పు తెలుసుకుని మళ్ళీ నీ దగ్గరికి వస్తాడు. తనని క్షమించమని ఖచ్చితంగా అడుగుతాడు.ఇదినేను చెబుతున్నమాట.ఇక పిచ్చిపిచ్చి ఆలోచనలు మానేసి కడుపునిండా భోజనం చేసి వెళ్ళిపడుకో" అని ఓదార్చాడు సింగ్.

సింగ్ చెప్పినట్టుగానే కడుపునిండా తిని తన ఇంటికి బయలుదేరాడు. మధ్యదారిలో చాలామంది మిలిట్రీ అధికారులు ఎదురుపడ్డారు. ప్రద్యుమన్‌ను చూసి చిరునవ్వుతో పలకరించారు.

ఇంటికి వెళ్ళి తలుపు గడియపెట్టుకున్నాడు. మంచం మీద వాలిపోయాడు. కాని ఎంత ప్రయత్నించినా అతనికి నిద్రరావటంలేదు. కళ్ళముందు మాటిమాటికీ లీ రూపం గోచరిస్తోంది.అతను అన్న మాటలు చెవులలో వినిపిస్తున్నాయి.

ఇక చేసేది లేక ఒక ఇంగ్లీష్ నవల పట్టుకుని కూర్చున్నాడు.పది పేజీలు చదివేసరికి ఆవలింతలు వచ్చాయి. పుస్తకం పక్కనపెట్టి పడుకున్నాడు. పడుకున్న వెంటనే గాఢనిద్రలోకి జారుకున్నాడు.

ఎంతసేపు నిద్రపోయాడో తెలియదు. తలుపు మీద పెద్దగా చప్పుడు వినిపించింది. ఇంత రాత్రివేళ ఎవరొచ్చారా అనుకుంటూ వెళ్ళి తలుపు తీశాడు. గుమ్మం దగ్గర నలుగురు జవాన్లు కనిపించారు.

"సారీ కామ్రేడ్ మీ ఇల్లు చెక్ చెయ్యాలి. ఇది లీ ఆర్డర్" అని చెప్పి లోపలికి దూసుకుపోయారు.

ఊహించని ఈ నాటకీయానికి బిత్తరపోయాడు ప్రద్యుమన్. లీ ఇంత తొందరగా స్పందిస్తాడని అతను ఊహించలేదు. లీ మాటల గురించి అతను ఆలోచించటంలేదు. బాత్రూమ్‌లో దాచిపెట్టిన ట్రాన్స్‌మీటర్ గురించి ఆందోళనపడుతున్నాడు. అది కాని దొరికితే తన పని దాదాపు అయిపోయినట్టే.

శాశ్వతంగా చైనీయులకు బందీగా ఉండిపోవాలి. భవిష్యత్తులో భారత్‌కు వెళ్ళే ప్రసక్తి ఉండదు. నిజంగా అలాగే జరిగితే భారతప్రభుత్వం కాని, సిన్హా కాని అతనిని కాపాడుకోవటానికి ప్రయత్నించరు.

తమకేం తెలియనట్టు నిమ్మకు నీరెత్తిపోయినట్టు ఉండిపోతారు. పావుగంటపాటు లీ మనుష్యులు ఇంటిని కిందా మీదా చేశారు. కిచెన్‌నుంచి బెడ్‌రూమ్ వరకు అన్నిచోట్లా వెతికారు.

వాళ్ళకు కావల్సింది ఏం దొరకనట్టుగా ఉంది. అందుకే ప్రద్యుమన్‌కు సారీ చెప్పి వెళ్ళిపోయారు. అన్నిచోట్లా ఎక్కడి వస్తువులు అక్కడ చిందరవందరగా పడివున్నాయి. పుస్తకాలు, బట్టలు నేల మీద కుప్పలా పడిఉన్నాయి.

అన్నీ సర్దుకుని యథాప్రకారం పెట్టుకునేసరికి ప్రద్యుమన్‌కు గంటసేపు పట్టింది. ఇది మొదటి పరిణామం మాత్రమే. ఇంకా లీ తన మీద ఇంకా ఎలాంటి ప్రయోగాలు చేస్తాడో. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. తెల్లవారుఝాము వరకు జాగారం చేశాడు.

స్వాతి కిడ్నాప్ అయిన నాలుగు

గంటల తరువాత ఇంటికి చేరుకుంది విశాలాక్షి.

ఇంటికి తాళం వేసి ఉంది. ఇంకా స్వాతి కాలేజీ నుంచి రాలేదేమిటా అనుకుంది ఆవిడ. ఇంకో గంటవరకు చూసింది. అప్పటికీ స్వాతి రాకపోయేసరికి కొంచెం కంగారుపడింది. ఎప్పుడూ మూడు గంటలకే కాలేజీనుంచి వచ్చేస్తుంది స్వాతి.

ఒక్కొక్కసారి పావుగంట లేటవుతుంది.

అంతకుమించి ఎప్పుడూ ఆలస్యం కాదు. కాని ఈ రోజు అయిదు గంటలు దాటింది. ఐనా స్వాతి రాకపోయేసరికి కొంచెం భయపడింది విశాలాక్షి.

వెంటనే తనకు తెలిసిన స్వాతి స్నేహితులకు కాల్ చేసింది. "ఈ రోజు కాలేజీకి సెలవు ఆంటీ. మా తెలుగుమాష్టారు చనిపోతే అందరం ఆయన ఇంటికి వెళ్ళాం.కాని స్వాతి మాతో రానని చెప్పిఇంటికి బయలుదేరింది" అంది ఒక స్నేహితురాలు. మిగతా స్నేహితులూ అదే మాటను కన్‌ఫర్మ్ చేశారు.

విశాలాక్షికి ఏం చెయ్యాలో తోచలేదు. ఇంటికి బయలుదేరుతున్నానని చెప్పిన కూతురు ఎక్కడికి వెళ్ళిందో ఆమెకు అర్థంకాలేదు.

> **చైనాలో ఇబ్బందులు ఎదుర్కొంటున్న అమెరికన్ కంపెనీలను భారత్‌కి రప్పించుకుంటే భారత్‌కి మేలు కలుగుతుంది.**
> *-కెనెత్ జస్టర్, భారత్‌లో అమెరికా రాయబారి*

ఇంతకుముందు ఎప్పుడూ ఇలా జరగలేదు. చెప్పినటైమ్‌కు స్వాతి ఖచ్చితంగా ఇంటికి చేరుకునేది. ఒకవేళ ఏదైనా పని ఉంటే కాల్ చేసి చెప్పేది. కాని ఎప్పుడూ ఇలా జరగలేదు. ఇంకో గంటసేపు ఓపికగా ఎదురుచూసింది విశాలాక్షి.

అప్పటికీ స్వాతి జాడలేదు. ఆమె సెల్‌ఫోన్‌కు కాల్ చేసింది. స్విచ్డ్ ఆఫ్ అని వస్తుంది.

ఇక చేసేదేం లేక పోలీస్‌స్టేషన్‌కు బయలుదేరింది. పోలీస్‌స్టేషన్ ఎక్కడుందో ఆమెకు తెలుసు.

ప్రద్యుమన్ చైనా బయలుదేరేముందు విశాలాక్షిని ఒకసారి స్టేషన్‌కు తీసుకువెళ్ళాడు. అక్కడ ఎవరిని కలుసుకోవాలో, ఎలా కంప్లయింట్ ఇవ్వాలో ప్రొసీజర్ అంతా చెప్పాడు. ఆమెకు కాని స్వాతికి కాని ఏదైనా సమస్య వస్తే ఇక్కడికి వచ్చి రిపోర్ట్ చెయ్యాలని స్టేషన్ చూపించాడు.

పావుగంట తరువాత స్టేషన్ చేరుకుంది. అదృష్టవశాత్తూ ఇన్స్‌పెక్టర్ తన చాంబర్స్‌లో కూర్చుని ఏదో కేసు తాలూకు ఫైలు చూస్తున్నాడు.

విశాలాక్షి తనని తాను పరిచయం చేసుకుని తన కూతురు గురించి వివరంగా చెప్పింది.

అతను స్వాతి పేరు, వయస్సు, చదువుతున్న కాలేజీ మొదలైన వివరాలన్నీ నోట్ చేసుకున్నాడు. స్వాతి ఫోటో కూడా అడిగి తీసుకున్నాడు.

"నా కొడుకు ప్రద్యుమన్ ఇక్కడ లేడు. చైనాలో ఉన్నాడు. ప్రస్తుతం నేను, నా కూతురు మాత్రమే ఇంట్లో ఉంటున్నాం. మాకు ఏదైనా సమస్య వచ్చినప్పుడు సంబంధిత అధికారులకు ఈ కాగితం ఇవ్వాలని నా కొడుకు ఒక కాగితం ఇచ్చాడు. అందులో అతని ఫోన్ నెంబర్ కూడా ఉంది. అదే ఈ కాగితం" అని బ్యాగ్‌లోంచి ఒక కాగితం తీసి ఆఫీసర్‌కుఇచ్చింది. అది మామూలు సివిలియన్స్ వాడే కాగితం కాదు. డిఫెన్స్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేస్తున్నవాళ్ళు మాత్రమే అలాంటి కాగితాలను వాడుతారు.

అందులో ఒకే ఒక వాక్యం మాత్రం రాసి ఉంది. "దయచేసి ఈ నెంబర్‌కు కాల్‌చేసి వివరాలు తెలుసుకోండి"అని కింద ఒక ఫోన్‌నెంబర్ ఉంది. "మీరు భయపడకుండా ఇంటికి వెళ్ళండి. మీ అమ్మాయి ఆచూకీ తెలుసుకోవటానికి ప్రయత్నిస్తాం"అని విశాలాక్షికి సర్దిచెప్పి పంపించేశాడు ఇన్స్‌పెక్టర్.ఆమె వెళ్ళగానే ఆ కాగితంలో ఉన్న నెంబర్‌కు కాల్ చేశాడు.

సుజి, గౌతమ్ ఇద్దరూ డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని టిఫిన్‌చేస్తున్నారు. ప్రస్తుతం ఇప్పుడు వాళ్ళుంటున్నది సుజి మేనత్త ఇల్లు. ఆవిడ తన స్నేహితురాలు కూతురు పెళ్ళికి షాంగాయ్ వెళ్ళింది. ఆ ఇంటికి రెండు తాళంచెవులు ఉన్నాయి. ఒకటి సుజి మేనత్త దగ్గర ఉంటుంది. ఎప్పుడయినా మేనత్త ఊరికి కాని వెళ్ళినప్పుడు సుజి ఆమె వచ్చేంతవరకు ఆ ఇంట్లో గడుపుతుంది.



ఒక్కొక్కసారి తన స్నేహితులను తీసుకువచ్చి ఎంజాయ్ కూడా చేస్తుంది.అందుకే మావ్‌బారినుంచి తప్పించుకోవటానికి గౌతమ్‌ను తన మేనత్త ఇంటికి తీసుకువచ్చింది.మావ్‌నుంచి తమనుతాము కాపాడుకోవటానికి ఇంతకంటే సురక్షితమైన ప్రదేశం ఇంకొకటి లేదని సుజి భావించింది.

అందుకే ఇంకేం ఆలోచించకుండా మేనత్త ఇంటికి తీసుకువచ్చింది. అదృష్టవశాత్తూ ఆ సమయంలో ఆమె మేనత్త ఇంట్లో లేదు. షాంగాయ్ వెళ్ళింది. ఆ తరువాత సుజి తన ఇంటికి కూడా వెళ్ళలేదు. గౌతమ్‌తోనే ఉండిపోయింది.

"నన్ను క్షమించగలవా సుజి"ఉన్నట్టుండి అన్నాడు గౌతమ్."ఎందుకు?"ఆశ్చర్యంగా అడిగింది సుజి.

"నిన్ను చాలా మోసం చేశాను. నిన్ను బ్లాక్‌మెయిల్ చేసి నీ ద్వారా నీ దేశరహస్యాలను తెలుసుకోవటానికి ప్రయత్నించాను. నేను ఒక ఇండియన్ ఏజెంట్ అని తెలిసి కూడా నాకు సహాయం చేస్తున్నావు.

ఒక శత్రువులా కాకుండా ఒక మంచి స్నేహితుడిగా చూసుకుంటున్నావు, ఆదరిస్తున్నావు. వేళకు అన్నీ అమరుస్తున్నావు. నాకోసం చాలా రిస్క్ తీసుకుంటున్నావు. ఒకవేళ నువ్వు పట్టుబడితే నాకు సహాయం చేసినందుకు నిన్ను అరెస్ట్ చేస్తారు.



## చిన్నదాని అందం చూడూ

ఒకనాడు బాగా వెలుగులు విరజిమ్మిన శ్రియ ఇప్పుడు ఏ చిన్న పాత్ర దక్కినా పెద్ద సినిమాఐతే అవకాశాన్ని అస్సలు వదులుకోవడంలేదు.

దక్కినమేరకు తన అందాల సిరులు విరజిమ్మేస్తూ, నాజూకు నడుమును వీలైనన్ని ఒంపులు తిప్పేస్తూ వెండితెరంతా సందడిచేయగలగడం శ్రియ స్పెషాలిటీ. నవ్వుతో చూపరులను చిత్తు చేయడం తనకే చెల్లుతుందన్నట్లు వుంటుంది.

పదేళ్ళుగా ఇదే క్రేజ్ కొనసాగిస్తున్న శ్రియ ప్రస్తుతం ఓ అసాధారణ పాత్రకు సిద్ధమైపోయింది. ఇటువంటి పాత్ర ఆమె ఇంతకుముందెన్నడూ చెయ్యలేదని, తప్పకుండా సంచలనం సృష్టించగలదని పరిశ్రమ టాక్. లెటజ్ సీ!

తినబోతూ రుచులెందుకులే.

అవసరం అయితే ఉరితీస్తారు. లేదా జీవితాంతం జైలుశిక్ష విధిస్తారు. అయినా వాటికి భయపడకుండా ఎంతో సాహసంతో నన్ను మాఫ్ బారినుంచి కాపాడావు. జరిగింది తలుచుకుంటే నాకు చాలా సిగ్గుగా ఉంది సుజీ. నీ మొహం చూడాలంటే అదోలా ఉంది. నువ్వు కాని ఆదుకోకపోయివుంటే నా పరిస్థితి చాలా దారుణంగా ఉండేది.

అది తలుచుకుంటే ఇప్పటికీ నాకు భయంగా వుంది. నువ్వు చేసిన సహాయం నేను జీవితాంతం మరచిపోలేను. ప్రత్యుపకారంగా ఇప్పుడు ఏం చెయ్యలేను. రెండు చేతులు ఎత్తి నమస్కారం చెయ్యటం తప్ప" అంటూ రెండు చేతులు జోడించి నమస్కారం చేశాడు గౌతమ్.

"అంత పెద్దమాటలు మాట్లాడకు గౌతమ్. నువ్వు బ్లాక్‌మెయిల్ చెయ్యటం వల్ల నాకు చాలా మంచి జరిగింది. ఒక పెద్ద సమస్య నుంచి బయటపడగలిగాను" అంది సుజీ. "ఏమిటి నువ్వు అంటున్నది" ఆశ్చర్యంగా అన్నాడు గౌతమ్.

"నేను చిన్నతనం నుంచి అనాథను. నా కన్నతల్లి నన్ను కనిపారేసి చర్చి దగ్గర విడిచిపెట్టి వెళ్ళిపోయింది. ఆ చర్చి ఫాదర్ నన్ను బిడ్డలా ఆదరించి పెంచి పెద్ద చేశాడు. డిగ్రీవరకు చదివించాడు. చిన్నతనం నుంచి నేను ఇంట్రోవర్ట్‌ను. ఎవరితోనూ ఎక్కువగా కలువను, మాట్లాడను. అందుకే నాకు స్నేహితులు చాలా తక్కువ.

డిగ్రీ చదవటంవల్ల నా అదృష్టం కొద్దీ ప్రభుత్వంలో మంచి ఉద్యోగం వచ్చింది. వెంటనే ఒక అపార్ట్‌మెంట్ అద్దెకు తీసుకుని ఒంటరిగా ఉండసాగాను.

కొన్ని రోజుల తరువాత లీసా అనే అమ్మాయితో నాకు స్నేహం అయింది. ఆమె కూడా అనాథ. ఒక ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తుంది.నాకు తోడుగా ఉంటుందని ఆమెను నా అపార్ట్‌మెంట్ షేర్ చేసుకోవటానికి ఆహ్వానించాను. వెంటనే లీసా తన సామానుతో నా అపార్ట్‌మెంట్ లోకి షిఫ్ట్ అయింది.

కొన్ని రోజులు మామూలు మామూలుగా పరిచయస్థులుగా ఉన్నాం. కొన్ని రోజుల తరువాత గాఢ స్నేహితులుగా మారిపోయాం.ఇద్దరం అనాథలు కావటంతో నిజమైన ప్రేమకు అభిమానానికి దూరమయ్యాము.అందువల్ల మానసికంగా శారీరకంగా కలిసిపోయాం.

లెస్బియన్స్‌గా తయారయ్యాం. మేము చేస్తుంది అది ప్రకృతికి విరుద్ధమని మాకు తెలుసు. అయినా మా అలవాటును మానుకోలేకపోయాం.

మా సంబంధం అపార్ట్‌మెంట్‌లో కొనసాగించితే పక్కవాళ్ళకు అనుమానం వస్తుందని భావించాం. అందుకే హోటల్ గదిని ఎన్నుకున్నాం. శనివారం, ఆదివారం మా ఇద్దరికీ ఆఫీసుకు సెలవు. ఆ రెండు రోజులు హోటల్ గదిలో బాగా ఎంజాయ్ చేసేవాళ్ళం. ఆదివారం సాయంత్రం మళ్ళీ అపార్ట్‌మెంట్‌కుతిరిగి వచ్చేవాళ్ళం. ఇలా చాలారోజులుగా మా సంబంధం నిరాటంకంగా సాగిపోయింది.

ఇంతలో మీరు వచ్చి మా విషయం తెల్సుకున్నారు. నన్ను బ్లాక్‌మెయిల్ చేసి లొంగదీసుకున్నారు.నిజంగా ఆ రోజు మీరు అలా చేసి ఉండకపోతే మా సంబంధం ఇంకా కొనసాగేది.

నా జీవితం సర్వనాశనం అయ్యేది. ఒక రకంగా ఆ చెడు అలవాటు నుంచి నన్ను తప్పించినందుకు నేనే మీకు థ్యాంక్స్ చెప్పాలి. మీరు ఇండియన్ స్పై అని తెలిసినప్పుడు ముందు నాకు కొంచెం బాధ కలిగింది. నమ్మించి మోసం చేసినందుకు మీ మీద గొంతుదాకా కోపం వచ్చింది.

కాని అదే సమయంలో మీ మీద ప్రేమకూడా కలిగింది. నా జీవితంలో ప్రేమించిన మొదటి మగవారు మీరే. ఎలాగైనా ఆరునూరైనా మిమ్మల్ని మాఫ్ దగ్గరనుంచి కాపాడుకోవాలని తీర్మానించుకున్నాను. అందుకే ఇక్కడికి తీసుకువచ్చాను"అని ముగించింది సుజీ. కొన్ని క్షణాలపాటు గౌతమ్ ఏం మాట్లాడలేకపోయాడు. తరువాత అన్నాడు-

"ఈ రోజు ఆఫీసుకు వెళుతున్నావా" "వెళ్ళాలి ఈ రోజు ఒక ముఖ్యమైన పని ఉంది. అది పూర్తి చేసుకుని పెందళాడే వస్తాను" అంది సుజీ.

టిఫిన్ తిన్నతరువాత సుజీ ఆఫీసుకు వెళ్ళిపోయింది. గౌతమ్ కూడా టిఫిన్ ముగించి ప్లేటు తీసుకుని సింక్ దగ్గరికెళ్ళాడు. ప్లేటు శుభ్రంగా కడిగి స్టాండులో పెట్టి హాలులోకి వచ్చాడు. సెల్ తీసి ప్రకాశ్‌కు కాల్ చేశాడు.

ప్రకాశ్‌ను ఇకనుంచి నమ్మవద్దని అతనితో ఏ విషయాలూ షేర్ చేసుకోవద్దని సిన్హా గౌతమ్‌కు ఎప్పుడో మెసేజ్ పంపించాడు. అది చదివి చాలా అప్‌సెట్ అయ్యాడు గౌతమ్. ఇంతకాలం తనని నమ్మించి మోసం చేసినందుకు చాలా ఫీలయ్యాడు. ప్రకాశ్ మీద అతనికి గొంతుదాకా కోపం వచ్చింది.

ఇంతకాలం తనని నమ్మించి మోసం చేసినందుకు చాలా బాధపడ్డాడు. ఒక మనిషిని నమ్మించి మోసం చేస్తే ఎంత బాధ కలుగుతుందో ప్రకాశ్‌కు తెలిసివచ్చేలా చెయ్యాలని అనుకున్నాడు. అందుకే పనిగట్టుకుని అతనికి కాల్ చేశాడు.

"ఎస్" అంటూ అవతలనుంచి ప్రకాశ్ గొంతు వినిపించింది. "నేను గౌతమ్‌ను మాట్లాడుతున్నాను" అన్నాడు గౌతమ్.

"గౌతమ్ నువ్వా. నెంబర్ మారేసరికి తెలుసుకోలేకపోయాను. ఇప్పుడు ఎక్కడున్నావు.నీ నెంబర్‌కు ఎన్నోసార్లు కాల్ చేశాను కాని స్విచ్ఛ్ ఆఫ్ అని వచ్చింది. ఎన్నిసార్లు ట్రై చేసినా ఇదే జవాబు రావటంతో నాకు చాలా భయంవేసింది. నీకు ఏదైనా ఆపదవచ్చిందేమో అని కంగారుపడ్డాను. కాని థ్యాంక్ గాడ్ నువ్వు క్షేమంగా ఉన్నావని ఇప్పుడు తెలిసింది.

నీ గొంతువిన్న తరువాత నా భయం పోయింది. ఇంతకీ ఎక్కడున్నావు, ఏం చేస్తున్నావు. నా కాల్‌కు ఎందుకు రెస్పాండ్ కాలేదు"

"నాఐడెంటిటీ మాఫ్‌కు తెలిసిపోయింది. అతను, అతని అనుచరులు నాకోసం తీవ్రంగా గాలిస్తున్నారు.

అందుకే పారిపోయి ఒక సేఫ్ హౌజ్‌లో దాక్కున్నాను. ఈ ఇల్లు నా స్నేహితుడిది. అతనే నన్ను ఇక్కడికి తీసుకువచ్చాడు" అన్నాడు గౌతమ్. **ఇంకా ఉంది**



భాష తప్పిస్తే నాకు ఏదీ కొత్తగా అనిపించలేదు. ఎప్పట్నించో నేను తెలుగు వారితోనే ఉన్నాననిపిస్తుంది.

-తమన్నా, నటి

# భూషణం

ఆటో చప్పుడుకి గుమ్మం దగ్గరకి వచ్చిన సావిత్రి "రండి రండి" అంటూ మరిది శేఖరం కుటుంబాన్ని ఆహ్వానించింది. "మీ అన్నయ్య ఇప్పుడే వచ్చేస్తారు, కూర్చోండి" అంటూ సోఫా చూపించి, లోపలికి నడిచింది.

"ఏరా? ఎంతసేపయ్యింది వచ్చి?" అంటూ వచ్చాడు శేఖరం అన్నగారు విశ్వనాథం తాపీగా.

"ఇప్పుడే అయిదు నిముషాలయ్యిందన్నయ్యా" నవ్వుతూ జవాబిచ్చాడు శేఖరం.

ఇంతలో విశ్వనాథం ఫోన్ మోగింది. అటువైపు విశ్వనాథం బావమరిది శ్రీధరం. "మీకోసం హోటల్‌లో ఏ.సి. రూమ్ బుక్ చేశాను శ్రీధరం... నీలాంటి పెద్ద డాక్టర్ గారికి లోపం రానిస్తానా!? మేనమామవి... నువ్వు పెళ్ళికూతురి గంప ఎత్తకపోతే పెళ్ళి ఆగిపోతుంది. అందరినీ తీసుకుని తప్పకుండా రావాలి" అభ్యర్థనలో బెదిరింపు మేళవించి అన్నాడు విశ్వనాథం.

అటునుంచీ శ్రీధరం ఏం అన్నాడో గానీ జవాబుగా పెద్దగా నవ్వుతూ ఫోన్ పెట్టేసి, "పెద్ద డాక్టర్ కదా... శ్రీధరానికి లెవెల్ మెయిన్‌టెయిన్‌చెయ్యాలి. అందుకే హోటల్ రూములు బుక్ చేశాను.

సరే... వీళ్ళకి విడిది చూపించావా?" భార్యకేసి తిరిగిఅన్నాడువిశ్వనాథం."అదే...ఎక్కడో మీరు చెప్పలేదని వెయిట్ చేస్తున్నాను..." అంది సావిత్రి.

"పెళ్ళిసామాను పెట్టిన గదిలో స్థలం ఉందిగా... అక్కడ మీ సామాను పెట్టుకోండిరా. పక్కనే బాత్‌రూమ్ కూడా ఉంది.చుట్టాలతో కబుర్లు చెప్పుకుంటూ హాల్లో ఓ మూల నడుం వాల్చెయ్యచ్చు"

"మరిది గారు విడిగా రూము కావాలంటారేమో?" నసిగింది సావిత్రి. "వాడు ఈ ఇంటికి చుట్టంకాదు... అతిథీ కాదు. అన్నదమ్ములం. మాలో మాకు మర్యాదలు, ఫార్మాలిటీస్ అవసరం లేదు. ఇక్కడే ఉంటే వాడు నాకు సాయంగా కూడా ఉంటాడు" విశ్వనాథం స్టేట్‌మెంట్‌కి 'అవున'న్నట్టు తల ఊపుతూ ఓ చిన్న నవ్వు నవ్వాడు శేఖరం. భర్తకేసి చురుక్కున ఓ చూపు చూసింది శేఖరం భార్య వసుధ.

విశ్వనాథం, శేఖరంల తండ్రి ఓ చిన్నరైతు. తండ్రితో అప్పుచేయించి లా చదివి హైదరాబాద్‌లో ప్రాక్టీస్ చేస్తున్నాడు విశ్వనాథం.

మరీ చెట్టుకింద ప్లీడర్‌కాదు కానీ... ఆదాయం కంటే లెవెల్ మెయిన్‌టైన్ చెయ్యాలనే తాపత్రయం ఎక్కువ. తండ్రి పడుతున్న కష్టం, ఇల్లు గడవటానికి చేస్తున్న అప్పులూ చూసి ఇంజినీర్ కావాలన్న తన కోర్కెని మనసులోనే అణచేసి గవర్నమెంట్ కాలేజీలో డిగ్రీలో చేరాడు శేఖరం. అన్నగారికి కేసులూ ఆదాయం సరిపడా రాకపోయేసరికి అప్పు తీర్చటానికి ఉన్నపాటున ఉద్యోగం చెయ్యాల్సిన అవసరంఏర్పడి, లాయర్ పరాంకుశం దగ్గర గుమాస్తాగా చేరాడు. అప్పులన్నీ తీరేసరికి ఉద్యోగాలకి వయసు మీరిపోవటంతో ప్లీడర్ గుమాస్తాగానే ఉండిపోయాడు. చదువబ్బకపోబట్టే తమ్ముడు పేదగా బతుకుతున్నాడని విశ్వనాథం నమ్మకం.

పిల్లలనయినా ప్రొఫెషనల్‌కోర్స్ చదివించలేని తమ్ముడంటే చులకన, లోకువ. అతన్ని అవమానపరచడంలో ఏదో క్రూరమైన తృప్తితో కూడిన ఆనందం.

"షాపింగ్ కొద్దిగా మిగిలింది మమ్మీ... వెళ్తున్నా" తల్లితో అంది పెళ్ళికూతురు అను.

"పెళ్ళికూతురిని చేశాక బయటికి వెళ్ళకూడదంటే వినవు"... నిష్ఠూరంగా అంది సావిత్రి.

"పోనీ ఉషని తోడు తీసుకెళ్ళు" సలహా ఇచ్చింది.

"అబ్బా అది పెద్ద బోర్... వీరసుత్తి. దానికంటే

శ్రీమతి రాఘవ.టి

అమ్మమ్మని తీసుకెళ్ళటం వంద రెట్లు బెటర్" అని వెటకారంగా అంటూ షర్ట్ కొసలని ప్యాంట్ మీదికి లాక్కుంటూ గుమ్మం పక్కనే చిన్నబుచ్చుకున్న మొహంతో నిలబడ్డ బాబాయి కూతురు ఉషని గమనించీ పట్టించుకోకుండా బ్యాగ్ ఊపుకుంటూ వెళ్ళిపోయింది అను.

సణుగుడు ప్రారంభించింది వసుధ. "అందుకే పెళ్ళికి ఒక్కరోజు ముందు వద్దాం అన్నాను. అయ్యో మా అన్నయ్య తెగ కష్టపడిపోతున్నాడు. మనం సాయంగా ఉండాలంటూ లాక్కొచ్చారు"

మర్నాటి ఉదయం శ్రీధరం కుటుంబం వచ్చారు. టిఫిన్ చెయ్యటానికందరూ టేబిల్ దగ్గర చేరారు. ఒంట్లో బాగా లేదన్న వంకతో ఉష టిఫిన్ చెయ్యటానికి రాలేదు.

సావిత్రి వడ్డిస్తోంది. అను చెయ్యి తగిలి టిఫిన్‌ప్లేట్ కిందపడింది. సాంబారు చింది ఆమె డ్రెస్సుమీదా నేలమీదా ఒలికింది. చిరాగ్గా మొహం చిట్లించి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది అను.పనిమనిషి లోపలఎక్కడో పనిలో ఉన్నట్టుంది. పిలవగానే పలకలేదు.విశ్వనాథం "ఒరేయ్ బట్ట తెచ్చి నేలా, బల్లా, తుడిచేయి" క్యాజువల్‌గా తమ్ముడు కొడుకైన రాజాకి చెప్పాడు. చుట్టాలముందు పనివాడికి చెప్పినట్టు తనకి పెదనాన్న అటువంటి పని పురమాయించటంతో రాజా బిత్తరపోయాడు.



పుస్తకాలు బట్టీపట్టి కాదు... పుస్తకాల పఠనంమీద ఆధారపడి ఎదిగిన తరం మాది. -మండలి బుద్ధప్రసాద్, ఏ.పి. డిప్యూటీ స్పీకర్

వసుధ ఉలిక్కిపడింది. అక్కడ అంతమంది ఆడవాళ్ళు, సావిత్రివైపు బంధువులు ఉన్నారు. ఎదిగిన కుర్రాడిని పనిగట్టుకుని బావగారు అవమానించటం చూసి ఆమెమనసు భగ్గున మండింది.

అను ఎర్రబడ్డ రాజా మొహంచూసి నవ్వాపుకుంటూ వచ్చి టిఫిన్ తినసాగింది. కదలకుండా నిల్చున్న రాజాని గమనించి "వెళ్ళరా" అని మరోసారి విశ్వనాథం కళ్ళెర్రచేస్తూ రెట్టించేసరికి చిన్నబుచ్చుకున్న మొహంతో మౌనంగా వెళ్ళి బట్ట తెచ్చాడు రాజా.

కొడుకు చేతిలోంచి ఆ బట్టని విసురుగా లాక్కుని తుడవడం మొదలుపెట్టింది వసుధ. "అవసరమైనప్పుడు మనింట్లో పని మనం చేసుకుంటే తప్పు లేదురా మరీ అంతలా ఫీలయిపోకు" అన్నాడు విశ్వనాథం మందలిస్తున్న ధోరణిలో.

'ఆ సూత్రం నీ కూతురికి వర్తించదా?' అనుకుంటూ కసిగా పళ్ళు కొరికింది వసుధ.

ముహూర్తం అర్ధరాత్రి కావటంతో ముందే రిసెప్షన్ డిన్నర్ అరేంజ్ చేశారు. ఎదుర్కోల ముగిశాక,"ఇతను నాపెద్దబావమరిది పెద్ద సర్జన్, ఇతను మా తోడల్లుడు కమర్షియల్ టాక్స్ ఆఫీసర్, ఈవిడ మా మరదలు పెద్ద కంపెనీలో సెక్రటరీగా పనిచేస్తోంది" అంటూ బంధువులందరినీ పరిచయం చేస్తోన్న విశ్వనాథం...

ఆ వరుసలోనే నిలబడ్డ శేఖరాన్ని తప్పించి, ఆ పక్కనే ఉన్న లాయర్ పరాంకుశంగారిని వియ్యంకుడిని పరిచయం చేసి, ముందుకు సాగిపోయాడు. అన్నగారి ప్రవర్తనతో శేఖరం మొహం అవమానంతో నల్లబడటం,కాసేపటికి తమాయించుకోవటం వసుధ గమనించింది.

మొగుడి పక్కకి వచ్చి ఎద్దేవాగా అంది "కూతురి పెళ్ళిఖర్చులకి రెండులక్షల రూపాయలు సర్దటానికి పనికొచ్చిన పేదతమ్ముడి లెవెల్... వియ్యాలవారికి పరిచయం చెయ్యటానికి సరిపోలేదా? తమ్ముడు ప్లీడర్‌గుమాస్తా అంటే ఆయనకీ పరువు తక్కువా?"

"ష్... నెమ్మది... ఊరుకో... ఎవరైనా వింటే బాగుండదు" భార్యని కసిరాడు శేఖరం.

సరిగ్గా వారం క్రితం జరిగింది జ్ఞాపకం వచ్చింది శేఖరానికి. పొద్దున్న తొమ్మిదవుతుండగా హడావిడిగా వచ్చాడు విశ్వనాథం. "మా అమ్మాయి అనుకి పెళ్ళి కుదిరిందిరా శేఖరం. వరుడు స్టేట్స్‌లో అనూ చేసే కంపెనీలోనే చేస్తున్నాడు. ఒక్కడే కొడుకు. కట్నం లేదు. లాంచనాలు మాత్రం జరిపించాలి. పెళ్ళి ఎలానూ గ్రాండ్‌గానే చేస్తాను" శేఖరం కూతురు ఉషతెచ్చిన కాఫీతాగుతూ అన్నాడు విశ్వనాథం.

"ఏవే ఉషా నువ్వు బి.టెక్ చేసిఉంటే నీకూ అమెరికా మొగుడు దొరికేవాడుకదా! నువ్వూమీ అన్నయ్యా చేసిన డిగ్రీ ఎందుకు

పనికొస్తుంది? అయినా నువ్వేం చేస్తావులే. బ్యాంక్ 'లోన్' తీసుకుని చదివించాలన్నా సెక్యూరిటీగా పెట్ట టానికి మీ నాన్నకి ఆస్తి లేదు. సొంతగూడు లేదు" వేళాకోళం నేపథ్యంగా పైకి విచారాన్ని వ్యక్తపరిచాడు విశ్వనాథం. పెదనాన్న మాటలకి అప్రసన్నంగా మొహం చిట్లించింది ఉష.

"నేనో చిన్న పనిమీద వచ్చానురా. పెట్టుబడి బట్టలకి కొద్దిగా... ఓ రెండు లక్షలు తగ్గింది. శ్రీధరాన్ని అడుగుదామంటే "ఇంత చిన్న మొత్తం మా అన్న య్యని అప్పు అడిగితే మన లెవెల్‌కి అవమానం"అని అడ్డుపడింది మీవదిన. చిన్న మొత్తం కదా నువ్వేమ యినా చేబదులుకి ఎవరిద్వారానైనా ప్రయత్నించ గలవా? ఓ నెల రోజులలో తీర్చేయచ్చు..."

గంభీరంగా నిట్టూర్చి "బ్యాంక్ తెరవనీ. అన్నయ్యా.. ఉష పెళ్ళికోసం పోగుచేసి దాచింది ఉంది...దాని పెళ్ళికి ఇంకా టైమ్ ఉందికదా... డ్రా చేసి ఇస్తాను" అన్నాడు శేఖరం. "నోటి మాటమీద రెండు లక్షలు ఇస్తారా? నోటు రాయించుకోరాదూ?" లోపలికొచ్చిన భర్తతో సన్నగా అన్నది వసుధ.

"నేను ఇస్తున్నది మా అన్నయ్యకి. చేస్తున్నది సాయం. వడ్డీవ్యాపారం కాదు" గంభీరంగా అన్నాడు శేఖరం. డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు విశ్వనాథం.

"మీ తమ్ముడిని పెళ్ళివారికి పరిచయం చెయ్య లేదేం?" ఆరా తీసింది సావిత్రి.

"కలిగినవారింటి పెళ్ళికి వస్తున్నప్పుడు స్టేటస్ కోసం కనీసం మంచి బట్టలు వేసుకోవాలన్న ఇంగిత జ్ఞానం లేనివాడిని తమ్ముడని పరిచయం చెయ్యటం నాకు అవమానం" ఈసడింపుగా అన్నాడు విశ్వ నాథం. అతని దృష్టిలో 'మంచి' అంటే 'ఖరీదయిన' అని అర్థం. "అడగగానే నోటు లేకుండా డబ్బు సాయం చేశాడుగా?"

"గాడిద గుడ్డు... నేను వాడి దగ్గర రెండు లక్షలు తీసుకోవటం అంటే... వాడి లెవెల్‌కి గొప్ప క్రెడిట్ ఇచ్చినట్లే. నా అవసరానికి సాయం చేసే అవకాశం వాడికి రావటం వాడి అదృష్టం"

పెళ్ళి వేడుకలన్నీ ఆర్భాటంగా ముగిశాయి. భోజ నాల దగ్గర కూడా వి.ఐ.పి. చుట్టాలకీ, అతిథులకి మర్యాదలుచెయ్యటంలో మునిగిన విశ్వనాథం,శేఖరం కుటుంబం తిన్నారో లేదో కూడా పట్టించుకోలేదు.

ఒకవేళ ఎవరన్నా ఆ ఊసు ఎత్తితే... "ఆ... ఇంట్లో వాళ్ళకి కూడా అతిథి మర్యాదలా? అడిగి పెట్టించుకుని తినాలి.అయినా పట్టించుకుని మర్యాదలు చేసేటంత గొప్పవాడేమీ కాదులే" అని కొట్టిపడేసేవాడు.

పెళ్ళికూతురు అత్తవారింటికీ, మిగిలిన చుట్టాలు వాళ్ళ ఊళ్ళకీ వెళ్ళిపోయారు. భోజనాలుచేసి వెళ్ళటా నికి సిద్ధపడుతున్నారు శ్రీధరం, శేఖరం కుటుంబాలు. ట్రేలో చీరా రవికపెట్టితెచ్చిన సావిత్రి వసుధకి బొట్టు పెట్టి ఇచ్చింది. తన చేతుల్లో ఉన్న చీర.. రోడ్డుమీద ఫుట్‌పాత్‌ల మీద పెట్టుకుని అమ్మే చవక రకం చీర అది. వందరూపాయలు కూడా చెయ్యని ఆ చీరని చూడగానే వసుధ ముఖం మ్లానమయ్యింది.



మూడేసి వేలు ఖరీదు చేసే పట్టుచీరతో బాటు వెండి కుంకుమ భరిణలు శ్రీధరం భార్యకి,మరికొందరు వి.ఐ.పి. భార్యలకీ సావిత్రి పెట్టటం కళ్ళారా చూసింది వసుధ. తను ప్లీడర్ గుమాస్తా భార్యకాబట్టి తన లెవెల్‌కి ఈ మాత్రం చాలనుకుని పనివాళ్ళకి ఇచ్చే చీరపెట్టింది. తోడికోడలు చేసిన అవమానానికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆమె ఆడ మనసు భరించలేకపోయింది. "చీరలు కొనటానికి నా డబ్బు కావలసి వచ్చింది కానీ ఓ మంచి చీర నాకు పెట్టటానికి మనసు రాలేదా?" ఉక్రోషంతో చీర విసిరికొట్టబోయి, భర్త గుడ్లురిమి చూడటంతో తల తిప్పుకుంది వసుధ.

"ఎక్కువ మంది అతిథులు రావటంతో పెట్టుబడులకోసం తెచ్చిన చీరల్లో ఒక్కటికూడా మిగల్లేదు. మిగిలినవాటిల్లో ఈ రంగు నీకు నప్పుతుందని పక్కకి తీసి పెట్టాను" నవ్వుతూ అన్నా సావిత్రి కళ్ళల్లో తోడికోడలి పేదరికంపట్ల చిన్నచూపు, లోకువ స్పష్టంగా తెలుస్తోంది.

"నువ్వు నాకిచ్చిన రెండు లక్షలూ నా దగ్గిర దాచుకున్నావనుకోరా శేఖరం" రేప్పొద్దున్న నీ కూతురి పెళ్ళికి ఉపయోగపడుతుంది. పదోక్లాసు పాసయిన వాడయినా లక్ష కట్నం లేనిదే పుస్తెముడి వెయ్యడు. మా అనూకి దొరికినట్టు కట్నం తీసుకోని మొగుళ్ళు అందరికీ దొరకరు కదా" ఎగతాళి మేళవించి తమ్ముడికి సలహా ఇచ్చాడు విశ్వనాథం.

అలవాటుప్రకారం చిరునవ్వే శేఖరం సమాధానం. వెళ్ళిపోతున్నామని చెప్పటానికి వచ్చిన వంటవాళ్ళలో ఓ కుర్రాడు రాజాని గుర్తుబట్టి పలకరించి, చెయ్యి కలిపాడు. "నీకు ఇతను తెలుసా?" వంట కుర్రాడిని చూపిస్తూ రాజాని అడిగాడు విశ్వనాథం.

"స్కూల్‌లో నా క్లాస్‌మేట్"

"ఉద్యోగాల కోసం ఎన్నాళ్ళు తిరుగుతావు? ఎమ్మె పాసయినవాళ్ళే గతిలేక బతుకుతెరువుకోసం ప్యూను ఉద్యోగాలకి ఎగబడుతున్నారు. ఇక మీకెక్కడ దొరుకుతాయి వైట్‌కాలర్ ఆఫీసర్ ఉద్యోగాలు?

అలా కలలుకంటూ ఉండిపోతే వయసు మీరిపోతుంది. కొన్నాళ్ళు నీ ఫ్రెండ్‌తో కలిసి ఈ క్యాటరింగ్ కంపెనీలో పనినేర్చుకో. అనుభవంవస్తే సొంతంగా పెట్టుకోవచ్చు. అదీ చాతకాకపోతే నా దగ్గర ప్లీడర్ గుమాస్తాగా చేరుదువుగానిలే"

పెదనాన్న ఉచిత సలహాకి రాజా తేలిగ్గా నవ్వి, "చూద్దాం పెదనాన్నా" అన్నాడంతే.

కారు దిగి గబగబా లోపలికి వచ్చిన సీనియర్ లాయర్ పరాంకుశం గారిని చూసి హడావిడిపడుతూ లేచి, మర్యాదగా ఆహ్వానించాడు విశ్వనాథం. "నేను వరంగల్ వెళ్ళిపోతున్నాను శేఖరం.అబ్బాయి రాజా ఎక్కడ?" ఆత్రంగా అడిగారు.

కళ్ళు పెద్దవి చేసి పరాంకుశం గారికేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు విశ్వనాథం. లోపలినుంచీ నవ్వుతూ వచ్చాడు రాజా... చేతిలో ఉన్న ఆర్డర్ పరాంకుశం గారికిస్తూ "సెలక్ట్ అయ్యాను సర్" అన్నాడు.

## మనస్సుకు నచ్చింది



'మనస్సుకు నచ్చింది'లో గోవా పిల్లగా నటిస్తున్న త్రిధాచౌదరి తనపాత్ర గురించి ఒకటే ఊదరగొట్టేస్తున్నది. గోవాకు చెందిన డ్రీమీగాళ్ పాత్ర నాది. నా పేరు నిక్కీ. సినిమాలో నేను బికినీ ధరించాల్సిన సన్నివేశం ఉంది. మొదట్లో సంశయించాను. తర్వాత డైరెక్టర్ కథతో సంబంధంగల సన్నివేశాన్ని వివరించాక అంగీకరించా.

నా శరీరంపట్ల నేను కాన్ఫిడెంట్‌గా వున్నాను. సన్నివేశాన్ని ఈస్తటిక్‌గా తీశారు. బికినీ సీన్ నన్ను టైప్ కాస్ట్ చెయ్యదని ఆశిస్తున్నాను. తెలుగు నేర్చుకునే ప్రయత్నాల్లో ఉన్నా" అంటూ వివరించింది.

"నాకు తెలుసు యంగ్ మాన్ నువ్వు సాధిస్తావని... పెద్ద పార్టీ ఇవ్వాలి" నవ్వుతూ రాజా భుజం తట్టారు.

"ఏమోయ్ విశ్వనాథంమీతమ్ముడి కొడుకు రాజా కలెక్టర్ అయ్యాడు. స్వీట్ పెట్టవా? విశ్వనాథంకేసి తిరిగి సంతోషంగా అన్నారు పరాంకుశం గారు.

అదిరిపడి తూలిపడబోయి నిలవరించుకున్నాడు విశ్వనాథం. "ఆఫ్టరాల్ ఓ ప్లీడర్ గుమాస్తా కొడుకు కలెక్టరా!? ఎప్పుడు చదివాడు?!... తను వాడిని ఓ రిఫ్రాఫ్ అనుకున్నాడు ఇన్నాళ్ళూ.

డిగ్రీ క్వాలిఫికేషన్‌తో ఎక్కడో ఏ గుమాస్తాగానో, అదీ దొరక్కపోతే ఏ ప్యూనుగానో చేరతాడు అనుకున్నాడు. ఇది... ఎలా సాధ్యం!?"

"డిగ్రీ అయ్యాక ఎమ్‌బియే చేస్తూ సివిల్స్‌కి ప్రిపేర్ అయ్యాను. లక్కీగా ఫస్ట్ అటెంప్ట్‌లోనే అప్పాయింట్‌మెంట్ వచ్చింది" జనాంతికంగా చెప్పాడు రాజా.

"అన్నట్టు నీకు మరో విశేషం విశ్వనాథ్. మీ తమ్ముడుకూతురు ఉషని మా రెండోవాడు శ్రీరామ్‌కి.. అదేనయ్యా డాక్టర్‌కి... వాడికి చేసుకుంటున్నాను.

కట్నకానుకలు లేవు. పిల్లబంగారపు బొమ్మ... సుగుణాల రాశి... అంతకంటే మంచి సంబంధం నాకెక్కడ దొరుకుతుందీ..." గోదావరి ప్రవాహంలా సాగిపోతూన్న పరాంకుశంగారి మాటలకి తల తిరిగిపోతోంటే... చేష్టలుడిగి కొయ్యబొమ్మలా చూస్తూ ఉండిపోయాడు విశ్వనాథం.

తలలో ప్రశ్నలు సుళ్ళు తిరుగుతున్నాయి... 'పెదనాన్నా.. ఆర్థికస్తోమత లేదనేగా మమ్మల్ని నలుగురిలో చులకన, హేళన చేశావు? పనివాళ్ళుగా ట్రీట్ చెయ్యటానికి కూడా వెనకాడలేదు.

ఇప్పుడు మా స్టేటస్ నీకంటే ఎత్తుగా పెరిగింది. నీ లెవెల్ నువ్వు చూపించినట్టే ఇప్పుడు నేను నా లెవెల్ చూపించనా?" అని రాజా అడిగితే... చెప్పటానికి తన దగ్గర జవాబు లేదు.

అందరి ముందు తన పరువుపోతుంది. మంచి ఉడుకురక్తమున్న కుర్రాడు... అడిగినా అడుగుతాడు. చెమటలు పడ్తున్నాయి విశ్వనాథానికి.

"పెదనాన్న కాళ్ళకి నమస్కారం చేసి దీవెన తీసుకోండి.మనం బయలుదేరుదాం" పిల్లలతో తమ్ముడు శేఖరం అంటూన్న మాటలకు మరింత విస్తుబోయాడు విశ్వనాథం. దండం పెట్టిన వాళ్ళని ఏమని దీవించాలో తెలీక తెల్లమొహం వేశాడు.

చిరునవ్వుతో వెళ్ళొస్తామని చెప్పి బయల్దేరింది శేఖరం కుటుంబం.

ఒక్క తిట్టు,విమర్శ, హేళన, ఏవీ లేకుండా, "పెదనాన్నా... మా లెవెల్ ఏమిటో ఇప్పుడు తెల్సిందా?" అని ఎగతాళి చెయ్యకుండా... "అహంకారంతో మమ్మల్నెందుకు అవమానించావ"ని నిలదియ్యకుండా, వెళ్ళిపోతున్న శేఖరం కుటుంబాన్ని చూస్తూ అలా నిలబడిపోయాడు విశ్వనాథం.

టి.వి.లో స్టూడెంట్స్ ప్రోగ్రాంలో ఓ పాప చదువుతోంది... గట్టిగా... "...చంపదగినయట్టి శత్రువైనా... అహంకరించి స్థాన బలిమి చూసుకుని అవమానిస్తే... బదులు తీర్చుకోవటం.. తిరిగి అదే పద్ధతిలో... అవే మాటలతో హేళన చేసి అవమానించటం సరయినది కాదు. తను ఎదుగుదల అనే పెద్ద గీతతో 'క్షమించి గౌరవించటం' ఆ దోషికి మరణశిక్ష సదృశం..."

విశ్వనాథం తల అర్థమయిందన్న భావంతో నిలువుగా ఊగింది. 'వాళ్ళని అవమానించి బాధపెట్టాలని నోటి దురుసుతనంతో తనన్న మాటలని... సహనమే భూషణంగా గల ఆ కుటుంబం స్వీకరించకుండా వెనక్కి తనకే ఇచ్చేసినట్లయ్యింది.

ఇప్పుడు సమాజంలో తమ్ముడి లెవెల్ కొండంత పెరిగినా కూడా...విజ్ఞతకల అతను తనని క్షమించడం ద్వారా అవమానించాడు. ఈ అవమానం తన లెవెల్‌ని చిన్నగీతని చేసి, తన అహంకారం మాడు పగలగొట్టింది... చెమర్చిన కళ్ళని అద్దుకుంటూ వేదాంతిలా నవ్వుకున్నాడు లాయర్ విశ్వనాథం.మొట్టమొదటసారిగా భర్త ముఖంలో 'పశ్చాత్తాపం' అనే భావాన్ని ఆశ్చర్యంతో చూస్తూన్న సావిత్రికి తెరుచుకున్న నోరు మూసుకోవడానికి సాధ్యపడడం లేదు.

# అవిసెగింజలు అమోఘం

ఇటీవలి కాలంలో అవిసెగింజల మాటఎక్కువగా వినపడుతున్నది. జిమ్‌కు వెళ్ళే వారికి ప్రకృతి ప్రసాదించిన సహజ ప్రొటీన్ పదార్థమిది.

అనేకమంది ఫిట్‌నెస్ కోరుకునేవారి ఆహారంలో అత్యవసర పదార్థంగా గుర్తింపు గడిస్తున్నది. గుడ్డు ఆకృతిలో, చిన్నగా మెరుస్తూ వుండే అవిసెగింజల్లో అనూహ్య ప్రయోజనాలుంటాయి. ఒక్క చిన్నగింజలో సైతం పోషకాలు దక్కుతాయంటే అతిశయోక్తి కానేకాదు.

ఆహారం, వైద్యం, సౌందర్యంవంటి అనేక అంశాలకు సంబంధించి ఫ్లాక్స్ సీడ్స్ ఎంతో ప్రయోజనకరమని తాజా అధ్యయనాల్లో సైతం పేర్కొంటున్నారు. అవిసెగింజల సాగు స్విట్జర్లాండ్‌లో రాతి యుగం నుంచి ఉంది. మొదట్లో దీని పీచుతో ప్రాచీన ఈజిప్టులో లైనెన్ తయారుచేసేవారు.

వీటి గింజల్లో అనేక పోషకాలు ఉన్న విషయాన్ని గ్రహించిన తొలి పవిత్రరోమన్ చక్రవర్తి ప్రతిరోజూ వాటిని వాడాల్సిందిగా పేర్కొంటూ ఓ ఉత్తర్వు జారీ చేశాడు.హిప్పోక్రాట్స్,పెడానియస్ డియొస్కొరైడ్‌వంటి ప్రాచీన గ్రీకు స్కాలర్లు అవిసెగింజల్లోని ఔషధ విలువల గురించి తమ పుస్తకాల్లో ప్రస్తావించారు.

మనదేశ ఆయుర్వేద నిపుణులు సైతం అదే విషయాన్ని తెలియజెప్పారు. అవిసె మొక్కల్లో రెండు రకాలుంటాయి. సీడ్ ఫ్లాక్స్, ఫైబర్ ఫ్లాక్స్.

పేరులో ఉన్నట్లుగానే సీడ్ ఫ్లాక్స్‌ను గింజలకోసం ప్రత్యేకంగా సాగుచేస్తే,రెండోదాన్ని పీచుకోసంచేస్తారు. సీడ్ ఫ్లాక్స్‌ను కెనడా, యుఎస్ఎ, చైనా, ఇండియాలలో సాగుచేస్తున్నారు.

బీహార్, ఛత్తీస్‌ఘడ్, మధ్యప్రదేశ్, హిమాచల్‌ప్రదేశ్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్,అస్సాం,నాగాలాండ్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల్లో వీటి సాగు ఎక్కువ.

## ప్రతిదీ ప్రయోజనకరమే

అవిసె మొక్కల్లో ప్రతి భాగమూ మానవులకు ఉపయోగకరమైనదే. కాడ నుంచి పీచు తయారు చేస్తారు. పువ్వులలో ఔషధగుణాలుంటాయి.

గింజలను తినడానికి, పారిశ్రామిక అవసరాలకు ఉపయోగిస్తారు. అవిసెగింజల ప్రయోజనాలు ఒకటే అయినా వివిధ ప్రాంతీయులు ఉపయోగించే తీరులో వ్యత్యాసాలుంటాయి.

ఫ్లాక్స్ సీడ్, లిన్ సీడ్ అని రెండురకాలుగా వ్యవహరిస్తారు. ఫ్లాక్స్ సీడ్‌ను ఆహారంగా వాడితే, లిన్ సీడ్‌ను పారిశ్రామిక ప్రయోజనాలకోసం ఉపయోగిస్తారు. బ్రౌన్, గోల్డెన్ రంగుల్లో లభిస్తాయి.

బ్రౌన్ గింజలను జంతువుల ఫీడ్‌గా కూడా వాడతారు. వార్నిష్‌లు, పెయింట్స్, ప్రింటింగ్ ఇంకులు, సబ్బులు, ఇతర కమర్షియల్ ఉత్పత్తులలో కూడా ఓ పదార్థంగా వీటిని వాడతారు.

అవిసెగింజలను యథాతథంగా పిండిరూపంలో లేదా రోస్ట్ చేసి నిల్వ ఉంచుకోవచ్చు. నాలుగు నెలల పాటు డబ్బాలో ఉంచితే తాజాగా ఉంటాయి.

అవసరమైనప్పుడు ఎన్నో విధాలుగా ఉపయోగించుకోవచ్చు. సెరల్ పోరిడ్జ్, సలాడ్లు, సూప్‌లు, స్మూథీలు, బ్రెడ్స్, కేక్స్, కుకీల తయారీలతో, కూరల తయారీలో వాడుకోవచ్చు. బ్రెడ్ పొడికి, గుడ్లు బేక్ చేస్తున్నప్పుడు ఫ్లాక్స్‌సీడ్స్‌ను ఆరోగ్యవంతమైన ప్రత్యామ్నాయంగా ఉపయోగించుకోవచ్చు. వేయించిన గింజలను యథాతథంగా కూడా తినవచ్చు.

శాకాహారంలో అరుదుగా లభించే ఒమెగా-3 ఫ్యాటీ యాసిడ్స్‌కు అవిసెగింజలు మంచి ఆధారం. కార్బోహైడ్రేట్స్ తక్కువగా ఉంటాయి. పీచు, ప్రొటీన్లు, ఫాస్ఫరస్, పొటాషియం, క్యాల్షియం, సోడియం, ఐరన్, కాపర్, జింక్, మాంగనీస్,మెగ్నీషియం, సెలీనియం, ఎ, బి$_1$, బి$_2$, బి$_3$, బి$_5$, బి$_6$, బి$_9$, బి$_{12}$, సి, ఇ, కె విటమిన్లు లభించే ఈ గింజలు రోగనిరోధకశక్తిని, జీర్ణశక్తిని పెంచుతాయి.

చర్మం, శిరోజాల ఆరోగ్యానికి ప్రయోజనకరమైనవి.కొలెస్ట్రాల్,రక్తపోటులను తగ్గించి, డయాబెటిస్, డిప్రెషన్, లివర్ వ్యాధులు కార్డియోవాస్క్యులర్ వ్యాధులు.నరాల సంబంధిత రుగ్మతలు, ఆర్థ్రైటిస్, ఆస్టియోపోరోసిస్, ఇన్‌ఫ్లమేషన్, క్యాన్సర్ల నుంచి పరిరక్షించగల గుణాలు వీటిలో ఉన్నాయి. హార్మోన్ స్థాయిల రక్షణలో కీలకపాత్ర వహిస్తాయి కాబట్టి మహిళలకు ఉత్తమ ఆహారం.

గర్భసంచి పనితీరును మెరుగుపరిచి, పిఎంఎస్ లక్షణాలను తగ్గిస్తాయి.రుతుక్రమంలో అదనపు రక్తస్రావాన్ని, వేడి ఆవిర్లను తగ్గించగలవు.

అవిసెగింజల నుంచి ఉత్తమ ప్రయోజనాలు లభించాలంటే రోజుకు ఒకటి, రెండు టేబుల్‌స్పూన్ల చొప్పున తింటుండాలి. ఇరిటబుల్ జోవెల్ సింద్రోమ్ గలవారు, బ్లడ్- థిన్నింగ్ మందులు వాడుతున్నవారు, గర్భిణీలు వైద్యుల సలహా ముందస్తుగా తీసుకుని వాడడం మంచిది. మిగతావారందరూ నిస్సంకోచంగా తమ దైనందిన ఆహారంలో వీటిని ఏ రూపంలో అయినా భాగంచేసుకోవచ్చు. ప్రతి భోజనంలోనూ కొద్దిగా జిమ్ముకున్నా చాలు.

### అవిసెగింజల రైతా

**కావాల్సినపదార్థాలు :** ఒక కప్పు సొరకాయతురుము, ఒక కప్పు లో ఫ్యాట్ పెరుగు, అరకప్పు పుదీనా, పావు టీస్పూన్ జీలకర్ర, పావు టీస్పూన్ పంచదార, ఒకటిన్నర టేబుల్‌స్పూన్లు అవిసెగింజలు (వేయించి, పొడి చేసుకోవాలి) రుచికి ఉప్పు.

**తయారుచేసే విధానం :** సొరకాయ తురుములో ఒక కప్పు నీరుపోసి అడుగు లోతుగా గల ప్యాన్‌లో వేసి బాగా కలపాలి. మూతపెట్టి మధ్యస్థంగా గల సెగపై నాలుగైదునిమిషాలు లేదా నీరంతా ఆవిరయ్యేదాకా ఉడికించాలి. పక్కన ఉంచి చల్లారనివ్వాలి. పదార్థాలన్నీ కలిపి అడుగు లోతుగా గల బౌల్‌లో వేసి బాగా కలియబెట్టాలి. ఫ్రిజ్‌లో ఓ గంట ఉంచి చల్లగా సర్వ్ చేయాలి. ◆

Courtesy : UPPERCRUST

### ఆల్మండ్ ఫ్లాక్స్ బ్రెడ్

**కావాల్సిన పదార్థాలు :** ఒక కప్పు బాదంపప్పులు, నాలుగు గుడ్లు,పావుకప్పు అవిసెగింజలు (పొడి చేసుకోవాలి), ఒక టేబుల్‌స్పూన్ అవిసెగింజలు (విడిగా), అర టీస్పూన్ కళ్ళు ఉప్పు, అర టీస్పూన్ బేకింగ్ సోడా, రెండు టీస్పూన్లు తేనె, అరటీస్పూన్ యాపిల్ సిడార్ వెనిగర్,కొద్దిగా వెన్న.

**తయారుచేసే విధానం :** గిన్నెలో గుడ్లు సొన వేసుకోవాలి. బాగా గిలక్కొట్టాలి. పక్కన ఉంచుకోవాలి. బాదంపప్పులు బ్లెండ్ చేసుకోవాలి. బాదంపొడిని అడుగులోతుగా గల బౌల్‌లో వేసుకుని, గిలక్కొట్టిన గుడ్డుసొనతో సహా పదార్థాలన్నీ కలుపుకోవాలి.

బేకింగ్ ట్రేకు వెన్నరాసి, మిశ్రమాన్ని సమంగా పరిచి, ముందుగా హీట్ చేసిన ఓవెన్‌లో 150 సెంటీగ్రేడ్ డిగ్రీల ఉష్ణోగ్రతపై 35-40 ని॥ బేక్ చేయాలి. చల్లారనిచ్చి సమంగా స్లైసులు కట్ చేసుకుని,

అల్యూమినియం ఫాయిల్‌లో ప్యాక్‌చేసి, గాలి చొరబడని పాత్రలో ఉంచి ఫ్రిజ్‌లో ఉంచుకుని అవసరమైనప్పుడు ఉపయోగించుకోవచ్చు.

# న్యాయం చేయడమే

తాను చేసే పనిపట్ల ఎంతటి నిబద్ధత ఉందో, ఎంతగా శ్రద్ధ వహిస్తుందో శ్రద్ధాకపూర్ విషయంలో చెప్పనక్కర్లేదు. ఆమె కెరీర్ పరుగు, చేస్తున్న పని అందుకు సోదాహరణలు.

ఆమె నటించిన ఏ రెండు పాత్రలూ ఒకేమాదిరి ఉండవు. హసీనా పాత్రకోసం ఎనిమిది కేజీల బరువు పెరిగింది. 'సాహో' సినిమాకోసం తెలుగు నేర్చే ప్రయత్నంలో పడింది. సైనా నెహ్వాల్ బయోపిక్ కోసం బ్యాడ్మింటన్ కోర్టుకు వెళ్ళింది.

చిత్ర పరిశ్రమలో నటీమణులు తమ విధిని మార్చుకోలేరన్న అపోహను తొలగిస్తున్నది శ్రద్ధా కపూర్. ఆమెతో ఇంటర్వ్యూ.

***సామాజిక మార్పులకు ఆస్కారం గల విభిన్న పాత్రలు పోషించడం ఎలా ఉంది?***

సినిమాలకు సంతకాలు చేసేటప్పుడు నాకు భారీ ఎజెండా చాలా అరుదుగా ఉంటుంది. నేనెలా ఫీలవ గలను అన్నదానిపైనే ఆధారపడి పాత్రలు ఎంచుకుంటాను. సమాజంపై ప్రభావం చూపుతుందా? ప్రేక్షకులు కనెక్టవుతారా? అన్నవిషయాల ఆందోళన నాకు ఉండదు. నా ప్రయత్నాలన్నీ డైరెక్టర్ సూచించినమేరకు పాత్రకు న్యాయం చేయడంపైనే సాగుతాయి.

***ఓ క్రియేటివ్ ఆర్టిస్టుగా మీ ప్రధాన లక్ష్యం ఏమిటంటారు?***

ప్రేక్షకులకు సినిమా అనేది వాస్తవాన్నుంచి తప్పించుకోగల వినోదం. మరువలేని చిత్రాల్లో భాగం కావాలన్నది నా కోరిక. అంటే వాస్తవాన్నుంచి తప్పించడమే కాకుండా ప్రేక్షకుల ఎమోషన్లను సృజించేవిగా కూడా ఉండాలనుకుంటాను.

***బోస్టన్ యూనివర్సిటీ నుంచి ముంబయి తిరిగి రావాలన్న కోరిక ఎందుకు కలిగింది?***

సమ్మర్ వెకేషన్‌కు కుటుంబసభ్యులతో గడపడానికి వచ్చినపుడు ఆఫర్లు రావడం మొదలయింది. అదే బావుందనిపించడంతో తిరిగి కాలేజీకి వెళ్ళాలనిపించలేదు. సినిమాల్లో చేరిపోయాను. కాలేజీకి వెళ్ళడాన్ని మిస్సయ్యాననే చెప్పాలి.

***అప్పట్లో రోల్‌మోడల్ ఉండేవారా?***

అమితాబ్ బచ్చన్, శ్రీదేవిగార్ల ప్రయాణాలు నాకు చాలా స్ఫూర్తిదాయకంగా ఉండేవి. 1957 నాటి 'గురుదత్' సినిమా 'ప్యాసా' నాపైన చాలా ప్రభావం చూపింది. ముఖ్యంగా వహీదా రెహ్మాన్‌జీ పాత్ర.

***గత ఏడాదిలో నటిగా మారానని భావిస్తున్నారా?***

నా వృత్తిని ఉత్తమంగా చెయ్యగలుగుతున్నాను. మార్పు కనపడుతున్నది. విభిన్నచిత్రాల్లో భాగం కావాలన్నది నా ప్రగాఢవాంఛ.

అదే సమయంలో నేను చేసే పాత్రలు, కెరీర్ నిర్ణ

యాలపట్ల చాలా నిర్ణయాత్మకంగా ఉంటాను. నేను కెరీర్ ఆరంభించినప్పటికంటే ఇప్పుడు నన్ను నేను వేసుకునే ప్రశ్నలు ఎక్కువగా ఉంటున్నాయి.

**చిత్రపరిశ్రమలో తారల ప్రాధాన్యం పెరిగింది. మెటర్నిటీ బ్రేక్స్‌తర్వాత తిరిగివస్తున్నారు. ఈ దశ గురించి మీరెలా భావిస్తున్నారు?**

తారలకు ఇదో గొప్ప సమయం. మాపట్ల ప్రేక్షకుల అవగాహనలో, దృష్టిలో అపారమైన మార్పులు వచ్చాయి. కాబట్టి తారలు ఎటువంటి సంకోచాలూ లేకుండా తమలోని మార్పుల గురించిన భయం లేకుండా నటించగలుగుతున్నారు.

**నటన, పాటలతోపాటు మీకున్న ఇతర ఆసక్తులు గురించి చెప్తారా?**

హైస్కూల్‌లో చదువుకునే రోజుల్లో పుస్తకాలు బాగా చదివేదాన్ని. తర్వాత పూర్తి సమయాన్ని అంతా సినిమాలకే కేటాయించేశా. చదివే అలవాటును మళ్ళీ ఆరంభించాలనుకుంటున్నాను.

అలాగే జీవితంలో కొన్ని ముఖ్యమైన అంశాలగురించి కూడా పునరాలోచన చేస్తున్నాను.

నాకు జంతువులంటే ఇష్టం. ఈ కొత్త సంవత్సరం ఆరంభం నుంచి శాకాహారిగా మారిపోయాను.

**అనేక విజయవంతమయిన జాబితాల్లో చోటు చేసుకున్నారు. ఎలా ఫీలవుతున్నారు?**

నాపట్ల ప్రేమ, గుర్తింపు లభించాయి. కాని, అదేసమయంలో ఇంకా ఎన్నో చేయాల్సివుంది. నాకు నేను ఓ స్థానాన్ని సృష్టించుకోగలిగాను.



ప్రేక్షకులు నన్ను ఎంతగానో ప్రశంసిస్తున్నారు. అయితే వీటన్నింటినీ కాపాడుకోవడానికి నేనెంతో ప్రయత్నించాల్సివుంది.

**మీ పేరెంట్స్ ఇంటినుంచి బయటకు వెళ్ళి స్వంత ఇంట్లో గడపాలన్న ఆలోచన లేదా?**

(నవ్వేస్తూ) చాలామందికి తెలియని విషయం ఒకటి ఉంది. ఒకసారి నేను మా ఇంటినుంచి వెళ్ళి ఈ ఇంటికి దగ్గర్లోనే ఓ ఇల్లు అద్దెకు తీసుకుని ఓ నెలరోజులు ఉండాలని వెళ్ళాను. కాని పట్టుమని వారంరోజులు కూడా ఉండలేకపోయా.

డొమెస్టిక్ ఎయిర్‌పోర్ట్‌కు ఈ ఇల్లు బాగా దగ్గర కావడంతో శబ్దాలతో రాత్రివేళ నాకు అస్సలు నిద్ర పట్టేది కాదు. దాంతో నాన్న ఇంటికి వచ్చెయ్యమన్నారంటూ ముగించింది శ్రద్ధాకపూర్.

అయినపూరి సుజాత

# గోరంత పనికి

క్షణం తీరిక లేకుండా పనిచేయటం గొప్పతనం అనుకుంటున్నారా! ఎంత బాగా చలాకీగా, ఉత్సాహంగా ప్రతి పనీ చేసుకుంటున్నారని పది మంది మెచ్చుకుంటుంటే విని పొంగిపోయి మరింత ఉత్సాహంతో బాధ్యతలను చేపడుతున్నారా! పని మధ్యలో ఆపి ఒకింతసేపు విశ్రాంతి తీసుకోవటం చేతకానివాళ్ళు చేసేపనిగా భావిస్తున్నారా!

ఆ ప్రశ్నలన్నింటికీ అవునన్నది మీ సమాధానం అయితే మీరు అర్జెంటుగా మీ అభిప్రాయాన్ని మార్చుకోవాల్సివుంది. ఎప్పుడూ ఏదో ఒక పని కల్పించుకుని చెయ్యటం అనేది అంత గొప్ప విషయమూ కాదు. ఆరోగ్యానికి అంతగా మేలుచేసేదీ కాదు.

అలా చెయ్యటంవల్ల పనిలో సమర్థత పెరగకపోగా కాలంతో అది తగ్గిపోతుంది. విడవకుండా పనిచేయటమంటే ప్రతిక్షణం మెదడును ఏదోకవిధంగా పని చేయించటమే. అలా నిరంతరం పని చేయించే యంత్రం ఏదో ఒక సమయంలో ఆగిపోవడం చూసే వుంటారు. అటువంటి పరిస్థితి తెచ్చుకోవద్దు.

పని చేసే సమయం తగ్గాలి కాని సమర్థత పెరగాలి. అలా చేయాలంటే పని మధ్యలో విశ్రాంతి అవసరం. విశ్రాంతి అవసరాన్ని గుర్తించినపుడే పనిలో సామర్థ్యత పెరుగుతుంది. ఈ విషయం అర్థం చేసుకోక అలా పని, పని అంటూ చేసుకునేవారు ఏదోక సమయంలో మెదడు వేడెక్కి ఒక్క ఆలోచనా ముందుకు తీసుకువెళ్ళలేకపోతారు.

పనికి తగ్గ విశ్రాంతి కావాలి. పనిలో సమర్థత వుండాలి. తగిన విశ్రాంతి వుంటే సమర్థత పెరుగుతుంది. ఈ విషయం అర్థంచేసుకోని తరం పూర్తిగా పనిలోపడి 35వ ఏటనుండే రిటైర్‌మెంట్ గురించి ఆలోచిస్తున్నారు. ఆ వయసుకే ఆరోగ్యాన్ని పాడు చేసుకుంటున్నారు.

పని, విశ్రాంతులమధ్య సమతుల్యత సరిగా పాటిస్తేనే పనిమంతులవగలుగుతారు. ఆ గుర్తింపు సర్వీసులో వున్నంతకాలం నిలుపుకోవాలంటే తగిన విశ్రాంతి వుండితీరాలి. లేకుంటే వెయ్యిమీటర్ల పరుగులో తొలి వందమీటర్లు వేగంగా పరిగెట్టి, ఆ తర్వాత పరుగుకు తగిన శక్తి లేక వెనకపడిపోయి చివరికి ఓడిపోయిన వారి జాబితాలో కలిసిపోతారు.

పనికి తగిన ప్లానింగ్, ఆ ప్లానింగ్‌లో విశ్రాంతికి భాగం జతచెయ్యగలిగినవారే నిజమైన విజేతలు.

## సొంత సమయం

ఈ తరం వారికి వ్యక్తిగత సమయం కరువవటమే పెద్ద సమస్య. ఎప్పుడూ ఏదోక పని. ఇతరులకోసం చేసే ఆఫీసు పని. కనీసం ఆ పనికి ఎంతో కొంత ప్రతిఫలం వస్తుంది. ఆఫీసుకి ఆవల చేసే పనులు ఎవరికోసమో చేసేవి ఎక్కువవుతున్నాయి.

ఇప్పుడున్న వాతావరణంలో ఒకరికొకరు ప్రతిక్షణం అందుబాటులో వుండగలుగుతున్నారు. సమాచారం ఇచ్చిపుచ్చుకోవడంలో వేగం వచ్చింది. వార్తలు, సంభాషణలు పెరుగుతున్నాయి.

గ్రూప్‌లు పెరిగాయి. కుప్పలు తెప్పలుగా సందేశాలు వస్తుంటాయి. అవి చదివి వదిలేయలేదు కదా మెదడు. దానిమీద ఆలోచనలు, ప్రతిస్పందనలు, కామెంట్స్, లైక్‌లు ఇలా ఎన్నిగంటల సమయం వృథా చేసుకుంటున్నారో లెక్కలేదు.

మెదడుకు అనవసరపు అంశాలు అందించి దానిని బాగా కష్టపెడుతున్నారు. దీనితో రాత్రి ఎంత సేపైనా నిద్రపోలేరు. ఇక పార్టీలు అవీ వుంటే ఆలస్యంగా ఇంటికి చేరతారు. విశ్రాంతికి తావేది.

## తగినంత నిద్ర

అలసిన మెదడు తప్పులు చేయిస్తుంది. కాబట్టి అర్థంలేని బిజీజీవితంలోనుండి బయటకువచ్చి రోజులో కనీసం గంట సమయాన్ని మీ సొంత సమయంగా కేటాయించండి. ఎవరితో సంభాషణ లేకుండా, ఫోన్‌కి దూరంగా తమ గురించి తాము ఆలోచించుకునే ప్రశాంత సమయం అవసరం.

ధ్యానంలో గడిపినా మంచిదే. ఆ వ్యక్తిగత సమయం భాగస్వామితో, కుటుంబసభ్యులతో గడిపితే మరింత ఉత్సాహం వస్తుంది. మెదడు చురుకుగా వుండి మెరుగ్గా పనిచేసే శక్తినిస్తుంది.



Courtesy : VANITHA

నిద్ర కరువైన తరం ఇది. శరీర ఆరోగ్యానికి తగిన ఆహారం ఎంతవసరమో తగినంత నిద్ర కూడా అంతే అవసరం. తగినంత నిద్ర పొందితే సమస్యలనేకం దూరమవుతాయి. ఎంతగా పరీక్ష చేసినా ఎటువంటి లోపం కనిపించక వైద్యులకు అంతుచిక్కని సమస్యల వెనకుండేది శరీరానికి తగినవిశ్రాంతి లేకపోవటం. ఆ నిద్రలేమితో వచ్చే శారీరకమార్పులు, నిద్ర సరిగా పోకుంటే జీవనక్రియలు దెబ్బతింటాయి.

నిద్రలేకుంటే హార్మోన్‌ల స్థాయిలో మార్పువస్తుంది. నిద్రసరిపోకపోతే కోపం, చిరాకు వంటివి పెరుగుతాయి. నిద్రలేని వారికి వార్ధక్యలక్షణాలు త్వరగా వస్తాయి. నిద్రపోనివారు పనిలో శ్రద్ధ చూపలేరు.

తప్పులమీద తప్పులు చేసి పైవారి చేత తిట్లు తింటారు. ఇన్ని సమస్యలను కొనితెచ్చుకునేకన్నా శరీరం కోరుకునేది, మెదడు ఆశించేది అయిన ఆరుగంటలకు ఏమాత్రం తగ్గని నిద్రను ఇస్తే మీ పనితీరు మరింత మెరుగ్గా ఉంటుంది.

## పలు పనులు వద్దు

తక్కువ సమయంలో ఎక్కువ పనులు అనేది యంత్రాలద్వారా సాధ్యమవుతుంది.మనిషియంత్రం కాదు. మానవ మెదడుకు పరిమితులు ఉన్నాయి. తక్కువ సమయంలో పలుపనులు పూర్తిచేసి మెప్పు పొందాలనుకుంటున్నారా! అది ఎక్కువ సమయం నిలిచే సామర్థ్యం కాదని తెలుసుకోండి.

క్రమంగా సమర్థత తగ్గిపోయి చేపట్టిన పనులలో ఏ ఒక్కటీ సరిగా పూర్తిచెయ్యలేకపోతారు.

అందుకే మెరుగుగా పనిచేయాలంటే ఒకదాని తర్వాత మరొకటి ప్రాధాన్యత ప్రకారం పనులు చేసుకుంటూ పోవటంవల్ల లాభం ఎక్కువ. తద్వారా మెప్పు పొందటం వీలవుతుంది.

## ఇష్టంగా పనిచేయాలి

పని సమర్థత అనేది పనిమీద ఉన్న ఇష్టతనుబట్టి ఉంటుంది. అందుకే కష్టపడి కాదు, ఇష్టపడి పనిచేయమని చెపుతారు. ఇష్టంలేని పనిలో త్వరగా అలసట వస్తుంది. విసుగు పుడుతుంది. పూర్తిచేయాలనిపించదు. ఇష్టపడి పనిచేసినపుడే పనిని నిర్దేశిత సమయంలో పూర్తిచేయగలుగుతారు.

పని మధ్యలో కొద్దిసేపు రిలాక్స్ అయి తిరిగి పనిని చేపట్టటం మంచిది. పని ఒత్తిడినుండి బయటపడవేసే కబుర్లు ఇతర చిన్న చిన్న విరామాలవల్ల మెదడుకు కొత్త శక్తి వస్తుంది. పనిలో ఇష్టత ఉంటే ఉత్సాహం వస్తుంది. మీలోని ఉత్సాహం తోటివారికి చేరుతుంది. సమిష్టిగా ముగించాల్సిన పనుల్లో ఉత్సాహం, దానికి మూలమైన ఇష్టత కీలకమవుతాయి.

## పనుల పంపకం

పని మొత్తం ఒక్కరే చెయ్యగలం అనేది పొరపాటు ఆలోచన. పనిలో ఇతరుల సహాయం అవసర



# కొండంత గుర్తింపు

మైనప్పుడు సహాయం అడగటానికి ఏ మాత్రం వెనకడుగు వేయవద్దు. ఒంటరిగా భారీ బాధ్యతలుచేపట్టి పనిచేసేవారు త్వరగా నీరసపడిపోతారు.

పని పూర్తికాదు. అందుకే పనులలో పంపకం పాత్ర కీలకం. నలుగురితో కలిసి పనిచేయుటమేకాదు, నలుగురికి పని పంచటం కూడా ఒక కళ.

పనులను విడగొట్టి ఒక్కొక్క బాధ్యతను ఒక బృందానికి అప్పగిస్తే వారంతా కలిసి సమాంతరంగా చేస్తూ చివరికి ఒక చోటికి చేరతారు.

అలా నలుగురికి పనులు అప్పగించి, తమవంతు పనిని తాము నిర్వహించేవారి మెదడు అంత త్వరగా అలసిపోదు. విశ్రాంతి లభిస్తుంది మెదడుకు.

## ఆఫీసులోనే

ఆఫీసు పనిని ఇంటికి మోసుకువెళ్ళేవారంతా కోరి తమ మెదడును పాడుచేసుకుంటున్నట్టే. పనితో పాటు ఆఫీసు ఒత్తిడులు, ఆఫీసు సమస్యలు కూడా ఇంటికి చేర్చుకోవటమవుతుంది.

ఇంటిదగ్గర పని చేస్తుంటే ఆఫీసు సమస్యలే మెదడులో సుడులు తిరుగుతాయి. దానివలన పనిచెయ్యలేరు. చెడిన మూడ్ ప్రభావం ఇంటి వాతావరణం మీద పడి అందరినీ భయపెడుతుంది. కాబట్టి ఆఫీసును, ఆఫీసు ఆలోచనలను,ఆఫీసు పనిని ఎవరైతే ఇంటికి తీసుకువెళతారో, వారు నిజానికి తమ పని సమర్థతను పోగొట్టుకుంటున్న వారవుతారు. ఆఫీస్ సమస్యలను అధిగమించాలంటే మెదడు చురుకుగా ఉండాలి. ఆ చురుకుదనం ఎక్కడి పనిని అక్కడే కేటాయించుకుంటే బాగుంటుంది.

ఆఫీసులో పని మధ్యలో కొద్దిగా విశ్రాంతి తీసుకోవటం మంచిదే. మధ్యాహ్న భోజనసమయంలో చిన్న నిద్రతీసినవారు ఆ తర్వాత ఉత్సాహంగా పని చేయగలుగుతారు. శరీరం,మనసులు రెండింటిఅలసటను దూరంగా నెట్టగలిగిన శక్తి ఆ చిన్ని నిద్రకు ఉంది.

## వినోద సమయం

పని... పని... అంటూ పూర్తికాలం పనిలో పడిపోతే అతి త్వరలో వయసుమీదపడుతుంది.

అసలు వయసుకన్నా రూపంలో వయసు ఎక్కువగా ఉంటుంది. కాబట్టి వినోదానికి సమయం తప్పనిసరి. వినోదంగా సినిమాలు, హోటల్స్, ఎగ్జిబిషన్స్ వంటివి ఎంచుకోవచ్చు. దీనితోపాటుగా విహారయాత్రలకు అప్పుడప్పుడు వెళ్ళిరావాలి.

భార్యాభర్తలు ఇరువురూ వెళ్ళిరాగలరు. పిల్లలతో ప్రేమయాత్రలు చెయ్యగలరు.మానసికఒత్తిడులను దూరం చేసి కొత్త శక్తిని అందిస్తాయి వినోద, విహార యాత్రలు. ప్రతి మూడు నెలల్లో ఒక మూడురోజులు అలా విహారంలో గడిపివస్తే జీవితంలో వచ్చే మార్పు, పనిలో పెరిగే సామర్థ్యం మీకు అర్థమవుతుంది.

## సహాయం తీసుకోవాలి

పనంతా నెత్తిన వేసుకుని తామెంతో కష్టపడుతున్నామని, ఇతరులకోసం త్యాగం చేస్తున్నామని అనుకునేవారుంటారు. తమమీద తామే జాలి ఏర్పరచుకోవటం ఒక వింతజబ్బు.అటువంటివారు వాస్తవంలో చేసేది ఇతరులు చెప్పిన పనులుకాదు. తమకు నచ్చిన పనులు మాత్రమే చేస్తారు.

కాని తాము చేసిన ప్రతి పనినీ గుర్తించి, అనుకూలంగా మాట్లాడాలనుకుంటారు.తాము చేసేపనిలో ఇతరులను వేలుపెట్టనియ్యరు. సహాయం చెయ్యబోతే విసుక్కుంటారు. దూరంగా ఉంటే పట్టించుకోవటంలేదంటారు.అటువంటి మనస్తత్వం కలవారు కోరి కష్టాలు తెచ్చుకుంటున్నవారవుతారు. మొత్తం మీద వేసుకోవాల్సిన అవసరంలేదు.

జీవిత భాగస్వామిని, పిల్లలను, ఇతర కుటుంబ సభ్యుల నుండి సహాయం కావాలని అడిగి పొందటం హక్కు. ఆ హక్కును సక్రమంగా వినియోగించుకుంటే పనులలో సమర్థత పెరుగుతుంది.

తక్కువ పనిలో ఎక్కువ ఫలితం పొందటం కష్టమైనది కాదు, అసాధ్యం అంతకన్నా కాదు. కేవలం అందుకు తగినవిధంగా జీవితాన్ని మలచుకోవాలంతే. అలాంటి మార్పు జీవితంలో తెచ్చుకునిచూడండి, ఫలితం మీకే అర్థమవుతుంది. వి.సుదర్శన్



సీరియల్

# అలజడి

పుట్టగంటి గోపీకృష్ణ



దినమణి చేతిలోని రైఫిల్ పక్కనపెట్టి సన్నగా ఏదో తమిళ పాట ఆనందంగా పాడుకుంటూ మధ్య మధ్య విజిల్ వేసుకుంటూ లఘుశంక తీర్చుకోవటానికి గుబుర్లమధ్యకి వచ్చాడు.

"వాడిని కొట్టి కిందపడేస్తే మనం రమేష్‌ని తీసుకువెళ్ళవచ్చు..." అన్నాడు కిరణ్. బలమైన దుంగ ఒకటి చేత్తో పట్టుకుని నిశ్శబ్దంగా లఘుశంక తీర్చుకుంటున్న దినమణి వెనుకకి వెళ్ళి నిలబడ్డాడు ఆదిత్య.

'కొట్టు... కొట్టు...' అన్నట్లు సైగలు చేస్తున్నారు మురారి, కిరణ్.

ఆదిత్యకి మాత్రం ధైర్యం చాలటంలేదు. జరుగుతున్నది చూసి నెత్తి కొట్టుకున్నాడు కిరణ్.

ఇంతలో దినమణి పని ముగించుకుని వెనక్కి తిరిగాడు. ఎదురుగా చేతిలో దుంగతో నిలబడ్డ ఆదిత్యని చూసి షాక్ అయ్యాడు.

అప్పటికీ ఆదిత్య ఎదుటి మనిషిని కొట్టే ధైర్యం చెయ్యలేకపోయాడు. దినమణి తేరుకుని ఆదిత్య మీదకి దూకి అతని చేతిలోని దుంగని అందుకోబోయాడు. అయితే ఆదిత్య దాన్ని వదల్లేదు.

ఇద్దరూ పెనుగులాడుతున్నారు.

పెనుగులాటలో ఏమి జరిగిందో కానీ, దినమణి కాలుజారి కిందపడిపోయాడు.

ఆ పడటంలో తల వెళ్ళి ఒక చెట్టుమానుకు పొడుచుకోవటంతో మళ్ళీ లేవలేదు. బిలబిలమంటూ మిగిలిన ఇద్దరూ ఆదిత్య పక్కకి వచ్చారు.

ఈలోపు ఆదిత్య కిందపడిపోయిన వ్యక్తిని కదిలించి చూశాడు. అతను లేచే పరిస్థితిలో కనపడలేదు. "అమ్మయ్యో!... వీడి పని అయిపోయింది..." అని అన్నాడు ఆదిత్య.

"నువ్వు ఎందుకు వణుకుతున్నావ్?" అని అడిగాడు మురారి.

"నేను ఎక్కడ వణుకుతున్నాను...?" అనబోయిన ఆదిత్య కాళ్ళు, చేతులతోపాటు దవడలు కూడా గుండె వేగంతో పోటీపడుతూ కొట్టుకుంటూవుండటంతో ఏమీ మాట్లాడలేకపోయాడు.

"ఇక చాల్లే..! ఎంతసేపు ఈ డ్యాన్స్ ప్రోగ్రామ్?" అన్నాడు కిరణ్.

"వీవీవీడుడుడుడు చచ్చిచ్చిచ్చి పోపో యాయాడంటాటావా?" అని వణుకుతూనే అడిగాడు ఆదిత్య.

"ఇప్పుడు మనం ఇక్కడకి వచ్చినది రమేష్ గురించా..? వీడి ఆరోగ్యం గురించి చర్చించటానికా?" అని విసుగ్గా అన్నాడు మురారి.

"ఇప్పుడు ఏం చేద్దాం?" ఆదిత్య కిరణ్‌వైపు చూశాడు.

కిరణ్ కిందపడిపోయిన దినమణి పంచె, చొక్కా విప్పి తను కట్టుకున్నాడు.

"భలే సూటైంది నీకు ఈ వేషం" అన్నాడు మురారి.

"నీ గుబురుమీసాలు భలే సూటయ్యాయి. అచ్చు వీడిలాగానే ఉన్నావు" అని చెప్పాడు మురారి.

ఎట్టకేలకు వణుకును తగ్గించుకున్న ఆదిత్య, "ఇక అడుగు ముందుకెయ్యి" అన్నాడు.

"నీకేం నువ్వు బానే చెప్తావ్. ఒకవేళ నాకేమన్నా అయితే" భయపడుతూనే ముందుకు అడుగేశాడు కిరణ్. మళ్ళీ గుబుర్లమధ్య దాక్కుని జరుగుతున్నది చూడసాగారు ఆదిత్య, మురారి.

కిరణ్ సరాసరి రైఫిల్ దగ్గరకు వెళ్ళి దానిని భుజా





నికి తగిలించుకుని చుట్టూ చూశాడు.

అక్కడ చెట్లు కొడుతున్న అందరినీ ఒకసారి పర్యవేక్షించి రమేష్ దగ్గరకు వచ్చాడు.

"ఎప్పుడన్నా చెట్లు కొట్టిన మొహమేనా ఇది?" కోపంగా అడిగాడు రమేష్ చెట్టు కొడుతున్న పద్ధతి చూసి.

"ఎందుకు సార్! నా మొహం చూస్తే అలా ఎందుకు అనిపించింది?" అని అమాయకంగా అడిగాడు రమేష్.

"ఒకసారి నీ గొడ్డలివైపు చూడు"

నాలిక కరుచుకున్నాడు రమేష్. మొన ఉన్న వైపు కాకుండా మరోవైపు గొడ్డలిని చెట్టుకేసి బాదుతున్నాడు ఇప్పటివరకూ.

"అందుకేనన్నమాట భుజాలు నొప్పులు పుడుతున్నాయి. ఏమయినా మీ తెలివే తెలివి సార్... నా లోపం ఇట్టే పట్టేశారు"

"సరిగ్గా కొట్టు..." అని మరోవైపు నడిచాడు కిరణ్. ఎవరికీ అనుమానం రాకుండా రమేష్‌ని ఇవతలకి తీసుకురావటం ఎలాగా అని ఆలోచిస్తున్నాడతను.

ఈలోపు గుబురు పొదల అవతల స్పృహతప్పిన దినమణి నెమ్మదిగా కదిలాడు.

"వాడు లేస్తున్నాడు..." అని భయం భయంగా అన్నాడు మురారి.

"వాడిని కొట్టటం నావల్లకాదు..." అని చెప్పేశాడు ఆదిత్య.



ఇంతలో దినమణి లేచి నిలబడ్డాడు. తనకు ఏమయిందో, ఎందుకు స్పృహ తప్పాడో అతనికి వెంటనే గుర్తురాలేదు.

"నాకు గుర్తుకురావటం లేదు..." అన్నాడు అమాయకంగా.

"బాగా ఆలోచించు... నువ్వు డాక్టరువా? ఇంజనీరువా?" అడిగాడు ఆదిత్య.

'కాదు' అటూ యిటూ అన్నట్లుగా తలను అడ్డంగా ఊపాడు దినమణి.

"పోనీ స్మగ్లర్‌వా?" అని గుర్తుచేసిన మురారి ఒక్కసారిగా కెవ్వున కేక పెట్టాడు. ఆదిత్య పెట్టిన తొడపాశంతో స్మగ్లర్ అన్న మాటతో దినమణిలో ఆలోచన మొదలైంది. అతను పైకి మాట్లాడుతూనే తనలో తను ఆలోచించుకుంటున్నాడు. 'అవును. నేను స్మగ్లర్‌నే! నా పేరు, నా పేరు' అని తిరిగి ఆలోచనలో పడ్డాడు.

ఇప్పుడు ఆదిత్యకి తిరిగి మళ్ళీ భయం పట్టుకుంది.

## జరిగిన కథ 23

రమేష్ పోలీస్ మనిషని భావించి అతనితో గోచీకట్టించి చెట్లను నరికిస్తాడు దినమణి.

మృదులతో మురారి సరసాల్లో పడతాడు. అతనిపై ప్రేమ కనబరుస్తుంది మృదుల. కొడుకు పెళ్ళిగురించి లక్ష్మితో మాట్లాడతాడు రంగారావు. రామ్మూర్తి పుంజాకు తను తెచ్చిన కల్లుని పట్టించి బరిలోకి వదులుతాడు కిరణ్. పక్కూరి మల్లికార్జునయ్య పుంజుమీద ఇది గెలిచి లక్షరూపాయలు గెలుస్తుంది.

నీ కూతురు గౌరిని ప్రేమించి మారువేషంలో తిరుగుతున్న కిరణ్ పెద్ద కోటీశ్వరుడని, అతనికి నీ కూతుర్నిచ్చి పెళ్ళిచెయ్యమని కాంతారావుతో చెబ్తాడు రామ్మూర్తి.

తన మనుమడు మురారి, మృదులను ప్రేమిస్తున్నాడని తెలిసి హతాశుడవుతాడు వరసిద్ధి. రమేష్‌ను వెదికేందుకు టైగర్‌వెంట బయల్దేరతాడు ఆదిత్య, కిరణ్, మురారి. వాళ్ళకి దినమణి బృందం కనపడుతుంది. వాళ్ళల్లో చెట్లు కొడుతున్న రమేష్‌ని గుర్తిస్తారు. తర్వాత జరిగేది చదవండి.

దినమణికి పూర్తిగా గతం గుర్తుకువస్తే అతన్ని ఎవరూ కూడా ఆపలేరు.

దినమణికి నెమ్మదిగా అన్నీ ఒక్కొక్కటిగా గుర్తుకు వస్తున్నాయి. తన గ్రూపులోకి ఎవడో ఒక కొత్త మనిషి రావటం. వాడు పోలీసేమో అని తనకు అనుమానం రావటం... కాస్త లింకు గుర్తుకురాగానే మొత్తం జ్ఞాపకం వచ్చింది అతనికి.

"మీరు కూడా వాడి మనుషులే... పోలీసులు. మిమ్మల్ని ప్రాణాలతో వదలను..." అని తన రైఫిల్‌కోసం అటూ ఇటూ చూశాడు.

"సార్! సార్!! చెప్పేది వినండి సార్" అని బ్రతిమలాడుతున్నారు ఆదిత్య, మురారి.

"ఇక వినేదేం లేదు. నన్నే చంపబోయారు కదూ... మిమ్మల్ని వదలను"

ఇక అతన్ని ఎలా కంట్రోల్ చెయ్యాలో వాళ్ళకి అర్థంకాలేదు. ఏ క్షణంలో అయినా అతను వెళ్ళి మిగిలిన దొంగలను హెచ్చరిస్తే తమ పని అఖరే...! వాళ్ళు ఆ ఆలోచనలో ఉండగానే ఒక పెద్ద చెట్టువిరిగి వచ్చి సరాసరి దినమణి నెత్తిన పడింది.

అతను మళ్ళీ స్పృహ కోల్పోయాడు. స్పృహతప్పిన అతన్ని చాటుకు లాగారు ఆదిత్య, మురారి.

ఇది ఎలా జరిగిందో అర్థంకాక ఆదిత్య, మురారి చాటుగా చెట్లుకొట్టేదగ్గర ఏం జరిగిందో చూశారు.

అక్కడ రమేష్ ఎడాపెడా నరుకుతున్న చెట్టు అనుకోనివైపు ఒరిగి ఇలా వచ్చి దినమణి మీదపడి తమని కాపాడింది.



## ఆచితూచి

నటనలో నివేదాకు వందశాతం మార్కులు పడుతూనేవున్నాయి.చేసే పాత్రలో జీవిస్తూ ప్రేక్షకులను మెప్పిస్తోందీ మలయాళీ కుట్టి.

'జెంటిల్‌మెన్', 'నిన్నుకోరి', 'జై లవకుశ' సినిమాల్లోని ఆమె నటన ప్రేక్షకుల మదిలో నిలిచిపోయింది. పరీక్షలపై దృష్టి కేంద్రీకరించిన నివేదా థామస్ ఈమధ్య కొత్త సినిమాలకు సంతకాలు చెయ్యడం లేదు. చాన్నాళ్ళ గ్యాప్‌తర్వాత ఇప్పుడో చిత్రానికి సంతకాలు చేసింది.

నాగశౌర్య హీరోగా నటించే ఈ సినిమాలోని తన పాత్ర ఆమెకు బోల్డంతగా నచ్చిందట. ఈ మధ్య జుట్టును బాబ్ కట్ చేయించుకున్నది బహుశా ఈ కొత్త అవతారంకోసమేనేమో!

"నీకు ఏపనీ సరిగ్గా చెయ్యటంరాదా?" రమేష్‌ను గదమాయిస్తూ చెట్టు పడిపోయిన దగ్గరకు వస్తూ అన్నాడు కిరణ్. ఆ చెట్టును చిన్న చిన్న దుంగలుగా కొట్టి లారీలలోకి ఎక్కించే పని వేరేవారికి అప్పచెప్పి "నువ్వు ఇటు రా!" అన్నాడు రమేష్‌తో.

ఈ కార్యక్రమం జరుగుతున్న ప్రాంతం మధ్యన ఒక గుడారం వేసి ఉంది. దాంట్లోకి నడిచాడు కిరణ్. భయం భయంగా అనుసరించాడు రమేష్.

"గోచీ విప్పు" అన్నాడు కిరణ్.

"ఇదికూడానా?" చేతులు అడ్డంపెట్టుకుంటూ అన్నాడు రమేష్.

"అది విప్పి నీ బట్టలు కట్టుకోరా వెధవా?"

అతని మాటలకి అనుమానం వచ్చి, "నువ్వా" అన్నాడు రమేష్.

"నేనేలే! కిరణ్‌ని"

కిరణ్ బుగ్గమీద ఒక ముద్దుపెట్టి కొండంత ధైర్యంతో తన బట్టలు కట్టుకున్నాడు రమేష్.

"ఇక నువ్వు ఆ పొదల్లోకి వెళ్ళు. రెండునిమిషాల తరువాత ఎవరికీ అనుమానం రాకుండా నేను కూడా వస్తాను" అని, ఆదిత్య, మురారి ఉన్న పొదలవైపు చూపించాడు కిరణ్. అతన్ని ఆనందంగా రిసీవ్ చేసుకున్నారు మిగిలినవారు.

టైగర్ తోక ఊపుకుంటూ అతని దగ్గరికి వచ్చింది. దాన్ని వాటేసుకుని ఆనందం వెలిబుచ్చాడు రమేష్. అదికూడా తన అలవాటుకొద్దీ తన ఆనందాన్ని ప్రకటించింది. అది చూడలేక మిగిలినవారు తల తిప్పుకున్నారు. అయితే రమేష్ మాత్రం ఇరిటేట్ కాకుండా నవ్వుమొహంతోనే ఉన్నాడు.

ఇంతలో అతని చూపు అక్కడ పడి ఉన్న దినమణి మీద పడింది. అతన్ని చూడగానే కోపం పొంగుకు వచ్చింది. "వీడిని ఇలా వదలకూడదు" అంటూ వాడి దగ్గరకు ఆవేశంగా వెళ్ళాడు.

కిందపడి ఉన్న దినమణి నడుముకు ఒక చిన్న కత్తి వేలాడుతోంది. దాన్ని బయటకు తీసి అతని మెడమీద పెట్టాడు. "ఆగరా! ఆవేశంలో ఏం చేస్తున్నావో అర్థమవుతోందా? వాడిని చంపితే నువ్వు జైలుకు పోతావ్" ఆందోళనగా అతని పక్కకి వచ్చి అన్నారు ఆదిత్య, మురారిలు.

"వీడిని నేను ఎందుకు చంపుతాను" అని అతని మీసాలు నీటుగా తీసెయ్యసాగాడు రమేష్.

"నిమిషానికొకసారి వాటిని దువ్వుతూ అందరి మీదా జులుం ప్రదర్శిస్తుంటాడు. వీడి పొగరు అణుగుతుంది..." అంటూ తను చెయ్యదలచుకున్న పని పూర్తిచేశాడు. ఇంతలో కిరణ్ వచ్చాడు. "ఇక పదండి పారిపోదాం" అంటూ అందరినీ తీసుకుని ముందుకు నడిచాడు. టైగర్ వారికి దారి చూపించసాగింది.

వాళ్ళు అలా వెళ్ళారో, లేదో దినమణికి మెలకువ వచ్చింది. లేచి తూలుకుంటూ చెట్లు కొడుతున్న ప్రదేశంలోకి వచ్చాడు. అందరూ తలెత్తకుండా చెట్లు కొట్టే పనిలో నిమగ్నమై ఉన్నారు.

"వాళ్ళు పారిపోతున్నారు పట్టుకోండి" గట్టిగా అరచి చెప్పాడు దినమణి.

అతని మాటని ఎవరూ పట్టించుకోలేదు.

"నేను దినమణిని చెప్తున్నాను వాళ్ళని వెంబడించండి" అన్నాడతను ఆవేశంగా.

అందరూ ఒకసారి ముసిముసి నవ్వులు నవ్వారు తప్ప అతని మాటలు పట్టించుకోలేదు. దానిక్కారణం ఒక్క క్షణంలో బోధపడింది దినమణికి.

మీసంమీదకి పోయిన అతని చేతికి అది తగల లేదు. కెవ్వున అరిచాడు అతను.

ఈ అవమానంకంటే ప్రాణం పోవటమే నయం అనిపించింది అతనికి... తనని తన అనుచరులే ఎందుకు గుర్తించటంలేదో అతనికి అర్థమయింది. తన ప్లాన్ మార్చాడు.

"వాళ్ళు మన దినమణిని ఎత్తుకుపోతున్నారు. వెంబడించండి" అన్నాడు.

అంతే!... అందరూ గొడ్డళ్ళు పక్కన పడేసి తలా ఒక దిక్కుకీ పరుగెత్తబోయారు.

"అటు కాదు ఇటు" మళ్ళీ గట్టిగా అరచి రమేష్ పారిపోయిన దారివైపు చూపించాడు.

అందరూ అటు పరుగెత్తారు. తనుకూడా వారి ననుసరించాడు దినమణి. అప్పటికే చాలా దూరం వచ్చేశారు ఆదిత్య బృందం. టైగర్ చూపిస్తున్న దారిలో చకచకా ముందుకు కదులుతున్నారు.

వెనుకనుండి వినిపిస్తున్న కోలాహలం విని మరింత వేగం పెంచారు వారు. క్రమక్రమంగా రెండు గ్రూపుల మధ్య దూరం తగ్గిపోయింది. ఇంతలో రెండు గ్రూపులనూ ఆశ్చర్యపరుస్తూ మూడో గుంపు ఎదురువచ్చింది. వాళ్ళంతా ఊర్లోవాళ్ళు. వారితోపాటు యూనిఫామ్ ధరించిన పోలీసులు కూడా ఒకరిద్దరు ఉన్నారు.

వాళ్ళని చూసి దినమణి గ్రూపు వెనక్కి పారిపోబోయిందికానీ పోలీసులు అది ముందే ఊహించి వాళ్ళని రౌండప్ చేశారు. పోలీసులు స్మగ్లర్లందరినీ అరెస్ట్‌చేసి తీసుకుపోతుంటే దినమణి మెలిక పెట్టాడు.

"దినమణి నేను కాదు... అక్కడ ఉన్నాడు" అన్నాడు అతను కిరణ్‌ని చూపిస్తూ...

"నేనా?" అన్నాడు కిరణ్ ఆశ్చర్యంగా.



బహిరంగంగా మాట్లాడటం బాధాకరమే... అయితే మరో మార్గంలేక సుప్రీమ్‌కోర్టులో అవాంఛనీయరీతిలో సాగేవాటిని బయటపెడుతున్నాం.

-జస్టిస్ చలమేశ్వర్

సుప్రీమ్‌కోర్ట్ న్యాయమూర్తి



సుప్రీమ్‌కోర్టులో ఎటువంటి సంక్షోభం లేదు.

-జస్టిస్ రంజన్ గొగోయ్

సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి



"అవును. అతనే!... ఆ మీసాలే రుజువు" పోలీసులుకూడా గుసగుసలాడుకున్నారు.

"ఎందుకైనా మంచిది ఇద్దరినీ తీసుకువెళతాం" అన్నారు వాళ్ళు.

"ఇవి నిజం మీసాలు కాదు" తన పెట్టుడుమీసాలు తీస్తూ అన్నాడు కిరణ్.

"మీసాలు ఉన్నవాడే 'దినమణి' అయితే నాకూ మీసాలు లేవుగా" అన్నాడు దినమణి.

'ఈ కన్ఫ్యూజన్ అంతా నీవలనే' అన్నట్లుగా అందరూ కోపంగా రమేష్‌వైపు చూశారు.

"అయిడియా..." అన్నాడు ఆదిత్య. గబగబా వెళ్ళి పోలీసుల చెవిలో ఒక మాట చెప్పాడు.

వాళ్ళు కూడా తల ఊపారు. ఏం జరుగుతోందో ఎవరికీ అర్థంకాక ఆత్రుతగా చూస్తున్నారు.

పోలీసుల ఆదేశంమీద ఆవుపేడ తెచ్చి దినమణి, కిరణ్ నెత్తిమీద గుమ్మరించారు. "ఛీ! ఛీ!!" అన్నాడు దినమణి చీదరించుకుంటూ.

"వాటె స్వీట్ స్మెల్" అన్నాడు కిరణ్ గౌరిని గుర్తు చేసుకుంటూ.

పోలీసులు అసలు దినమణిని అరెస్ట్ చేసి, అంత పెద్ద స్మగ్లింగ్ ముఠాని పట్టించినందుకు అందరినీ అభినందించారు.

ఆదిత్య బృందం ఇంటికి చేరుకుంది.

ఆదిత్య, ఈషిక... మురారి, మృదుల... రమేష్, సౌందర్య... కిరణ్, గౌరి... నాలుగు జంటలు కూడా కబుర్లలో మునిగిపోయాయి.

మిగిలినవాళ్ళందరూ పండుగ పనుల్లో మునిగి పోయారు.

## రేణు సుద్ కర్నాడ్
### (హెచ్‌డిఎఫ్‌సి ఎమ్‌డి)
## మనీ టిప్స్

"అందుబాటులో ఇంటి నిర్మాణం అనేది మన దేశంలో కొత్త మంత్రగా ఉంది.

మెట్రోలలో ప్రముఖ డెవలపర్లు అందుబాటు ధరలతో ప్రాజెక్టులు ఆరంభిస్తున్నారు.

ఇంటిని కావాలనుకునేవారు భూమి ఖరీదు తక్కువగా ఉండేలా జాగ్రత్తపడాలి. దీనివల్ల రుణాలపై చెల్లించాల్సిన వడ్డీరేట్ల భారం తగ్గుతుంది.

తమ నెలవారీ ఆదాయ వ్యయాలను అంచనా వేసుకుని ఇంటి రుణాలు తీసుకుంటే ఇఎంఐలు భారం కావు. కుటుంబ ఆర్థిక విశ్లేషణ చేసుకుని, స్వంత ఇంటిని సమకూర్చుకోవాలి"

"అన్యాయం" అరుచుకుంటూ వచ్చాడు వ్యాఘ్రం. "నువ్వు నమ్మకద్రోహివి... నా సక్సెస్ మీట్ చెడగొట్టి నీ పెళ్ళి చేసుకుంటావా?"

"ఏమయింది వ్యాఘ్రం..." అని సముదాయించ బోయాడు వరసిద్ధి.

"మురారికి ఈషికని సెట్‌చేసి ఒక్కగానొక్క కేసు అయినా నా అంతట నేను సెటిల్ చేద్దామను కున్నాను. అదికూడా కుదరకుండా చేశాడు ఈ ఆదిత్య" అన్నాడు.

"పోనీవయ్యా! మాకులేని బాధ నీకెందుకు?" అంటూ ఓదార్చాడు వినాయకరావు.

"ఇంతమంది ప్రేమికులని కలిపిన నీ కంపెనీ గొప్పదయ్యా" అన్నాడు రామ్మూర్తి.

"ఎంతోమంది ప్రేమించుకుంటున్నారు. వారి ప్రేమని పండించుకోలేక ఒంటరిగా మిగిలిపోతున్నారు. ప్రేమికులెవరూ. 'అక్కడ ఆయనా, ఇక్కడ ఈవిడా'లా మిగిలిపోకూడదన్నదే మా కంపెనీ మోటివ్.

దానినే కుదించి 'అఆఇఈ' అని కంపెనీకి పేరు పెట్టాం. అది ఇలా సక్సెస్ బాటలో నడవటం చాలా ఆనందంగా ఉంది" చిన్న స్పీచ్ ఇచ్చాడు ఆదిత్య.

"ఇంకా నయం కంపెనీ పేరు మీ ఇద్దరి పేరుమీద. 'అక్కడ ఆదిత్య, ఇక్కడ ఈషికా' అంటావేమో అను కున్నాను" అక్కసుగా అన్నాడు వ్యాఘ్రం.

"గెలిచింది నేను-కాదు, మన 'అఆఇఈ'. అది మన ఇద్దరిదీ" చెప్పాడు ఆదిత్య.

"ఇక నాకు మిగిలింది అదేగా. ఇంతకీ ఈ కిరణ్ చేత మూడురెట్లు ఫీజు ఇప్పిస్తానన్నావ్. గుర్తుందా"

"మూడురెట్లేం ఖర్మ. కోటిరూపాయలు మీ కంపెనీకి నా ఫీజుగా ఇస్తాను. చాలా" అన్నాడు కిరణ్.

ఆ మాట వినగానే స్పృహతప్పి పడిపోయాడు వ్యాఘ్రం.

-: అయిపోయింది :-



న్యాయవ్యవస్థ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకునే మేము బహిరంగంగా మాట్లాడాల్సివచ్చింది.

-జస్టిస్ కురియన్ జోసెఫ్
సుప్రీమ్‌కోర్ట్ న్యాయమూర్తి

# అంతా రాజకీయమే



## పోల్ బాండ్ పాలిటిక్స్

రాజకీయ పార్టీలకు అందే నిధులు చాలా రహస్యంగా ఉంటాయన్నది అందరికీ తెలిసినదే. అటువంటి గోప్యతను భగ్నం చేస్తామన్న మోడీ ప్రభుత్వం పోల్ బాండ్ పథకం తెచ్చింది.

దీనిప్రకారం ఎవరైనా రాజకీయపార్టీకి నిధులు ఇవ్వాలంటే ఎస్.బి.ఐ.లో డబ్బుకట్టి, కట్టేవారి వివరాలు ఇచ్చి పోల్ బాండ్ తీసుకుని దానిని రాజకీయ పార్టీకి ఇస్తే వారు 15 రోజుల్లో తమ ఎకౌంట్‌లో వేసుకోవాలి. ఎవరు నిధులు ఇస్తున్నారో బ్యాంక్ వారికి తప్పించి మరెవరికీ తెలియదు.

ఇంతకన్నా పారదర్శకత ఏంకావాలి అంటుంది ప్రభుత్వం. నిధులు ఇచ్చేవారి వివరాలు ఎస్.బి.ఐ.కి తెల్సు. అంటే ప్రభుత్వానికి సులభంగా తెలుస్తుంది. అటువంటప్పుడు నిధులను ప్రతిపక్షాలకు ఇవ్వటానికి ఏ సంస్థా ముందుకు రాదు. తాము నిధులిచ్చినట్టు తెలిస్తే ప్రభుత్వం వారిని వేధిస్తుందన్న సందేహం ఆ సంస్థల్లో కల్గుతుందికదా అన్నది కాంగ్రెస్ ఆరోపణ.

ప్రతిపక్షాలకు నిధులందకుండా, కార్పొరేట్ నిధులన్నీ అధికార పార్టీకిమాత్రమే దక్కేలా చెయ్యటమే పోల్ బాండ్ పథకం అంటున్నది కాంగ్రెస్.మరి ఈ ఎన్నికల సంస్కరణ ఏమవుతుందో ఏమిటో! ◆

## ...పల్లకీల మోత

ఇంట్లో ఈగలమోత వీధిలో పల్లకీల మోత అనే తెలుగు సామెత నరేంద్రమోడీకి ఇప్పుడు అక్షరాల సరిపోతుంది. నరేంద్రమోడీ తీసుకున్న పెద్ద నోట్ల రద్దు, జి.ఎస్.టి. వంటి నిర్ణయాలన్నీ దేశాన్ని ఆర్థికంగా దెబ్బతీశాయని, వృద్ధిరేటు తగ్గిందని దేశంలోని ప్రజలు, ప్రతిపక్షాలు కోడై కూస్తూ, తీవ్ర విమర్శలు సంధిస్తున్నారు.

ఈ ప్రభుత్వం ఎక్కువ సమయం ఉంటే మరీ నష్టం అంటున్నారు. కాని విదేశాలలో నరేంద్రమోడీ ప్రభ వెలిగిపోతోంది. ఇటీవల జరిగిన ప్రపంచ సర్వేలో ప్రపంచ నాయకుల్లో ట్రంప్, పుతిన్‌లను వెనక్కినెట్టి మూడవ స్థానంలో నిలబడ్డాడు.

ఎంతో ముందుచూపు కలిగిన, కొత్త ఆలోచనలు ఉన్న ఒక గొప్ప నాయకుడు, ఈ సమయంలో అటువంటి నాయకత్వం దొరకటం భారత్ అదృష్టం అంటున్నారు విదేశీ నాయకులు.

ఆర్థికంగా భారత్ ఎదగటం ఖాయమని 2018లోనే అది ప్రపంచంలో ఐదవ అతిపెద్ద ఆర్థికవ్యవస్థ అవుతుంది. ఆపైన మూడవ స్థానం అంటూ తెగ పొగిడేస్తున్నారు. ఇంతకీ ఏది నిజం!! ◆

## కోదండరామ్ కొత్త పార్టీ

తెలంగాణ ఉద్యమ సమయంలో పెద్ద కుర్చీలో కూర్చోపెట్టి మీరే మా పెద్ద దిక్కు అని కోదండరామ్‌కి నమస్కారం పెట్టిన కె.సి.ఆర్ ఎన్నికల్లో గెలిచినతర్వాత కోదండరామా! ఎవరాయన! అంటూ తీసిపారేశాడు.

కోదండరామ్ కూడా అంత తక్కువవాడేం కాదు కదా. తన పద్ధతిలో ఉద్యమం చేస్తాననటం, కెసిఆర్ ఆర్డర్స్‌మేరకు ఎత్తుకెళ్ళి కె.సి.ఆర్.ని అవతలపడేయటం జరుగుతోంది.

మమ్మల్ని సవాలు చెయ్యటానికి కోదండరామ్ ఏ పార్టీవాడు అని ఎద్దేవా చేశారు టి.ఆర్.ఎస్.వారు. చేతనయితే కొత్త పార్టీపెట్టి పోటీచెయ్యమని సవాలు విసిరారు. ఇప్పుడు ఆ సవాలు స్వీకరించి ఫిబ్రవరిలో కొత్త పార్టీ అంటున్నాడు కోదండరామ్.

వెంటనే ఆయనకు మా మద్దతు అన్నది ఎర్రదండు. మావోయిస్టులతో సంబంధాలు ఉన్నాయి కాబట్టి వారు మద్దతు ఇవ్వవొచ్చు. అయితే కెసిఆర్ వ్యతిరేక ఓటు చీలిపోతుందన్నది కాంగ్రెస్ భయం. కాని పార్టీపెట్టి తీరతానని, కె.సి.ఆర్.ని గద్దె దించటమే లక్ష్యం అని అంటున్నాడు కోదండరామ్. మరి తెలంగాణ ఓటర్లు ఏమంటారో. ◆

## కలిశారు సరే

ఎట్టకేలకు చంద్రబాబునాయుడు, నరేంద్రమోడీ బేటీ అయ్యారు. ఒక సి.ఎమ్. ప్రధానమంత్రిని కలవటం గొప్ప వార్త కాదు. కాని సంవత్సరం వేచివున్న తర్వాతగాని దొరకని ఇంటర్వ్యూ.

ఇబ్బందుల్లో ఉన్న రాష్ట్రానికి సి.ఎమ్. కాబట్టి ఆ సమావేశం గురించి అంతా ఆసక్తిగా ఎదురుచూశారు. వారిద్దరిమధ్య ఏం జరిగివుంటుంది. చంద్రబాబు ఏం కోర్కెలు కోరివుంటాడు, నరేంద్రమోడీ ఏమి తీరుస్తానన్నదీ నేటికీ అర్థంకాని విషయం.

కుదరకపోతే న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తాం అని చంద్రబాబు చివరిగా అన్న మాట టి.డి.పి., బి.జె.పి.ల మధ్య సంబంధాలు అంతగా బాగోలేవని స్పష్టమైంది. చంద్రబాబు కోర్కెలు తీర్చేందుకు నరేంద్రమోడీ సిద్ధంగా లేడని అర్థమైంది.

ఇద్దరికీ మనసులో ఉన్న కోరికలు వేరు. బయటకు అడుగుతున్నవి వేరు. ఆ లోపలి విషయాలలో సర్దుబాటు అయితే తప్పించి రాష్ట్ర విషయాలు తేలవని అర్థమవుతుంది. ఇక వచ్చే ఎన్నికల వేళవరకు ముసుగులో గుద్దులాట ఇలాగే కొనసాగుతుంది. నష్టం రాష్ట్రానిది, వినోదం నాయకులది. ◆

## చర్చకు నై నై

తెలంగాణ ఉద్యమ సమయంలో కెసిఆర్ మొదలుకుని గల్లీ స్థాయి నేతవరకు ప్రతి ఒక్కరూ చర్చలకు సవాళ్ళు విసిరినవారే.

అటువంటి టి.ఆర్.ఎస్. వారు ఇప్పుడు చర్చ అనే మాట వినటానికే ఇష్టపడటంలేదు. తెలంగాణ రాష్ట్రంలోని ప్రస్తుత పరిస్థితులమీద ఏ ఒక్క అంశంమీదా చర్చకు రండని పిలిచినా మాతో చర్చించే స్థాయి మీకు లేదనే అర్థంలేని మాటలతో తప్పించుకుంటున్నారు.

'కాంగ్రెస్ నేత రేవంత్‌రెడ్డి సవాల్ విసిరితే చర్చకు నే వస్తా' అంటూ ఎమ్.పి. ఒకరు సవాలు స్వీకరించాడు. కాని అనుకున్న సమయానికి నిర్దేశిత ప్రదేశానికి రాకుండా మాయమయ్యారు.

అదేమంటే వారి అధినేత చర్చలకు సవాలు స్వీకరించటం ఏమిటి, అసెంబ్లీలో తప్ప బయట చర్చించే సంస్కృతి మాది కాదు అని తప్పించుకోవాలిగాని అని రాజకీయం బోధించాడట.

చూశారా పదవి వచ్చేసరికి చర్చలకు అర్థం, చర్చా వేదికలు ఎలా మారిపోయాయో... అప్పుడు చర్చ ప్రశ్నలు సంధించటం... ఇప్పుడు చర్చలో సమాధానాలు చెప్పాలి. అదీ తేడా... ◆

## హిందూ డివైడెడ్ ఫ్యామిలీ

నిన్న మొన్నటివరకు ఒక్కటిగా ఉన్న నరేంద్రమోడీ, విశ్వహిందూ పరిషత్ అధ్యక్షుడు ప్రవీణ్‌తొగాడియాల మధ్య హఠాత్తుగా ఏమైందో తెలియదు.

కాని హఠాత్తుగా తొగాడియా నన్ను చంపటానికి గుజరాత్, రాజస్థాన్ పోలీసులు కుట్ర పన్నుతున్నారంటూ సంచలన ప్రకటన చేశాడు.

ఇంతకాలం హిందువులను ఐక్యం చేయటమే లక్ష్యంగా ఆర్.ఎస్.ఎస్., వి.హెచ్.పి., బి.జె.పి. కృషి చేస్తున్నది. హిందూ అన్ డివైడెడ్ ఫ్యామిలీ అని సంఘ్ పరివార్ అని అంటుండేది మీడియా.

అంతగా ఒకరితో మరొకరు కలిసిపోయి ఐక్యంగా ఉండేవారు. రామజన్మభూమి ఉద్యమం సంయుక్తంగా చేసినదే. 2014లో బి.జె.పి. గెలుపువెనుక వి.హెచ్.పి. ఉంది. అధికారం వచ్చినతర్వాత అంతా సజావుగా సాగాలి. మరి ఇప్పుడు వి.హెచ్.పి. నేత నోటివెంట ఈ సంచలనమయిన మాటలు ఏమిటో, ఎందుకో నన్నది ఇప్పుడు వస్తున్న ప్రశ్న.

కీలకమైన ఎన్నికల వేళ హిందూ పరివార్‌లో వస్తున్న లుకలుకలు కాంగ్రెస్‌వారికి సువార్తగా వినపడుతున్నాయి. కర్ణాటకలో గెలుపునకు వి.హెచ్.పి. విభేదాలు పనికివస్తాయన్న అంచనా కాంగ్రెస్‌ది.

# గాంధీజీ మృతిపై వివాదమా!

మహాత్మాగాంధీ మరణించి సరిగా ఏడు దశాబ్దాలు. శాంతిమంత్రం జీవితమంతా పఠించి, అహింసను బోధించిన మహాత్ముని ప్రాణం తీసేందుకు కుట్రపన్నటమే ఒక విచిత్రమైతే, తుపాకీ తూటాలు ఆయన్ని బలితీసుకోవటం విచారకరం. కాని జరిగింది జరిగిపోయింది. హంతకుడిని నిర్ధారించి ఉరితీయటం జరిగింది.

మహాత్మాగాంధీ బలిదానాన్ని స్వాతంత్ర్యసమర యోధులందరినీ స్మరించుకునే మృతవీరుల దినోత్సవంగా జాతి జరుపుకుంటున్నది ఇంతకాలం. కాని ఈసారి మహాత్మాగాంధీ వర్ధంతినాడు జాతి స్మరించుకోవటమేకాదు మరో విషయం చర్చించుకోవాల్సిన పరిస్థితి.

మహాత్మాగాంధీ హత్యమీద పునర్విచారణ జరిపించి, అసలు దోషులు ఎవరో తేల్చాలంటూ అభినవ్ భారత్ సంస్థ వ్యవస్థాపకుడు డా॥ పంకజ్ ఫడ్నవీస్ సుప్రీమ్‌కోర్టులో పిటీషన్ వేశాడు.

సుప్రీమ్‌కోర్టు ఆ పిటీషన్‌ని విచారణకు స్వీకరించటం ఒకపెద్ద ఆశ్చర్యం.గాంధీజీహత్య ఒక కుట్ర ప్రకారం జరిగిందని,అందులో భాగంగా నాథూరామ్ గాడ్సే హత్యచేశాడని కోర్టు నాడు విశ్వసించింది.

అతనితోపాటుగా కుట్రలోనూ, హత్యలోనూ పాల్గొన్నవారిగా భావించిన నాథూరామ్ గాడ్సే, నారాయణ ఆప్టేలకు ఉరిశిక్ష, నాథూరామ్ గాడ్సే సోదరుడు గోపాల్ గాడ్సేతో సహా మిగిలిన ఆరుగురికి జీవితకాలపు శిక్షలను విధించారు.

శిక్షలు అమలయ్యాయి. జీవితకాలపు శిక్ష ముగించుకుని బయటకు వచ్చిన గోపాల్ గాడ్సే ఆ తర్వాత కొంతకాలం జీవించి మరణించారు.

గాంధీజీ హత్య విచారణసమయంలో ఆహత్య తానెందుకు చేసింది వివరంగా గాడ్సే కోర్టులో చెప్పిన దానిని చాలాకాలం బయటిప్రపంచానికి తెలియకుండా దాచిపెట్టారు. ఇప్పుడు గాడ్సే వాదన బయటకు వచ్చింది. ఆ హత్య తానే చేశానని గాడ్సే అంగీకరించాడు.అటువంటి సమయంలో గాంధీజీహత్యను పునఃపరిశీలించాల్సిన అవసరం ఏమిటి!

70 ఏళ్ళ తర్వాత తిరిగి ఆ హత్యాఘటనను భారతీయుల కళ్ళముందు నిలపాల్సిన అవసరం వుందా! అనే ప్రశ్నలు వేసి తమ ముందుకు వచ్చిన పిటీషన్‌ను నిర్ద్వంద్వంగా తిరస్కరించాల్సిన సుప్రీమ్‌కోర్టు సరేనని స్వీకరించటం ఏమిటి!

గాంధీజీ హత్యకు సంబంధించి పిటీషనర్ లేవనెత్తిన అంశాలలో ఎంతో కొంత నిజం ఉందని సుప్రీమ్‌కోర్టు భావిస్తున్నదా!

గాంధీజీ హత్య కేసును తిరిగి పరిశీలించాలంటూ పిటీషన్ వాదించేదానిలో కీలకఅంశం గాంధీజీ హత్య వెనుక బ్రిటీష్ వారి కుట్ర వున్నదనేది ముఖ్యమైనది. బ్రిటీష్‌రాణి ఆధ్వర్యంలో పనిచేసే ఫోర్స్ 136 అనే రహస్య పోలీసు సంస్థ బ్రిటన్‌లో వుండేది.

ఈ సంస్థ నేటి సి.ఐ.ఐ., కె.జి.బి. వంటి సంస్థలు. తమ దేశానికి అడ్డుగా నిలుస్తారనుకున్న ఇతరదేశాల నాయకులను చంపించే పథకాలు విజయవంతంగా నిర్వహించిన చరిత్ర ఆ యా సంస్థలకుంది.

అటువంటి బ్రిటీష్ ఫోర్స్ 136 భారతదేశంలోని నాయకులలో సుభాష్‌చంద్రబోస్ హత్యకు కుట్ర



పన్నిందన్న అనుమానం వుంది. గాంధీజీ హత్యలో వారి పాత్ర వుందనేది ఇప్పుడున్న సందేహం.

గాంధీజీ హంతకులలో ఉరిశిక్ష పడినవారిలో నాథూరామ్ గాడ్సే నేరాన్ని అంగీకరించి ఉరికి సిద్ధమన్నాడు. కాని రెండవవాడైన నారాయణ ఆప్టే తన నేరాన్ని అంగీకరించక ప్రైవీ కౌన్సిల్‌కి అప్పీల్ చేసుకున్నాడు. కాని అతని అప్పీల్‌కి అవకాశం కల్పించక, మరో మూడునెలల్లో ఏర్పడబోతున్న రాజ్యాంగం వచ్చేవరకు వేచివుండక నవంబరు 15, 1949న ఉరితీయటం అప్పట్లో ఒక సంచలనం.

నారాయణ ఆప్టే బ్రిటీష్ సైనికదళంలో పనిచేశాడు. అతను బ్రిటీష్ ఏజెంట్‌గా వ్యవహరించాడన్నది నేటి అనుమానం. నాథూరామ్ గాడ్సే తన తుపాకీ నుండి మూడు తూటాలను పేల్చానన్నాడు. కాని గాంధీజీ శరీరంమీద నాలుగు తూటాల గాయాలు వున్నాయని పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్‌లో వుందంటారు.

గాంధీజీ హత్య వెనకున్న కుట్రను ఛేదించే విచారణకు నియమించిన కపూర్ కమిటీ కూడా ఈ విషయంలో ఇదమిత్థంగా ఏదీ తేల్చలేదు.కాని గాంధీజీమీదికి నాలుగు తూటాలు వెళ్ళాయంటున్నారు. నాలుగుసార్లు పేలుడు శబ్దం వచ్చిందని కొందరు మాత్రమే చెప్పారు. మిగిలినవారు నాల్గవ బుల్లెట్ శబ్దం వినలేదన్నారు. ఏమైనా తొలి తూటా పేలగానే గాంధీజీ పడిపోవటం, చుట్టూ వున్నవారు షాక్‌లోకి వెళ్ళడం సహజంగా జరిగివుంటుంది.

ఆ గందరగోళంలో ఎన్ని తూటాలు పేలుతున్నాయని లెక్కపెట్టగలిగిన స్థితిలో ఎవరూ వుండే అవకాశమే లేదు. కాని నాలుగు తూటా గాయాలున్నట్టు ఫోటోలో కనిపిస్తోంది.

మహాత్మాగాంధీ హత్యలో బ్రిటీష్ వారి హస్తముందనేందుకు మరో సాక్ష్యంగా ఆయన హత్యకు ముందే బ్రిటన్‌వారు తయారుచేసిన సంతాప సందేశాన్ని పేర్కొంటున్నారు. లండన్ నుండి విదేశాలలో వున్న అన్ని బ్రిటీష్ దౌత్యకార్యాలయాలకు ఈ సందేశం పంపబడింది.

గాంధీజీ మరణవార్త విన్నవెంటనేఎలాంటిసందేశం ఇవ్వాలన్నది ఆ ఉత్తరం. గాంధీజీ అనారోగ్యంతో లేరు. మరణశయ్యమీద అంతకన్నా లేరు. అటువంటిది గాంధీజీ మరణిస్తే ఇవ్వాల్సిన సంతాప సందేశం అనే ఆలోచన బ్రిటీష్‌ప్రభుత్వానికి ఎందుకు కల్గింది! ఇది నేడు సుప్రీమ్‌కోర్టు ముందున్న అంశం.

గాంధీజీ హత్య జరిగినరోజున అమెరికన్ దౌత్యవేత్త ఒకరు అక్కడవున్నారు.తూటాలు పేల్చిన నాథూరామ్‌గాడ్సేని పట్టుకోవటంలో ఆయన పోలీసులకు సహకరించాడు. ఆయన అక్కడ ఎందుకున్నాడు. హత్య సంఘటనమీద అమెరికా ప్రభుత్వానికి నివేదిక ఇవ్వటం దౌత్యవేత్త బాధ్యత.

ఆ బాధ్యతలో భాగంగా అతను పంపిన నివేదికను అమెరికా ప్రభుత్వం 'మా దేశ భద్రతా వ్యవహారాల దృష్ట్యా బయటపెట్టలేం' అంటున్నది. నేటివరకు బయటపెట్టలేదు. భారతదేశంలో ఏ పదవిలో లేని గాంధీజీ హత్యకు, అమెరికా భద్రతకు సంబంధం ఏమిటి! ఈ ప్రశ్నకు సమాధానం లేదు. ఎలా చూసినా గాంధీజీ హత్య కుట్రలో కొంతభాగమే బయటకు వచ్చిందేమో అనిపిస్తుంది.

గాంధీజీ హత్యను ఆధారంచేసుకుని కొందరు నాయకులను, సంస్థలను 'ద్రోహులు'గా చూపే యత్నం భారతప్రభుత్వం చేసిందా అనే సందేహం కలగకమానదు.గాంధీజీ హత్య అంశంలో వేసిన పిటీషన్ అంశంలో తమకు సహకరించమని సుప్రీమ్‌కోర్టు నియమించిన న్యాయవాది మాజీ సొలిసిటర్ జనరల్ అమరేంద్ర శరణ్ గాంధీజీ హత్యకేసును తిరగతోడాల్సిన అవసరం లేదని కోర్టుకు స్పష్టం చేశాడు.

కాబట్టి ఇప్పటికైనా గాంధీజీ హత్య విషయంలో అనవసరపు వివాదాలను పక్కనపెట్టి జాతిపిత అనుసరించిన విధానం, నెలకొల్పిన విలువల విషయం స్ఫూర్తిగా తీసుకుంటే బాగుంటుంది.

# కదిలే బొమ్మల కబుర్లు





## తొలి అనుభూతి

తనతొలి కెమెరాఅనుభవాలను లావణ్యత్రిపాఠీ మరోమారు గుర్తు చేసుకున్నది. "'అందాల రాక్షసి' నా తొలి సినిమా. మొదటిసారిగా నన్ను నేను తెరపై చూసుకున్నప్పుడు భావోద్వేగాలకు గురయ్యా.

అంతకుముందు అనేక వాణిజ్య ప్రకటనలలో పనిచేశాను. కాని, అప్పుడేమీ అనిపించలేదు.

వెండితెరపై చూసుకున్నప్పుడే రకరకాల భావాలు కలిగాయి. నా మొదటి చిత్రం విడుదలైనప్పుడు అమ్మా,నాన్న, అన్నయ్యలు హైదరాబాద్ వచ్చారు. వాళ్ళతో కలిసి చూశా.

ఇది నేనుఎప్పటికీ మరువలేని తొలి సినిమా అనుభూతి" అంటూ గుర్తు చేసుకున్నది లావణ్యత్రిపాఠి. ◆

## అమ్మ ఎన్నో ఇచ్చింది

ఇంగ్లండ్‌లోపుట్టి పెరిగి వచ్చి, బాలీవుడ్‌లో హవాచూపిస్తున్న తెలుగు 'మల్లీశ్వరి' కత్రినాకైఫ్‌కు అమ్మంటే అమిత ప్రేమ.

తను అమ్మతోనే కలిసి పెరిగింది. "నా స్నేహితులందరూ వాళ్ళ నాన్నల గురించి చెప్తుంటే నాకు ఏదోలా ఉండేది. అంతేతప్ప మరేమీ ఫీలయ్యేదాన్ని కాదు.

నాకు అమ్మ అన్నీ ఇచ్చింది. అమ్మ తన జీవితాన్ని సమాజసేవకు అంకితం చేసింది. పుట్టగానే తల్లిదండ్రులు వదిలేసిన ఆడపిల్లల్ని ఆదుకోవడానికి 'రిలీఫ్‌ప్రాజెక్ట్ ఇండియా' ట్రస్ట్‌పేరుతో సేవలు అందిస్తున్నది.

నాకు ఎన్నో ఇచ్చిన అమ్మకోసం నేను ఇవ్వాల్సింది ఏమైనా ఉంటే అది తన ఆశయం కోసం పనిచేయడమే" అని చెప్పింది కత్రినాకైఫ్. ◆



## నాన్నకూచి

స్టార్‌కిడ్ జాహ్నవి కపూర్ ఫ్యాషన్ పోకడలో ముందు వరుసలో ఉంటుంది. అమ్మ శ్రీదేవి అందంతో పాటు ఆమె ఫ్యాషన్లు, స్టయిల్స్ మరింత బాగా పట్టేసింది. స్టయిల్‌లో అమ్మ సరసన ఉండే జాహ్నవి నాన్నకూచి.

ఎక్కడికి వెళ్ళినా తండ్రి బోనీ కపూర్‌తో జతకడుతుంది.

సోషల్ మీడియాలో ఏ విషయాన్నయినా షేర్ చేసేస్తుంటుంది. ట్విట్టర్ ఫాలోయింగ్ మరీ ఎక్కువ.

చెల్లి ఖుషితో కలిసి తిరుగుతూ కొత్త కొత్త వస్త్రధారణలతో ఇద్దరూ నలుగురినడుమా తళుక్కుమంటుంటారు. ఇక తొలిసినిమా విడుదల అయిన తర్వాత ఈ పిల్ల స్థాయి ఏ రేంజ్‌లో ఉంటుందో చూడాలి. ◆

## పారితోషికం వద్దండీ

'చిత్రాంగద'పై పెట్టుకున్న ఆశలన్నీ చిత్తుకావడంతో అంజలి కెరీర్‌కు కొర్రుపడింది. తమిళంలో 'బెలూన్' సినిమాలో నటిస్తున్న అంజలి అవకాశాలకోసం ఆశగా చూస్తోంది.

ఇందుకోసం తనవంతు ప్రయత్నాలుసాగిస్తూ, నిర్మాతలకు భలేఆఫర్ ఇచ్చేసింది. పారితోషికాన్ని భారీగా తగ్గిస్తానంటున్నది. అంతేకాదు లేడీ ఓరియంటెడ్ పాత్రలైతే ఫ్రీగా నటించేస్తుందట. ఓ తమిళ నిర్మాత ఇప్పటికే ఆమెతో లేడీ ఓరియంటెడ్ సినిమా తీసే ప్రయత్నాల్లో ఉన్నాడు. అతనితో ఇంకో సినిమా చేయడానికీ రెడీగా ఉందట. ఏం చేస్తుందిలే పాపం! ◆





## తృప్తి ముఖ్యం

ఉన్నదాంతో తృప్తిపడడం అలవాటుచేసుకోవాలంటూ సమంత సూక్తులు చెప్తున్నది. "ఎంత సాధించినా, ఎంతపేరు వచ్చినా ఇంకా ఏదో కావాలనుకుంటూ ఆరాటపడితే తృప్తిఅనేది వుండదు. తృప్తి లేకపోతే మానసిక శాంతి లోపిస్తుంది.

నేను పుడుతూనే స్టార్‌ను కాదుకదా. అన్నీ కలిసొచ్చాయి. ఎందరో అభిమానాన్ని పొందాను. ఆర్థికస్థితి మారింది. వీటితో సంతృప్తిపడ్డాను కాని ఇంకా ఇంకా ఏదో కావాలని ఆరాటపడడంలేదు. ఉన్నదాంతో తృప్తిపడినప్పుడు హాయిగా, ఆనందంగా వుంటుంది" అని చెప్పింది. ◆



## 'సారీ'లు ఎక్కువ

తన గురించి ఇతరులకు తెలియని విషయాలున్నాయంటూ జాబితా చెప్పుకొచ్చింది రాధికా ఆప్టే. "నేను చాలా ప్రైవేట్ పర్సన్‌ను. బాగా ప్రొఫెషనల్ కూడా. 'సారీ'అన్నపదాన్ని చాలా ఎక్కువగా చెప్తుంటా. మళ్ళీ ల్యాండ్‌లైన్ ఫోన్‌వాడుకోవాలన్నది నా కోరిక. ఉత్తరాలు అందుకోవడం నాకు ఇష్టం.

పొడవాటి, తెల్లని డ్రెస్‌లలో నేను చాలా సౌకర్యంగా వుంటాను. ఏ లెంగ్త్ బ్లాక్ డ్రెస్సయినా ఇష్టమే. నచ్చినవారితో కలిసి ఎక్కువసేపు కలిసి కూర్చుని బ్రేక్‌ఫాస్ట్ చేయడం నాకెంతో ఇష్టం" అంటూ వివరించింది రాధికా ఆప్టే. ◆

## నేనో ఓపెన్ బుక్

మిగతా తారల మాదిరి వ్యక్తిగత జీవితంగురించి ఎక్కువగా మాట్లాడవు ఎందుకు అని అనుపమా పరమేశ్వరన్‌ను ప్రశ్నిస్తే నవ్వుల దుమారం రేపుతుంది. "నిజానికి నేనో ఓపెన్ బుక్. డిస్కస్ చేయాల్సినంత విషయం నా వ్యక్తిగత జీవితంలో ఏమీ లేదు.

మా అమ్మ, నాన్న, అన్నయ్య,నా పప్పి విస్కి. ఇదే నా వ్యక్తిగతం. విస్కి నా విషయంలో చాలా పొసెసివ్. కనీసం ఫోన్‌లో కూడా నన్ను మాట్లాడనీయదు. నా ఎటెన్షన్‌ను ఎప్పుడూ డిమాండ్ చేస్తుంటుంది" అని సింపుల్‌గా తేల్చేసింది. ◆

## ఎలా ఆడుతున్నాయి?

- 'అజ్ఞాతవాసి' చాలా దారుణమైన పరాజయం అనే దిశగా పయనిస్తోంది. సినిమా ఖర్చు, అమ్మకాలు భారీ కావడంతో పరాజయం కూడా భారీనే అయింది. అరవై కోట్లమేరకు షేర్ వస్తున్నా, బయ్యర్లు లాస్ అవుతున్నది కూడా అంతేమేరకు వుంది. బయ్యర్లు ఇంత భారీగా నష్టపోవడం అన్నది గతంలో ఎన్నడూ లేదు.

భారీ ఫ్లాపులు వున్నాయి కానీ, మరీ బయ్యర్లు 60 కోట్లమేరకు లాస్ కావడం అన్నది లేదు.

- 'జైసింహా' సినిమా పాతిక కోట్లకుపైగా షేర్ వసూలు చేసింది. డిజిటల్, శాటిలైట్ రైట్స్ అన్నీ కలుపుకుని నిర్మాత గట్టెక్కేశారు. పెద్దగా అమ్మకాలు చేయలేదు కాబట్టి ఇక బయ్యర్లు, లెక్కలు లేవు.
- 'రంగులరాట్నం' చిన్న సినిమా అయినందున గట్టెక్కుతోంది. విడుదలకు ముందే బడ్జెట్ నాలుగు కోట్లూ దాదాపు రికవరీ అయిపోయింది. విడుదలయ్యాక, అలాఅలా రెండుకోట్ల వరకు షేర్‌లాగింది.

కానీ సినిమాపరాజయం పొందినట్లే. హీరో రాజ్ తరుణ్ ఖాతాలో ఓ ఫ్లాప్ పడినట్లే.

- 'గ్యాంగ్' సినిమా రాంగ్‌టైమ్ రిలీజైంది. సూర్య లాంటి పాపులర్ హీరో వున్నా, పండుగ టైమ్‌లో సరైన థియేటర్లు దొరక్కపోవడం, పోటీ ఎక్కువ కావడంతో పెద్దగా ఓపెనింగ్స్ రాలేదు. అయితే మెల్లగా సర్దుకుంది. ఈవారం థియేటర్లలో కొత్త సినిమాలు లేకపోవడంఅన్నది 'గ్యాంగ్' కలెక్షన్లు స్టడీగా ఇంప్రూవ్‌కావడానికి కలిసివచ్చింది.

# చివరి రోజుల్లో...

ఇంగ్లండ్‌లో జరిగిన కారు ప్రమాదం పటౌడి జీవితాన్ని మార్చివేసింది. ఫలితం కారు అద్దంపెంకు వచ్చి అతని కుడికంట్లో గుచ్చుకుంది. కనుగుడ్డు దెబ్బతిన్నది. కాని ఆసుపత్రిలో నుండి పూర్తిగా కోలుకుని బయటకు రాగానే బ్యాట్ పట్టాడు.

ఒంటికంటితో తిరిగి తన పాత సమర్థతతోనే క్రికెట్ ఆడగలనని నిరూపించాడు. ఆరునెలలు తిరగకుండానే భారత్ జట్టులో స్థానం సంపాదించాడు. టెస్ట్‌లో సెంచరీ చేసి తొలిసారిగా భారత్, ఇంగ్లండ్ మీద సిరీస్ గెలుపు సాధించేలా చేశాడు.



మన్సూర్ ఆలీఖాన్ పటౌడీ
(1941-2011)

మన్సూర్ ఆలీఖాన్ పటౌడీ...పాతతరంవారికి పరిచయం అవసరంలేని క్రికెటర్. ఈ తరం వారికి, క్రికెట్ అంటే తెలియనివారికి ఆయన పరిచయం కరిష్మాకపూర్ మామగారుగా చెయ్యాలేమో.

మన్సూర్ ఆలీఖాన్ పుట్టింది నవాబుల కుటుంబంలో. నేటి హరియాణా రాష్ట్రంలోని ఒక బుల్లి సంస్థానం పటౌడీ. ఆయన తండ్రి ఇఫ్తికార్ ఆలీఖాన్ కూడా క్రికెటర్. ఇంగ్లండ్ జట్టులో క్రికెట్ ఆడాడు.

భోపాల్‌లో పుట్టిన మన్సూర్ ఆలీఖాన్, ఆలీఘడ్‌లో చదువుకుని ఆపైన ఇంగ్లండ్‌లో పైచదువులకు వెళ్ళాడు. 16 ఏళ్ళ వయస్సులోనే ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ క్రికెట్ జట్టుకు ఎంపికయ్యాడు.

ఇంగ్లండ్‌లో జరిగిన కారు ప్రమాదం పటౌడీ జీవితాన్ని మార్చివేసింది. ప్రయాణం చేయాల్సినది అర మైలులోపే. అయినా కారు ఎక్కాడు. డ్రైవ్ చేస్తున్న వ్యక్తి వేగం పెంచాడు. మరి దేనికో గుద్దాడు. ఫలితం కారు అద్దం పెంకు వచ్చి అతని కుడికంట్లో గుచ్చుకుంది. కనుగుడ్డు దెబ్బతిన్నది.

కుడికంటి చూపు పోయింది. పోయిన కంటి స్థానంలో కృత్రిమకన్ను అమర్చారు. ఆ కన్ను కన్ను కాదు. చూసేందుకు పనికిరాని కన్ను. అక్కడ కనుగుడ్డు స్థిరంగా నిలిచివుంటుంది అంతే.

ఇక క్రికెట్ గురించి మరచిపోవటమే మన్సూర్ ఆలీఖాన్ పటౌడీకి మిగిలింది అనుకున్నారు. కాని ఆసుపత్రిలో నుండి పూర్తిగా కోలుకుని బయటకు రాగానే బ్యాట్ పట్టాడు. ఒంటి కంటితో తిరిగి తన పాత సమర్థతతోనే క్రికెట్ ఆడగలనని నిరూపించాడు. 1961 జూలైలో కన్ను పోయింది.

ఆరునెలలు తిరగకుండానే భారత్ జట్టులో స్థానం సంపాదించాడు. టెస్ట్‌లో సెంచరీ చేసి తొలిసారిగా భారత్, ఇంగ్లండ్ మీద సిరీస్ గెలుపు సాధించేలా చేశాడు. 1962లో వెస్ట్ ఇండీస్ పర్యటన జట్టుకు పటౌడీ వైస్ కెప్టెన్.

కెప్టెన్ నారీ కంట్రాక్టర్ తలకు క్రికెట్ బంతితగిలి బలమైన గాయంతో ఆటకు దూరం కావటంతో వైస్ కెప్టెన్‌గా వున్న పటౌడీ కెప్టెన్ అయ్యాడు.

అంత జూనియర్ కింద తాము ఆడటం ఏమిటని సీనియర్స్ నిరసన తెలియచేసినా జట్టును అద్భుతంగా నడిపించి అతనే కెప్టెన్ అనిపించుకోగలిగాడు. దాదాపు ఎనిమిదేళ్ళపాటు పటౌడీకి తిరుగులేదు భారత్ క్రికెట్‌లో. క్రికెట్ ఫీల్డ్‌లో అతగాడు ప్రదర్శించే మెరుపు వేగపు ఫీల్డింగ్, బ్యాటింగ్‌లో ప్రదర్శించే ధైర్యం టైగర్ టైటిల్‌ని తెచ్చిపెట్టింది.

అంత చిన్నవయసులో క్రికెట్ కెప్టెన్ అనిపించుకోవటం ఒక రికార్డు. 1968లో తొలిసారిగా భారత దేశానికి విదేశీ గడ్డమీద టెస్ట్ విజయం,సిరీస్ విజయం సంపాదించిపెట్టిన ఘనత మన్సూర్ ఆలీఖాన్‌దే. ఆడిన 46 టెస్ట్ పోటీల్లో 40 మ్యాచ్‌లు కెప్టెన్‌గా ఆడటం కూడా ఒక రికార్డ్.

1971లో పటౌడీని కెప్టెన్సీ నుంచే కాదు జట్టులో నుంచి తొలగించారు. తిరిగి కెప్టెన్సీ సంక్షోభం వచ్చినప్పుడు నువ్వే నడిపించమని వేడుకున్నారు. అలా మరోసారి 1974-75లో కెప్టెన్‌గా ఆడి ఆ తర్వాత క్రికెట్‌నుండి రిటైర్ అయ్యాడు.

క్రికెట్‌లో ఉన్నతంగా వున్నప్పుడే సినీ హీరోయిన్ షర్మిలా ఠాగూర్‌ని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. షూటింగ్ ఎగ్గొట్టి షర్మిల క్రికెట్ గ్రౌండ్‌కి చేరేదనేవారు నాడు. షర్మిల ప్రేక్షకుల్లో వుంటే రెచ్చిపోయి ఆడటమో లేకుంటే త్వరగా అవుటై ఆమెకోసం వెళ్ళిపోవటమో చేస్తాడు అనేవారు నాడు.

నవాబుగా అందుకోవాల్సిన రాజభరణాన్ని ఇందిరాగాంధీ రద్దుచేసినప్పుడు కోపంతో రాజకీయాల్లోకి దిగి, కాంగ్రెస్‌కి వ్యతిరేకంగా పోటీచేసి ఓడిపోయాడు.ఆ తర్వాత మరెన్నడూ రాజకీయాల జోలికి వెళ్ళలేదు. క్రికెట్ ఆడటం ఆగిపోయినా పటౌడీ క్రికెట్‌తో సంబంధాలు వదులుకోలేదు.

ఇండియన్ క్రికెట్ టీమ్‌కి మేనేజర్‌గా వెళ్ళాడు. ఆ తర్వాత క్రికెట్ టెస్ట్ మ్యాచ్‌లకు రిఫరీగా పని చేశాడు. చాలామంది క్రికెటర్లు ఫాస్ట్ బౌలింగ్‌ని ఎదుర్కోవటంలో ఇబ్బంది అనిపించినప్పుడు పటౌడీని ఆశ్రయించి పాఠాలు నేర్చుకునేవారు.

చాలామంది కెరీర్‌లు పటౌడీ కెప్టెన్సీలోనే మొదలై వికసించాయి. ఆ రోజుల్లో క్రికెట్ జట్టులో వున్న ఉత్తర భారత, దక్షిణ భారత విభేదాలకు పరిష్కారం పటౌడీ కెప్టెన్సీ అనేవారు.

2007లో తొలిసారిగా ఐ.పి.ఎల్. మొదలైనప్పుడు దాని నిర్వహణకు ఏర్పాటుచేసిన గవర్నింగ్ కౌన్సిల్‌లో మన్సూర్ ఆలీఖాన్ పటౌడీ సభ్యుడు.

తొలిసారి ఐ.పి.ఎల్. బాగా సక్సెస్ అయింది. ఆ తర్వాత వివాదంలో పడింది.అందుకే 2010లో తాను ఆ గవర్నింగ్ కౌన్సిల్‌లో వుండలేనని చెప్పాడు. అప్పటినుండి క్రికెట్‌కి పూర్తిగా దూరమయ్యాడు.

టైగర్ పటౌడీకి వున్న అలవాట్లు రెండే. ఒకటి డ్రింక్స్, రెండవది సిగరెట్. వయసులో వున్నంతవరకు ఆ రెండు అలవాట్లు అంతగా ఇబ్బందిపెట్టలేదు.

అటువంటి పటౌడీకి వయసు మీదపడుతుండేసరికి శ్వాస సమస్యలు మొదలయ్యాయి.

ఊపిరితిత్తుల్లోకి వచ్చే గాలిలోని ఆక్సిజన్‌ని పూర్తిగా గ్రహించలేని స్థితికి చేరాయి.శరీరానికి తగినంత ఆక్సిజన్ అందించలేకపోతున్నది.

ఆయనకు వచ్చిన అనారోగ్యం పల్మనరీ ఫైబ్రోసిస్ అని దానికి చికిత్స అంటూ లేదన్నారు.

శరీరానికి ఆక్సిజన్ సరఫరా జరగకుంటే శక్తి అందదు. గుండెకు రక్తం సరిగా అందదు. శరీర అంగాలన్నింటికీ సమస్య వస్తుంది. ఐనా ఇంగ్లండ్ వెళ్ళటానికి ఏర్పాట్లు చేసుకున్నాడు. వారి కుటుంబం గౌరవసూచకంగా ఏర్పాటుచేసిన పటౌడీ ట్రోఫీని అందించేందుకు వెళ్ళాడు. అక్కడ బహుమతి అందించి ఇండియా వచ్చి అడ్డంపడ్డాడు.

దాదాపు మూడునెలలు ఐ.సి.యులో వున్నాడు. ఎంతో మెరుగైన చికిత్స అందిస్తున్నారు. ఐనా ఎటువంటి మార్పూ కనిపించటంలేదు. ఆసుపత్రిలో చేర్చినప్పుడు 60 శాతం ఆక్సిజన్‌మాత్రమే అందుతున్నది. అది క్రమంగా పడిపోసాగింది. ఒక దశలో అది కేవలం 30-40 శాతం మధ్య ఊగిసలాడింది.

భార్య షర్మిలాఠాగోర్, కొడుకు సైఫ్, ఇద్దరు కూతుళ్ళు అందరూ ఆసుపత్రిలో ఆయన మంచం చుట్టూ వుండగానే ప్రాణం పోయింది.

ఢిల్లీలో క్రికెట్ అభిమానులు చివరిగా చూసి వీడ్కోలు ఇవ్వగా హరియాణాలోని వారి స్వగ్రామంలో ఆ మాజీ నవాబుని ఖననం చేశారు.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

ఎల్.లక్ష్మీనాయుడు, సింహాచలం

**ప్రభుత్వ ఆసుపత్రికి, ప్రైవేట్ ఆసుపత్రికి తేడా?**

ప్రభుత్వాసుపత్రిలో ప్రాణం ఉన్నా వైద్యం చెయ్యరు... అదే ప్రైవేట్ ఆసుపత్రిలో ప్రాణంపోయినా చేస్తారు.

పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

**పునాది?**

కనిపించకుండా ఇంటి బరువునంతా మోసేది.

పి.యోబు, ముదునూరు

**'జ'నవరి నుండి 'డి'శంబరు వరకు మనిషి ఎలా బతుకుతున్నాడు?**

'జడి'సిపోతూ.

ఎమ్.కృష్ణ, కాకినాడ

**తిండీ తిప్పలు కామెంట్?**

ఏది వున్నా రెండోది వుండదు.

డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

**జీవితంలో మరచిపోలేని సంఘటన చెప్పమని అడిగితే?**

గుర్తుతెచ్చుకుని చెబుతాననడం.

ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

**అబద్ధాలాడటం ఎలాంటి దాడి?**

'లై'ంగిక దాడిలాంటిది.

కాశీ, విశాఖపట్నం

**'తాళి' కామెంట్ ప్లీజ్?**

కట్టినోడినే కట్టిపడేసేది.

జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి

**ఎంత గుంజినా రానిది?**

ఎమర్జెన్సీ డోర్.

## B హ్యాపీ





ఎమ్.ఆర్. అప్పారావు ప్రొహిబిషన్ మంత్రి. చల్లపల్లి రాజాగారు ఆరోగ్య మంత్రిగా వుండేవారు.

"అప్పారావుగారికి జలుబు చేసింది. మీ డిపార్ట్‌మెంట్‌కి రావాలనుకుంటున్నారు" అని ఎవరో చెపితే "భలేవారే... మాకు జలుబుచేస్తే మేమే వారి డిపార్ట్‌మెంట్‌కి వెళుతుంటాం" అంటూ చమత్కరించారు చల్లపల్లి రాజా.

కాపురానికి వెళుతున్న కూతురికి తల్లి జాగ్రత్తలు చెపుతూ "మొగుడిని పల్లెత్తు మాట అనకు... లోపాలు లేని వారుండరు... అనవసరంగా మాటలని కోపం తెప్పించకు" అనగానే 'అదెలా గమ్మా' అని సందేహం వెలిబుచ్చింది.

ఏం ఎందుకు కాదు- మీ నాన్న లోభి, మూర్ఖుడు, అబద్ధం తప్పించి నిజంచెప్పడు.నేనెప్పుడైనా పల్లెత్తుమాట అన్నానా! నువ్వు సర్దుకుపోవాలి మరి.

కొత్తగా ప్రారంభించిన రోడ్డుమీదికి వచ్చే వెయ్యో వాహనానికి వెయ్యి రూపాయల బహుమతి ఇవ్వాలనుకున్నారుట్రాఫిక్‌పోలీసులు.సరిగ్గా వెయ్యో వాహనం దేవదాస్‌ది. ఆయనకు వెయ్యి రూపాయలు చేతిలోపెట్టి 'దీనితో ఏం చేస్తారు?' అని అడిగాడు ఎస్.ఐ.

"ఏముంది... డ్రైవింగ్ లైసెన్స్ ఫీజు కడతా" అనేసరికి ఆశ్చర్యపోతున్న ఎస్.ఐని చూసి పక్కనే వున్న దేవదాసు భార్య "మా ఆయన తాగిన మత్తులో ఏదో వాగుతూ ఉంటాడు పట్టించుకోకండి" అనేసరికి కళ్ళు తిరిగీ 'దిగుముందు' అని గర్జించాడు.

వెనక సీటులో వున్న తండ్రి "నేను చెప్పలేదట్రా... దొంగతనం చేసిన కారుతో మెయిన్‌రోడ్డు ఎక్కకూడదని" అనేసరికి ఎస్.ఐ. కిందపడిపోయాడు.

ఇద్దరు లాయర్లు బ్యాంక్‌లో వుండగా దోపిడీ దొంగలు వచ్చి అందర్నీ చేతులెత్తి నిలబడమన్నారు. ఒక దొంగ లోపలి బ్యాంక్ డబ్బు దోచేస్తుంటే, మరొకడు బ్యాంక్‌లో వున్నవాళ్ళ ఒంటి మీదున్న నగలు, జేబులో డబ్బులు దోచేస్తున్నాడు.

ఇంతలో ఒక లాయర్ హఠాత్తుగా తన పర్స్‌లో నుండి రెండువేలు తీసి పక్క లాయర్‌కి ఇచ్చాడు.

'ఇదేమిటి' అని ఆ లాయర్ ఆశ్చర్యపోతుంటే... "నేను నీకు గతంలో వున్న అప్పు... ఇప్పుడు గుర్తొచ్చి తీరుస్తున్నా" అని మళ్ళీ చేతులెత్తి నిలుచున్నాడు మొదటి లాయర్.

తెలుగు టీచర్ మానవ జన్మ అదృష్టం.... మన మంతా దేవుడుచేత ప్రత్యేకంగా ఈ లోకంలోకి పంపబడ్డాం అని చెపుతుంటే ఒక కుర్రాడు లేచి అదేమిటండీ మా నాన్న మనమంతా కోతులనుండి చెప్పారే అన్నాడు.

అది మీ కుటుంబం సంగతి...

నేను చెప్పేది మిగిలినవాళ్ళ గురించి అంటూ తన పాఠం కొనసాగించాడు ఆ తెలుగు టీచర్.

## ఈ కార్టూన్ మీదే




భయమనే వరదను అరికట్టటానికి ధైర్యమనే ఆనకట్టను నిరంతరం నిర్మించుకోవాలి.



SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS AUTONAGAR VIJAYAWADA
RNI 38008 / 1984 REGD NO.VJ / 025 / 2018-20 L.NO.